# రావిశాస్త్రి కథా ప్రపంచం

## సాహితీ వేదిక సదస్సు పత్రాలు

సంపాదకుడు

## వెంకట రామయ్య గంపా

## సాహితీ వేదిక ఢిల్లీ

మహా రచయితలు మానవజాతి సంపద. రాచకొండ విశ్వనాథశాస్త్రి మహారచయిత. కనుక ఆయన మన జాతి సంపద. అంటే తెలుగు జాతికి లభించిన సంపద.

- వివినమూర్తి

జీవితాన్ని, మనుషుల మధ్య సంబంధాలను నడిపించే శక్తుల గురించి అవగాహన కల్పించే కథాంశాలు రావిశాస్త్రి రచనలు.

- ఆచార్య కాత్యాయనీ విద్మహే

టాల్‌స్టాయి రచనల్లో పాత్రచిత్రణ పట్ల ప్రత్యేక శ్రద్ధ కనపడుతుంది. రావిశాస్త్రి పాత్రలు కూడా కథానిర్మాణం లోని చాలా అంశాలను వెనక్కి నెట్టి ముందుకు వచ్చి నిలబడతాయి.

- డా. ఎన్ . మల్లీశ్వరి

రావిశాస్త్రి కథా ప్రపంచం

సాహితీ వేదిక సదస్సు పత్రాలు



సంపాదకుడు

వెంకటరామయ్య గంపా

సాహితీ వేదిక ఢిల్లీ

# రావిశాస్త్రి కథా ప్రపంచం

## సాహితీ వేదిక సదస్సు పత్రాలు

20-04-2014

సంపాదకుడు

వెంకట రామయ్య గంపా

సాహితీ వేదిక

ఢిల్లీ


రావిశాస్త్రి కథా ప్రపంచం

సాహితీ వేదిక సదస్సు పత్రాలు

20-04-2014

Ravishastri Katha Prapancham
Sahiti Vedika Seminar Papers
20-04-2014

Editor
Venkata Ramaiah Gampa

సంపాదకుడు

వెంకట రామయ్య గంపా

ప్రథమ ముద్రణ : మార్చి 2015

ప్రచురణ: సాహితీ వేదిక, ఢిల్లీ.

**వెల : రూ. 100/-**

ప్రతులకు:

వెంకట రామయ్య గంపా

ఫోన్: 09958607789

ఈ పుస్తకం **kinige.com** , **archive.org**

ద్వారా ఉచితంగా download చేసుకోవచ్చు.

# అంకితం

రాచకొండ విశ్వనాథశాస్త్రి రచనా సాగరాన్ని మథించిన
వివినమూర్తి గారికి...

# కృతజ్ఞతలు

**రావిశాస్త్రి కథా ప్రపంచం** సాహితీ సదస్సు 20-04-2014 తారీఖున సాహితీవేదిక సభ్యుల సహాయ సహకారాలతో ఢిల్లీలో విజయవంతంగా జరిగింది.

ఈ సదస్సులో పాల్గొనడానికి తెలుగు ప్రాంతం నుంచి బహుదూరం ప్రయాణం చేసివచ్చి కీలకోపన్యాసం చేసిన వివినమూర్తిగారికి ధన్యవాదాలు. అంతేకాకుండా రావిశాస్త్రిగారి ఛాయాచిత్రాన్ని పుస్తకం కోసం వాడుకుంటామని అడిగిన వెంటనే ఆయన అనుమతించారు.

వీరితోపాటు సదస్సులో పాల్గొని పత్రాన్ని సమర్పించిన రామలక్ష్మిగారికి....

రావిశాస్త్రిగారి సదస్సు కోసం పత్రాలు పంపిన ఆచార్య కాత్యాయనీ విద్మహే గారికి, డా. యన్. మల్లీశ్వరిగారికి , బీనాదేవిగారికి, అట్టాడ అప్పల్నాయుడుగారికి ...

వ్యాసకర్తలు దాసరి అమరేంద్ర, డా. కమలాదేవి, యమ్వీ లక్ష్మి, కామేశ్వరరావు, శ్రీనివాసమూర్తి, యమ్. కుసుమ గార్లకు...

వ్యాసాలను టైపుచేసిన శిరీష ఈదుప్గంటికి...

వ్యాసాలను పుస్తక రూపంలో రావాలని ఆకాంక్షించిన డా. లక్ష్మిరెడ్డి, తిలక్, దాసరి అమరేంద్ర గార్లకు...

**కృతజ్ఞతలు.**

వెంకట రామయ్య

సంపాదకుడు



# మా మాట

'సాహితీవేదిక'లో ప్రతి మాసం ఒక అంశంపై చర్చించుకోవడం అనేది కొన్ని సంవత్సరాలుగా కొనసాగుతున్న సంప్రదాయం. ఆ విధంగా ఒక మాసంలో రావిశాస్త్రిగారి సాహిత్యాన్ని చర్చించుకుందామని, ఈ సాహితీ చర్చ మూడు గంటలు కొనసాగాలని నిర్ణయించుకున్నాం. అయితే తరువాత రావిశాస్త్రి రచనలను మూడుగంటల సమయంలో చర్చించడం కంటే ఒక రోజు మొత్తం దానికి కేటాయిస్తే బాగుంటుందనే అభిప్రాయం సాహితీ వేదిక సభ్యులకు కలిగింది. ఈ వేదిక ప్రతి సంవత్సరం ఒక రోజు పూర్తి స్థాయి సదస్సు నిర్వహిస్తూ వుంది. అదే విధంగా రావిశాస్త్రిగారి రచనలపై ఒక రోజు పూర్తిస్థాయిలో చర్చిస్తే బాగుంటుందని సభ్యులు నిర్ణయించారు. అయితే రావిశాస్త్రి గారి రచనలన్నిటినీ చర్చించడం కష్టం కాబట్టి చర్చను కేవలం కథల వరకే పరిమితం చేసుకుంటే బాగుంటుందని నిర్ణయించారు. ఆ విధంగా ఈ సదస్సుకు అంకురార్పణ జరిగింది.

ఆధునిక తెలుగు సాహిత్యంలో రావిశాస్త్రిగారి స్థానం ప్రత్యేకమైనది. వారి రచనలను అభిమానించని తెలుగు పాఠకులు లేరు. ముఖ్యంగా వారి వచన శైలి తెలుగు పాఠకులను అమితంగా ఆకట్టుకుంది. రచనలకు వారు ఎంచుకున్న సామాన్యుల జీవితాలు వారిని ప్రజా రచయితగా నిలబెట్టాయి. అటువంటి రచయిత కథలను విశ్లేషించడం కొంత క్లిష్టమైన విషయం. అయినా ఇందులో ఉన్న వ్యాసాల్లో రావిశాస్త్రి కథలన్నిటినీ కొంతమేరకు చర్చించే ప్రయత్నం జరిగింది.

రావిశాస్త్రి కథా ప్రపంచం సదస్సుకు కీలకోపన్యాసం చేసిన వివినమూర్తిగారు *రాచకొండ విశ్వనాథ శాస్త్రి రచనా సాగరం* పేరుతో రావిశాస్త్రిగారి రచనలన్నిటినీ సమగ్రంగా ప్రచురించారు. వీరు రావిశాస్త్రిగారి రచనలపై ఉన్న సమగ్రమైన అవగాహనతో చాలా విలువైన సమాచారాన్ని అందించారు. వారు రావిశాస్త్రి రచనలను, రావిశాస్త్రిగారి జీవితాన్ని సమన్వయం చేసి ప్రసంగించారు. ఆ ప్రసంగ పాఠాన్ని యథాతథంగా ఇందులోని మొదటి

వ్యాసంలో చేర్చాము.

కథలను చర్చిస్తున్నప్పుడు కొన్ని కథలు పునరావృతమయ్యాయి. అలా పునరావృతమైన కథలలోని విషయం ఒక్కటే అయినప్పటికీ వ్యాసకర్త దృక్పథం వేరుగా కనిపిస్తుంది. కాబట్టి ఆ వ్యాసంలో చర్చించిన విధానం కూడా విభిన్నంగా ఉంది. వ్యాసకర్తలు వ్యాసాలలో కథా శైలి, పాత్రచిత్రణ, ఉపమానాలతో కూడిన వర్ణనలు, సామాజిక, పరిస్థితులు... మొదలైన కోణాలెన్నింటినో చూపించారు.



## సాహితీ వేదిక, ఢిల్లీ గురించి క్లుప్తంగా...

ఢిల్లీలో సాహిత్యం పట్ల ఆసక్తి ఉన్న పది-పదిహేను మంది సభ్యుల సమూహం **సాహితీవేదిక, ఢిల్లీ.** దాదాపు ఇరవై సంవత్సరాలుగా సాహితీ వేదిక కొనసాగుతూంది. 1993-94 ప్రాంతంలో పెంగ్విన్ రంగారావు, జె.లక్ష్మిరెడ్డి, సంపత్ కుమార్, తోలేటి జగన్ మోహన్ రావు, దాసరి అమరేంద్ర సాహిత్యం మీద ఉన్న ఆసక్తితో కలిసి తరచూ చర్చించుకునేవారు. వారి మధ్య చర్చలు ప్రణాళిక పద్ధతిలో సమావేశ స్థాయిని అందుకున్నాయి. తరువాత ప్రతి నెలలో ఒక ఆదివారం ఒక్కొక్క సభ్యుని ఇంటిలో సమావేశాలు ఏర్పాటు చేసుకుని చర్చను కొనసాగించారు. ఆదివారాన్ని పూర్తిగా సాహితీ చర్చలకే కేటాయించిన సందర్భాలు కూడా ఉన్నాయి. సభ్యుల రచనలను చర్చించుకోవడం, సాహితీ విషయాలను పంచుకోవడం వంటి విషయాలు ప్రధానంగా జరుగుతూ వచ్చాయి.

తరువాతి కాలంలో బి.బి.జి. తిలక్, కె. సుజాత, శాంతాసుందరి, గణేశ్వరరావు, మురళీధర్ గౌడ్, కె.శ్యామల, విజయమూర్తి, కె. వసంత లక్ష్మి, వి.వి.బి.రామారావు, బి.పి.కె. దాస్, కోటిరెడ్డి, సుబ్రహ్మణ్యం మొదలైనవారు సాహితీవేదిక సభ్యులుగా చేరి సాహితీవేదికను బలోపేతం చేశారు. ఆ సమయంలో కథాసదస్సు (కథ-96 పుస్తకం ఆవిష్కరణ) కార్యక్రమం జరిగింది. ఆంధ్ర అసోషియేషన్ వారి సహకారంతో వజ్రాయుధం సోమసుందర్ గారు ముఖ్య అతిథిగా 90లలో కవితా సదస్సు నిర్వహించారు. సాహితీ సభ్యులు ఢిల్లీయేతర ప్రాంతాలకు ఉద్యోగరీత్యా వెళ్ళడంతో దాదాపు ఒక దశాబ్ద కాలం తరువాత అయిదు సంవత్సరాల విరామం ఏర్పడింది. తరువాత యమ్వీ లక్ష్మి, యస్వీ రామారావు (ప్రముఖ చిత్రకారుడు) కె.జి. రావు, సుబ్బారావు, శాంతిశ్రీ, రమేశ్ ఆర్యా, వెంకట రామయ్య గంపా, సురేఖ, పత్తిపాక మోహన్, కృష్ణారావు, కమలాదేవి, కామేశ్వర రావు, శ్రీనివాసమూర్తి మొదలైన వారు సాహితీవేదికలో సభ్యులయ్యారు.

సాహితీవేదిక 2013 ఏప్రిల్‌లో **జీవితం–సాహిత్యం** అనే అంశంపై సదస్సు నిర్వహించింది. వాసిరెడ్డి నవీన్ గారు కీలకోపన్యాసం చేశారు. 2014 ఏప్రిల్‌లో **రావిశాస్త్రి కథా ప్రపంచం** పేరుతో రావిశాస్త్రి కథలపైన సదస్సు నిర్వహించింది. 2014 సెప్టెంబర్‌లో ఓల్గాగారి సంతులిత, విముక్త పుస్తకాల ఆవిష్కరణ సభను కూడా సాహితీ వేదిక నిర్వహించింది. 2015 మార్చిలో **కొడవటిగంటి కుటుంబరావు సాహిత్య సమాలోచనం** పేరుతో ఒక సదస్సును సాహితీ వేదిక నిర్వహించబోతూంది.

# వ్యాస సూచిక

## రాచకొండ మన సంపద

: వివినమూర్తి

మహా రచయితలు మానవజాతి సంపద.

రాచకొండ విశ్వనాథశాస్త్రి మహారచయిత. కనుక ఆయన మన జాతి సంపద. అంటే తెలుగు జాతికి లభించిన సంపద. తెలుగు అనబడే భాషలో వ్యక్తమైన ఒక ప్రపంచ మానవుని సామూహిక వేదన. వ్యక్తి నివేదన. మానవ దు:ఖ సంశోధన. మానవజాతి సుఖసంతోషాల కోసం తల్లడిల్లటం మహా రచయిత లక్షణం. కనుక తెలుగు మాట్లాడేవారు తమ భాషలో వ్యక్తమైన ఈ భావనలను ప్రపంచమంతటికీ అందించాలి. అంటే మానవజాతి సంపదను పంచాలి. ప్రదర్శించుకోవటం వేరు. పంచటం వేరు. ప్రదర్శించటంలో అది మా వస్తువు అనే ఘనత, ఒంటెత్తుతనం ఉండే అవకాశం ఉంది. పంచటంలో మావద్ద ఉండిపోయిన మనందరి వస్తువూ, మనందరి వినియోగం కోసం అందిస్తున్నామన్న బాధ్యత, ఐక్యత ఉంటాయి.

నా ప్రసంగాన్ని ఆయన సమగ్ర సాహితీ స్వరూపాన్నీ, జీవిత సారాన్నీ ఈ వ్యాసంలో నాకు చేతనైన మేరకు వివరించేందుకు పరిమితం చేసుకుంటున్నాను.

ప్రవృత్తి, వృత్తి, వ్యావృత్తి ఒకటిగా కలవారు అరుదు. సాహిత్యంలో అలాంటివారు చాలా అరుదు. అటువంటి అరుదైన రచయితలలో రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు ఒకరు. అసహాయుల సహాయం కోసం పరుగెత్తడం లేదా ఉరుకెయ్యటం ఆయన ప్రవృత్తి. ఆయన దృష్టిలో అసహాయులు ఆర్థికంగా పేదలు. కూటికోసం, అడవా చాకిరీ చేసేవారు. ఆ అడవా చాకిరీలో చట్టం నేరంగా భావించే పనులైనా సరే చేసేవారు. పేదరికం మనిషి విలువలన్నింటినీ ధ్వంసం చేస్తుంది. Poverty makes people lose sight of larger perspective. It makes them small, mean and wretched అని ఓచోట రాసుకుంటారు శాస్త్రిగారు. పేదరికం వారిని దొంగలుగా చేస్తుంది. వేశ్యలుగా మారుస్తుంది. దొరికిన వారిని నేరస్తులంటుంది. వారి నేరం రుజువు చేయటానికి సమస్త రాజ్యమూ, దాని అంగాలూ ఒక్కటవుతాయి. ఇదీ ఆయన మౌలిక అవగాహన.





ఆయన వృత్తి న్యాయవాదం. క్రిమినల్ లాయర్. చట్టం, దాని లొసుగులు క్షుణ్ణంగా తెలిసి తర్కం, వాదనా పటిమ ఉన్నవారు. హాయిగా పుష్కలంగా సంపాదించుకునే అవకాశం ఉన్న వృత్తి. ధనం గల నేరస్తుల నేరాలలో అధికభాగం ధనం పెంచుకోవటానికే చేసేవి. కొన్ని నేరాలు ధనం ఉందన్న భరోసాతో చేసేవి. అహంకారంతో చేసేవి. భయపెట్టటానికి చేసేవి. చేశాక వారికి నేరం తప్పించుకునే అవకాశాలు కల్పించాలి. తప్పకపోతే శిక్ష ఆలస్యం చెయ్యాలి. శిక్ష తగ్గించాలి. నేరం మీద వేసుకునే పేదలను వెదకాలి. ఇవన్నీ చేసిపెట్టి వారిని కాపాడి తమను పెంచుకోవటానికి అంతులేని అవకాశాలున్న వృత్తి. కాని శాస్త్రిగారు అసహాయుల ప్లీడరు. వారిచ్చే ఫీజు చట్టం అనుమతించేటంత కూడా ఉండదు. ఒక దణ్ణం .. ఓ పండు.. ఓ వేశ్య శరీరం అమ్ముకున్న పదీ, పరకా... ఒక బక్క రైతు శరీర కష్టం... చాత్రిబాబు పేరు. కోర్టులో పెట్టుకున్న మొర, చేసిన వాదన జడ్జిని కదిలించకపోతే ప్రజల కోర్టులో తన వాదన వినిపించటమే రావిశాస్త్రిగారి సాహిత్యం. అదే ఆయన వ్యావృత్తి.

13వ సంవత్సరం నుంచి సాహిత్యం రాయటం చదవటం అలవాటున్నట్టు ఆ వయసులోనే రాసిన దినచర్యలలో తెలుస్తాయి. ప్రపంచ రాజకీయాల పట్ల అవగాహన, పక్షం వహించటం ఆయనలో ఆ వయసు నుంచే కనిపిస్తుంది. పక్షపాతం ఉండవలసిన గుణంగా ఆయన నమ్మారు. పక్షపాతం ఉండకుండా ఉండదన్న అవగాహన వారిది. పేదల పట్ల పక్షపాతం ఆయనిది. పెద్దవాళ్ళలా రాసేద్దామన్న సరదా కోసం మా ఇంట్లో వాళ్ళ దగ్గర గొప్ప కోసమూ రాశానని పెద్దవారయ్యాక రాసుకున్నారు రావిశాస్త్రి. ఆ వయసులో అలాగే రాసుకున్నా, తొలికథలలోనే ఆయన సమాజం, వ్యక్తుల పరిశీలన, మంచిచెడ్డల నిర్ణయం కనిపిస్తాయి. ఆ కథలన్నీ స్వంత పేరుతోనే రాశారు. నాకు లభించిన ఒక కథ ముద్రణ అయిందో లేదో తెలీదు. ఆ కథలో కథానాయకుడు పెళ్లి చేసుకుని ప్రేమ ఫలింపజేసుకుని సుఖంగా ఉండాలా... కష్టపు బ్రతుకు బ్రతికి తిండికి లేక అల్లాడే రైతుల కష్టాలని నిర్మూలించడానికి జీవితం ధార పోయాలా అన్న డైలమాతో ముగుస్తుంది. ఇది చిన్నతనంలో రాసిన తొలికథలలో ఒకటి. అలాగే పదహారవ ఏట రాసిన *మీరే ఆలోచించండి* కథలో ఫ్యాక్టరీ కార్మికుల కష్టాలు, సమ్మె ప్రస్తావన ఉంది.

ఆయన విశాఖనుంచి బయటకు వచ్చి, ఉద్యోగం, చదువూ, ప్లీడరీ వగైరాల

తర్వాత రాసిన కథలన్నీ మారుపేర్లతో రాసినవే. స్వాతంత్ర్యానంతరం మత కలహాల గురించి కాకి అనే కలం పేరుతో *దెయ్యాలకు ద్వేషాల్లేవ్* అనే కథ రాసినట్టు తెలుస్తుంది. ఆ కథ ఇంతవరకూ లభించలేదు. మనుష్యులుగా ఉన్నప్పుడే ద్వేషాలుంటాయి గానీ చనిపోయాక కాదు అన్న ఆలోచన మీద కథ అది. అలా రావిశాస్త్రి రెండవదశ ఆరంభమయింది. ఆ దశలో *విలువలు, మెరుపు మెరిసింది, ఆఖరు దశ, కోర్టుకు రాని సాక్షులు* మొదలైన కథలు రాసారు. ఈ దశలో జాస్మిన్ వంటి పేర్లతో రాసిన నాలుగు కథలు *రచనాసాగరం* ముద్రణ పూర్తయిన తర్వాత నా కథానిలయం అన్వేషణలో లభించాయి. *అల్పజీవి* నవల ఆయన పేరుతో సంపాదకుల చొరవతో ప్రచురించబడింది. ఆయనకు సాహితీ ప్రపంచం హారతులు పట్టింది. దానితో రచయితగా తన బాధ్యత పెరిగిందని ఆయన చెప్పుకున్నారు. ఈ దశలోనే *కోర్టుకు రాని సాక్షులు* అనే కథ తొలిసారిగా కోర్టుల మీద రాశారు.

గొప్ప రచయితలకి బైట ప్రపంచం మీద ఎంత పరిశీలన ఉంటుందో అంత పరిశీలనా తమ అంతరంగం మీదా, తమ అంతరంగాన్ని ప్రతిక్షణం నియంత్రించే తమ సమూహం మీదా ఉంటుంది. మనదేశంలో వ్యక్తుల అంతరంగం సమూహ జీవనంతో చాలా బలంగా ప్రభావితం అవుతుంది. శాస్త్రిగారి ఈ పరిశీలనతో కూడా కథలు వచ్చాయి. వాటిలో *విలువలు, అగ్గిపుల్ల* వంటివి చాలా ప్రసిద్ధమైనవి. *విలువలు* తొలిదశలో రాసిన కథ. *అగ్గిపుల్ల* బాగా పరిణితి వచ్చాక రాసిన కథ.

సాహితీ ప్రపంచం గుర్తింపు తెచ్చిన *అల్పజీవి* తర్వాత రావిశాస్త్రిగారి *ఆరు సారాకథలు* తెలుగు సాహిత్యానికే ఓ మలుపు. ఇవి విశాలాంధ్ర దిన పత్రికలో 1961 మార్చి, ఏప్రిల్ నెలల్లో వచ్చాయి. ఈ మధ్యకాలంలో వారు చాలా కథలు రాశారు. ఆనాడు *కథాసాగరం 13* గా 1955 లో వారి కథలు తొలిసారి సంపుటంగా వచ్చాయి. ఈ కాలంలో వచ్చిన కథలు వ్యక్తిగా వారి ప్రవృత్తిని బహురూపాలలో ప్రదర్శించాయి. తన చుట్టూ ఉన్న పేదరికాన్ని దగ్గరగా చూశారు. తన పేదరికం నుంచి ఆరంభమైన శాస్త్రిగారు సమాజపు పేదరికం వైపు సాగారు. పేదరికాన్ని ఒక సామాజిక ఫలితంగా అర్థం చేసుకునే ప్రయత్నం ఆయనలో ఆరంభమయింది. అదే సమయంలో పేదలలో ఉన్న దైన్యాన్నీ, హైన్యాన్నీ చూశారు. మనిషి స్వభావంలో వాటిని ఎదుర్కోవటంలో దాగున్న





సాహసాన్నీ, ధైర్యాన్నీ చూశారు. ప్రపంచంలో ఉత్తమ సాహిత్యానికి ఉన్న సాధారణ లక్షణం మనిషి పరిస్థితులతో చేసే పోరాటాన్ని గుర్తించటం. దాన్ని కీర్తించటం. హెమింగ్వే *old man and the sea* మనిషిలోని ఈ స్వభావం సులువుగా వివరించటానికి ఒక ఉదాహరణ. ఆశలు – అందులోనూ ఎంతో మానవ సహజమైన, వయో సహజమైన చిన్ని చిన్ని ఆశలు – తీరకపోటం *పువ్వులు, జరీ అంచు తెల్లచీర* వంటి కథలలో ఆయన చూపించారు. అవి తీరకపోవటం ఒక వ్యక్తిగత విషాద ఘటనగానో, కర్మ ఫలితంగానో ఆయన భావించలేదు. దానికి కారణమైన సామాజిక అంశాలను గురించి ఆలోచించారు. ఆయన కథలలో పాత్రలు గుర్తుండి పోటానికి కారణం వారి ఆంగిక, వాచిక ప్రత్యేకతలను రంజుగా చెప్పటంలో కనిపిస్తుంది. అది దాటి లోపలికి వెళ్లిన పాఠకులకి పాత్ర ప్రవర్తన వెనక సామాజిక ఒత్తిడులూ కనిపిస్తాయి. రచయితలో పెరుగుతున్న సామాజిక చింతన గుండెలకు పదుతుంది. వ్యక్తిపరంగా ఎటువంటి విలువలు ఆయన గౌరవించారో అందరికీ తెలిసున్న విషయం. ధైర్యం... ధైర్యం మాత్రమే అన్ని విలువలకీ ఆధారభూతమైన విలువగా ఆయన ఈ దశలోనే ఒక నిశ్చయానికి వచ్చారు. *ఆరుసారా కథలు* సమాజం పట్ల, వ్యక్తి పట్ల ఆయన స్పష్టతకి ఒక నిలువెత్తు అద్దం. సాహితీ క్రియాశీలత్వం వైపు ఆయనని నడిపించిన కథలు. వీటిలో నాకు కనిపించే ప్రధాన లక్షణం ఆయన చింతన. ఆకెళ్ళ కృష్ణమూర్తి, వాసిరెడ్డి వెంకటప్పయ్య, కృష్ణాబాయి గారి కుటుంబం.. వంటి వామపక్ష మిత్రులతో ఆయన సాన్నిహిత్యం పెరిగింది. అది ఆయన చింతనను ఓ కొలిక్కి చేర్చింది.

ఈ దశలో రాసిన కథలలో ఆరు సారాకథలకు దారితీసిన నేపథ్యం రచయిత నోట్సులో దొరుకుతుంది. మామూలు మనుషుల మాట తీరులో కనిపించే పదును, సమయస్ఫూర్తి, న్యాయాన్యాయ విచక్షణ ఆయన పట్టుకున్న విధానం రచయితలకు కరదీపిక వంటిది. ప్రజల నుంచి ఆయన ఎంతగా ప్రభావితమయ్యారంటే సామాన్య జనానికి మంచి చెడ్డల పట్ల ఉన్న అవగాహన ఆదర్శప్రాయమని ఆయన నమ్మారు. *అధికారి, మామిడిచెట్టు, మంచిచెడ్డల్లో ఏ కథ* వంటివి ఈ దృష్ట్యా పరిశీలించదగిన కథలు.

*ఆరు సారాకథల* తర్వాత శాస్త్రిగారి కథాసంవిధానంలో, కథనంలో అనేక

ప్రయోగాలు చేశారు. *బుక్కులు, బాకీకథలు* ఆదశలో వచ్చాయి. చీమ, మేక, కోడిపెట్ట వంటివి కథకి ఆలంబన అయ్యాయి. రమణగారి *డాబాగది* అనే వ్యాసం చదివితే కథని ఎలా కట్టవచ్చో చాలా నేర్చుకోవచ్చు. *రాజు –మహిషి*తో శాస్త్రిగారి అభిమానుల సంఖ్య పెరిగిపోయింది. కథల గురించి చర్చించుకునే ఈ వ్యాసంలో ఆ నవల గురించి విశేషంగా చెప్పటం అవసరం కాదు. కానీ ఆ తర్వాత రాసిన కథల మీద ఈ నవల ప్రభావం గమనించదగ్గది. 1972 అక్టోబర్ తర్వాత ఆయన మరో కథ రాయలేదు. అంటే జీవితంలోని చివరి రెండు శతాబ్దాల పాటు కథ రాయలేదు. *రత్తాలు రాంబాబు, మూడు కథల బంగారం, సొమ్ములు పోనాయండి,* ఇల్లు నవలలు రాశారు.

*ఆరు సారాకథల* తర్వాత ఆయన రాసిన కథలలో కొన్ని ప్రధాన లక్షణాలు కనిపిస్తాయి. నా ఆలోచన ప్రకారం ప్రజాపక్షం, సాహితీ క్రియాశీలత్వం అనేవి శాస్త్రిగారిలో కనిపించే ప్రధాన లక్షణాలు. రెండవది కొడవటిగంటి వారన్నట్లు ప్రచార గుణం. మూడవది శ్రీశ్రీ చెప్పిన రసన. రాచమల్లు రామచంద్రారెడ్డి పాఠకులు రచయితలను చెరుపుతారంటూ విశ్లేషించారు. పాఠకులుంటారు జాగ్రత్త అని రచయితని హెచ్చరించారు. ఈ విశ్లేషణ కమ్యూనిస్టు పార్టీలు విడిపోయాక వచ్చింది. శాస్త్రిగారి రాజకీయ క్రియాశీలత్వం ఒక పక్షానికి పరిమితమయ్యాక వచ్చింది. వారితో బాటు వారికన్న ఆవేశపరులైన సాహిత్యకారులు పార్టీల వెంట తమ విభజనలను మోహరించాక వచ్చింది. అందువల్ల ఈ హెచ్చరిక శాస్త్రిగారి మీద ఎలాంటి ప్రభావం చూపించిందో తెలియదు. అలాగే *వేతనశర్మ* అన్న కథ ద్వారా కమ్యూనిస్టు పార్టీ పోరాటలు జీతభత్యాలకు పరిమితమై పోయాయన్న శాస్త్రిగారి పరిశీలనను పార్లమెంటుకి పరిమితమైన కమ్యూనిస్టు పార్టీలు సహచరుని విమర్శగా స్వీకరించలేదు. అప్పటికే సాహిత్యకారుల గుర్తింపు వారి నిబద్ధతకే పరిమితమైపోయి, సృజనాత్మక ఆలోచన, ప్రతిభ వంటి వాటిని ఉదారవాదం, రివిజనిజం, స్వీయ మానసిక ధోరణి వంటి రాజకీయ పదాల పేరుతో తృణీకరించటం మొదలైంది.

అయితే – ఈనాటి రచయితలూ, సంవేదనా శీలురైన పఠితలూ ఈ సంఘటన నుంచి నేర్చుకోవలసిన అంశం ఒకటుంది. ఆలోచించవలసిన విషయం ఒకటుంది. రావిశాస్త్రి రచనల మీద సమకాలీన ప్రసిద్ధ నిబద్ధ రచయితల, విమర్శకుల ఆ పొగడ్తలను, విమర్శలను మనం నిష్పక్షపాతంగా పరిశీలించవలసి ఉంది. అవి శాస్త్రిగారు ఎలా





స్వీకరించారన్నది అనవసరం. ఈనాడు మనం దానిని ఎలా స్వీకరిస్తాం అన్నది ప్రధానం.

నాకు అనిపించిందేంటంటే–

కొ.కు. ప్రచారగుణం, శ్రీశ్రీ రసన, రారా, వల్లంపాటి, రామకృష్ణారెడ్డి వంటి వారు చూసిన లోపం, ఇవన్నీ ఒకే లక్షణం పట్ల వివిధ రకాల అభిప్రాయాలు. ఆ లక్షణం పదేపదే చెప్పటం అనొచ్చు. ఆయన కథలు చదివిన పాఠకులు ఆ మహాప్రవాహంలో కొట్టుకుపోతారు. అది అందరూ అంగీకరిస్తారు. ఆ ప్రవాహం ఆయన శిల్పం, దానిలో ప్రధానాంగాలైనవి ఉపమానాలు. ఆ ప్రవాహం ఆయన ప్రజాపక్షపాతంతో ఉరకలెత్తే హృదయం, ఆ ప్రవాహం మళ్ళీమళ్ళీ చదివి పాత్రలను ఉపమానాలను, సంభాషణలను విడివిడిగా చెప్పుకుని ఆనందింపజేయగల గుణం. కొట్టుకుపోయే పాఠకులు ఎక్కడికి చేరాలని శాస్త్రిగారు ఆశించారో అక్కడకు చేరతారా – అన్నది ప్రశ్న.

నిబద్ధత, నిమగ్నత అనేవి కొంతకాలం రచయితలను కొలవటానికి ఉపయోగించే కొలబద్దలు. ఈనాడు వాటి వాడకం తగ్గింది. నిబద్ధ రచయితలు తమ శైలీ, శిల్పాలపై వేసుకోవాల్సిన ప్రశ్నగా ఆనాటి విమర్శకులు కొందరు దానిని లేవనెత్తారు. తమ లక్ష్యం మిగలాలా.. తమ సృజనాత్మక ప్రతిభ మిగలాలా.. శాస్త్రిగారి సామాజిక లక్ష్యాలను ఆలోచనాశీలురైన పఠితలూ.. ఇటువంటి సదస్సులూ చర్చించాలన్నది నాకోరిక.

అంటే రచయితలు చప్పట్ల కోసం ప్రలోభపడితే వారికి వారు చప్పట్లు మిగుల్చకోవచ్చు కానీ, సమాజానికి ఏమి మిగల్చకపోవచ్చు. ఈనాడు చప్పట్లలో ఒకరికి ఒకరు కొట్టుకునేవి ఉన్నాయి. వారివారి సామాజిక నేపథ్యాలను బట్టి కొట్టేవీ ఉన్నాయి. అలాగే మా గుర్తింపుకి కారణాలు ఇవీ అని చెప్పటానికి సామాన్య పాఠకులకీ మార్గాలు పెరిగాయి. ఈ స్థితిలో రచయితలు తమ ఆలోచననూ, కౌశలాన్నీ మెరుగుపరుచుకుని సమాజానికి వినియోగపడదలుచుకుంటే చప్పట్ల ప్రలోభాలు ఎంతటి మహానుభావులనైనా ఎంతో కొంత దారి తప్పిస్తాయని గ్రహించితే మంచిది. ఈనాడు సమాజంలో రకరకాల అవసర, అనవసర కారణాల వల్ల Fragmentation లేదా Segmentation పెరిగాయి. సమాజ లక్ష్యాలకి బదులు సమూహ లక్ష్యాలు చోటుచేసుకున్నాయి. ఈ స్థితిలో రచయితలు తమ రచనలకి ఎంచుకున్న సమూహ లక్ష్యాలు తమ సమూహాలకైనా ఎలా ఉపయోగపడతాయి అని ఆలోచించాలి. అలాంటి ఆలోచనలకు చప్పట్లు, చప్పట్ల

ప్రలోభం కొంతైనా అడ్డంకి అవుతాయని గ్రహించాలి. అలాగే పాఠకులు రచయిత పుట్టుపూర్వోత్తరాలనీ, నేపథ్యాన్నీ ముందు పెట్టుకుని పొగడ్తలకూ, తెగడ్తలకూ దిగరాదని, తోటివారు దిగితే తాము సరిదిద్దాలని నా మనవి. తమ అభిప్రాయాలు చెప్పే పాఠకులు పెరగాలి. ఇలాంటి సదస్సులు ఆరోగ్యకరమైన చర్చలకు తెరతీయాలని కోరుతూ, ఆలాంటి పాఠకులను పెంచగలవని ఆశిస్తూ...





## రావిశాస్త్రి తొలికథలు

:దాసరి అమరేంద్ర

1922లో పుట్టిన రావిశాస్త్రి 71 సంవత్సరాలు మాత్రమే జీవించారు. బాగా చిన్నప్పటి నుంచే ఆయనకు చదవటం, రాయటం అలవాటైపోయింది. పదమూడవ ఏట నుంచీ ఏదో ఒకటి రాసిన దాఖలాలు ఉన్నాయి. 1938లో ఆయన మొదటికథ వినోదిని మాసపత్రికలో వచ్చిందట. ఆ టీనేజిలోనే దినచర్య రాసారు. రెండో ప్రపంచ యుద్ధం చూసారు. దేశ విభజన కలవర పెట్టిఉండాలి. ఆ సమయంలోనే మిలటరీ ఎకౌంట్స్ లో చేరి 46 దాకా దేశంలో అనేక చోట్ల పనిచేశారు. ఆ తర్వాత మద్రాసులో న్యాయశాస్త్రం చదివారు. ఓ పదేళ్ళు ఏమీ రాయలేదు.

రచయితగా రావిశాస్త్రి తొలిదశ 1953 వరకు అని వర్గీకరించారు రావిశాస్త్రి రచనా సాగరం సంపాదకులు వివినమూర్తి. నిజానికి అది తొలితొలి దశ అనాలి. తన అంతర్ జీవితానికీ బాహ్య జీవితానికీ ఉమ్మడి జీవితానికి మధ్య ఉన్న సంబంధాలను శాస్త్రీయంగా గుర్తెరిగి తనదైన జీవన దృక్పథాన్ని సంతరించుకున్న దశ. దేశానికి స్వతంత్రం వచ్చినా పరిస్థితుల్లో గొప్ప మార్పులు రావని గ్రహించిన దశ. న్యాయవ్యవస్థలోని గుణదోషాలను ఒక ఇన్‌సైడర్‌గా గుర్తెరిగిన దశ. వ్యక్తిగా, రచయితగా ఒక చూపును సంతరించుకున్న దశ. *'అల్పజీవి'* ప్రచురించిన దశ.

రావిశాస్త్రి రచనా జీవితాన్ని ఆరుసారాకథలకు ముందు, ఆ కథల తరవాత అని స్థూలంగా వర్గీకరించవచ్చునంటారు విమర్శకులు. అది నిజం. ఆయన రచనల విషయంలోనే గాకుండా తెలుగు కథారచన విషయంలో కూడా 1961 లో వచ్చిన ఆరుసారాకథలు ఓల్యాండ్‌మార్క్. కానీ 1953 నాటి అల్పజీవి 1961 ఆరుసారాకథలు మధ్యకాలంలో ఆయన *గుంటూరు, వర్షం, కార్నర్ సీటు, జరీ అంచు తెల్లచీర, మామిడిచెట్టు* లాంటి ఇప్పటికీ కథాభిమానులు గుర్తుపెట్టుకొనే కథలు రాశారు. అన్నీ కలసి 1953–1961 మధ్యకాలంలో 31 కథలు రాశారన్నది వివినమూర్తి గమనిక.

అందులో నాలుగు కథలను నేను పరామర్శిస్తాను.

*******

విజయనగరంలో పుట్టి విశాఖపట్నంలో పెరిగిన అప్పలనరసింహం డిగ్రీ చదవటం కోసం గుంటూరు వెళ్లవలసి వస్తుంది. జపాను వారి బాంబుల పుణ్యమా అని ఆంధ్రా యూనివర్సిటీ విశాఖ నుంచి తాత్కాలికంగా గుంటూరు వెళ్ళడం, అంచేత అతని డిగ్రీ చదువు గుంటూర్లో జరగడం.. దానితో గుంటూరు అంటే ఎడతెగని ద్వేషం కలిగడం....ఆ ద్వేషం తర్కానికి నిలువకపోయినా అకారణంగాదు. భాషపరంగా, సంస్కృతి పరంగా, అలవాట్ల పరంగా, తనకున్న శారీరక 'చిన్న'దనం పరంగా నరసన్న గుంటూర్లో అనేకనేక అవమానాలకు గురి అవుతాడు. వాటిని గడుసుగానో, చాకచక్యంగానో, ధైర్యంగానో తిప్పికొట్టే శక్తి అతనికి లేదు. అంచేత కోపం. గుంటూరు అన్నమాట అంటేనే ద్వేషం. శతృత్వం. ఆ ద్వేషం శృతిమించి గుంటూరులో ఎండలు తీవ్రంగా ఉన్నాయి అంటే అతడు మహా సంతోషపడేలా చేస్తుంది. తుఫాన్ వల్ల గుంటూరుకు నష్టం వచ్చిందంటే మహా సంబరపడి పోతాడు. పొట్టి శ్రీరాములు గుంటూరు జిల్లా వాడన్న పొరపాటు వార్త విని కలవరపడిపోతాడు. గుంటూరులో మెడికల్ కాలేజి పెట్టారని తెలిసి మహా గింజుకుంటాడు. అలాంటి నరసన్నకు బరంపురానికి చెందిన అమ్మాయితో పెళ్ళవుతుంది. కాని ఆవిడ తండ్రి గుంటూరు జిల్లాలో కొంతకాలం పనిచేస్తున్నప్పుడు ఆవిడ అక్కడే పుట్టిందని తెలుసుకుని మరో ఆలోచన లేకుండా భార్యను పుట్టింట్లో వదిలివస్తాడు. ఈ నరసన్న కథ పాఠకులకు 'చెపుతున్న' అతని స్నేహితుడు తనకు తెలిసినవాళ్ళెవరింటికో వెళ్ళినపుడు కటకంలో ఉన్న కల్తీలేని ఒరియా కల్చర్ బరంపురంలో లేనేలేదని ఎవరో గట్టిగా వాదులాడటం వినిపిస్తుంది!!

1953 లో రాసిన ఈ కథ ప్రతిధ్వని మనం ఈనాటికీ ప్రపంచంలోని అనేకానేక 'వెనుకబడిన' ప్రదేశాలలో వింటున్నాం. తమ తమ అస్తిత్వపు పెనుగులాటలో 'అల్పజీవులు' ధైర్యాలూ, గడుసుదనాలూ, చాకచక్యాలూ చూపించే అవకాశం చాలా తక్కువ. మాటకుమాట చెప్పడం, వెక్కిరింతకు వెక్కిరింతతో సమాధానం చెప్పడం వీళ్ళకు తెలియదు. మోహమాట పడతారు. కాని కోపంతో దహించుకుపోతారు. ఆ లక్షణాన్ని ఒడిసి పట్టుకొని, అక్షరాల్లో చిత్రించి, నరసన్నల మనోలోకాలను పాఠకులకు పరిచయం చేసి, వారితో పాఠకులు సమానుభూతి చెందేలా చెయ్యిడం *గుంటూరు* కథ సాధించిన విజయం. ప్రాంతీయ అసమానతలు పెరిగిపోయి, ఆ అసమానతల స్పృహ అందరిలోనూ





కలుగుతోన్న ఈనాటి తెలుగు వాతావరణానికి ఈ కథ చాలా అవసరం.

*******

*'జరీ అంచు తెల్లచీర'* అన్న కథను రావిశాస్త్రి 1953 లో రాశారు. పదహారేళ్ల విశాలాక్షికి గత పదేళ్ళుగా తీరని కోరిక ఒకటి ఉంది– 'జరీ అంచు తెల్లచీర' కొనుక్కోవడం. పదేళ్ళ క్రితం ఏదో సినిమాకి వెళ్ళినపుడు ఎవరో ఒకావిడ అలాంటి చీర కట్టుకొని అందంగా ఠీవిగా హాల్లోకి వచ్చిన దృశ్యం విశాలాక్షి మనసులో ముద్ర వేసేసింది. ఆ సంగతి తల్లికీ, తండ్రికీ తెలుసు. కానీ తన కోరిక తీర్చలేని పేదరికం వారిది. అయినా ఓ సాయంత్రం తండ్రి 'పద బజారుకి వెళ్ళి చీర కొనుక్కుందాం' అని దారి తీస్తాడు. తండ్రి ఆర్థిక పరిస్థితి తెలిసిన విశాలాక్షి వద్దు వద్దు అనుకుంటూనే వెళుతుంది. తండ్రి దగ్గర ఉన్న డబ్బులు వాళ్ళు కొనాలనుకునే జరీ చీరకు సరిపోవు. చీర దొరకక పోగా ఆయా షాపుల వాళ్ళ అమర్యాద, వెటకారాలకు గురి అవుతారు ఆ తండ్రి కూతుళ్ళు. 'నేను ఏడవను' అనుకునేంత స్థైర్యం విశాలాక్షికి ఉన్నమాట నిజమే అయినా తనకే తెలియకుండా మరిహా ఆగకుండా ఆవిడకు ఏడుపు ... వరదవరదగా ఏకధారగా ఏడుపు...

స్థూలంగా చూస్తే అది అప్పటికీ, ఇప్పటికీ దిగువ మధ్య తరగతి కుటుంబాలలో అనునిత్యం జరుగుతున్న విషయమే. కానీ ఈ ఆరేళ్ల అమ్మాయి కోరిక, అది పెరిగి పెద్దదయిన తీరు, తాము ఆర్థికంగా నిస్సహాయులయినా కూతురు కోరిక తీర్చాలని తల్లిదండ్రులు పడే ప్రయాసా, ఆ ప్రక్రియలో ఆ తండ్రి కూతురూ షాపుల్లో ఎదుర్కొనే తిరస్కారాలూ– ఇది పాఠకులను తప్పక తాకి తీరుతుంది. ఆ తాకటం తిన్నగా హృదయానికి తాకుతుంది. క్షణకాలం పాటు విశాలాక్షి రోదన సహృదయ పాఠకుల వేదన అవుతుంది.

ఇలాంటి 'విజయం' సాధించిన జరీ అంచు తెల్ల చీర అలాంటి వేదనలకు గాథలకూ ఆదిమ రచనగా మిగిలిపోయింది. గత అరవై ఏళ్ళుగా ఈ కథ ప్రేరణలో డజన్ల కొద్దీ కథలు వచ్చాయంటే అందులో ఆశ్చర్యం లేదు.

*******

1959లో రాసిన *'వర్షం'* కథలో అడవిపాలెం నుంచి వస్తోన్న పురుషోత్తంకు అత్యవసరమైన పని మీద కలకత్తా వెళ్ళవలసి ఉంది. ఆ ఊరు నుంచి బస్సు వెళ్ళే

రోడ్డుదాకా ఎడ్లబండిలో వచ్చాడతను. రోడ్డు చేరేసరికి బస్సు రావడం సంగతి అటుంచి హోరున వాన. ఆవానలో ఓ కమ్ములపాక టీ దుకాణంలో బస్సు కోసం ఎదురుచూస్తు కూర్చున్న పురుషోత్తంలో అలజడి. కలకత్తా వెళ్ళే రైలు ఎక్కాలంటే రెండు కోసులు వెళ్ళాలి. మరో రెండు గంటల్లో రైల్వే స్టేషను చేరుకొని తీరాలి..' ఈ వర్షంలో బస్సు రావడం అనుమానమే అంటాడు టీ దుకాణం తాత. మరి ఎలాగా?

వర్షంలో చిక్కుకుపోయిన పుణ్యమా అని పురుషోత్తానికి– అతనికి తెలియకుండానే– తన తెగింపులేని తనం తెలియవస్తుంది. చిన్నప్పట్నించి ఎవరు చెప్పిన జాగ్రత్తనయినా తూ.చా. తప్పకుండా పాటించే తన 'మంచి' లక్షణం స్ఫురిస్తుంది.. ఏదో 'తేడా' తెలుస్తుంది. 'పప్పుముద్దలా సతికల బడిపోయినాడు' అన్న టీ దుకాణం తాత అంచనాలను పూర్వపక్షం చేస్తూ 'మసక చీకట్లో తిన్నగా, ఈదురుగాలికి ఎదురుగా, తెరల్ని ఛేదించుకొంటూ చకచకా ముందుకు అడుగువేస్తాడు పురుషోత్తం. 'అతడ్ని చూసి తల పంకించి, హసించి, సెబాసో అని మెచ్చుకుంటాడు' దుకాణం తాత!

రావిశాస్త్రి తొలికథల్లో అతిముఖ్యమైనది 'వర్షం' కథ. కథలోని సమస్య, ఆ సమస్యకు పరిష్కారమూ 'వ్యక్తికే పరిమితమయిన మాట నిజమే. రావిశాస్త్రి పోయినప్పుడు సాహిత్య అకాడమీ వారి ఇండియన్ లిటరేచర్ అన్న ఇంగ్లీషు ద్వైమాస పత్రికలో ఈ కథ అనువాదం వచ్చినప్పుడు – 'ఆయన అంతకన్న గొప్ప కథలు రాశారు. ఉమ్మడి బతుకుల గురించి విరివిగా రాశారు. ఈ కథను ఆయన ప్రాతినిధ్య కథగా వెయ్యడం అన్యాయం' అన్నారు విజ్ఞత గల అభిమానులు. ఆమాట ముమ్మాటికీ నిజం. కానీ రావిశాస్త్రి ఎదుగుతున్న తీరుకూ, ముందు ముందు రాయబోతున్న విలక్షణ కథలకూ ఈ కథ బీజరూపంగాదూ?

*******

'మామిడి చెట్టు' కథలో నీలమణి ప్రధాన పాత్రధారి. ఆయన ఇంట్లో అద్దెకు ఉన్న పెద్దమనిషి మనకు కథ చెపుతూ ఉంటాడు. రెవిన్యూ సర్వీసులో ఉండగా రెండు ప్రపంచ యుద్ధాల తాకిడినీ, పరప్రభుత్వపు బూటుకాళ్లనీ, ప్రజల తిరుగుబాటునీ, గాంధీ గారినీ చూసిన మనిషి నీలమణి. తాసీల్దారుగా రిటైర్ అయినాక ఇల్లు కట్టేడు. మూడు పోర్షన్లు అద్దెకు ఇచ్చాడు. పసిపిల్లల్ని దూరంగా ఉంచుతాడు. ముష్టివాళ్ళను వెంట తరుముతాడు,





గీచిగీచి బేరం చేసి కూరగాయలు కొంటాడు.

నీలమణి గారింట్లో ఒక పెద్ద మామిడి చెట్టు ఉంది. పక్కింటికి కూడా పాకిపోయిన కొమ్మలు, వీధిలోని కూరగాయల ముసలమ్మకూ నీడనిచ్చే రెమ్మలు– అదే నీలమణిగారికి అంతులేని సంతాపహేతువయింది. కొమ్మలకు కరెంటు దీపం వేలాడదీసి రాత్రిపూట పేకాట ఆడుతున్న పక్కింటి వాళ్ళమీదకు యుద్ధానికి వెళతాడు. వాళ్ళూ వాళ్ళపిల్లలూ రాళ్ళూ రప్పలతో దాడిచేసి కొమ్మలు విరిచి కిష్కింధకాండ సృష్టిస్తారు. పోలీసులకు మూడు రూపాయలు ముట్టజెప్పి కూరగాయల ముసలమ్మను ఇంటి ముందు నుంచి తొలగిస్తాడు. రోజుకు రెండు మొక్కజొన్న పొత్తులు ఇచ్చేలా ఆ పోలీసులకే ఎదురు బేరం పెట్టి తిరిగి ఇంటి ముందుకు చేరుతుందా ముసలావిడ. పోట్లాటలు.. కొట్లాటలు.. పిల్లికాలు విరగడాలు.. పోలీసు కంప్లయింట్లు– ఇహ ఇదిగాదు పద్ధతి అని నీలమణిగారు శుభ్రంగా చెట్టు చెట్టంతా కొట్టించేస్తారు. మామిడి చెట్టును చూసి అద్దె కొంచెం ఎక్కువయినా ఆ ఇంట్లో చేరిన మనకు కథను చెప్పే పెద్దమనిషి వెంటనే ఇల్లు ఖాళీ చేస్తాడు. ఆ ఇళ్ళూ, ఇళ్ళవాళ్ళూ, తగవులూ, పోలీసులూ ఆ పెద్ద మనిషిని చిరాకు పెట్టినా, 'ప్రపంచమంటే నరకం' అన్న నిస్పృహకలిగించినా– నీడకోసం పోరాడిన ముసలమ్మ గుర్తుకువచ్చి ధైర్యం ఇస్తుంది. 'ఈ నరకాన్ని తోసి పారెయ్యవచ్చు. కష్టపడి అయినా ఆనందాన్ని నిలుపుకోవచ్చు' అన్న ఆశ కలిగిస్తుంది.

*******

రావిశాస్త్రి మనసుకూ, ఆలోచనకూ, వ్యక్తిత్వానికీ, సాహిత్యానికీ ఈ ఏభైలలో రాసిన 'తొలికథలు' ఏ మాత్రమూ ప్రాతినిధ్యం వహించవు అనే మాట పాక్షిక సత్యం మాత్రమే.

1960 మే నెలలో హైదరాబాదులో జరిగిన అఖిల భారత తెలుగు రచయితల సభలో రావిశాస్త్రి 'తెలుగు సాహిత్య వీధిలో కథానికకు దిట్టమైన పునాదులు పడ్డాయి. శక్తి సామర్థ్యాలుగల రచయితలు కలాలు సర్దుకొని కార్యరంగంలోకి ఉరికి ఉత్సాహంతో పనిచేస్తున్నారు. యువరచయితలు అనతి కాలంలో అతి సుందరమైన, అద్భుతమైన కథా సౌధాన్ని నిర్మించగలరని మనం ఆశించవచ్చు' అన్నారు.

ఆయన చెప్పిన యువ రచయితల్లో ఆయనా ఉన్నారు. ఆ తర్వాత అద్భుతమైన కథాసౌధాన్ని నిర్మించినవారిలో ఆయన ముందున్నారు.

## రావిశాస్త్రి విస్మృత కథలు - కథాశకలాలు

: కాత్యాయనీ విద్మహే

రావిశాస్త్రి కథలు అరవై రెండు అని 2007లో రాచకొండ విశ్వనాథ శాస్త్రి రచనాసాగరం(సమస్త లభ్య రచనల సంపుటం) వచ్చే వరకు అనుకుంటున్న మాట. అముద్రితాలు, అసంపూర్ణాలు, విస్మృతాలు ఏవైనా కావొచ్చు మరొక పదిహేను కథలను, లేదా కథాశకలాలను ఆ జాబితాకు చేర్చుకోవాలి ఇప్పుడు. ఇవి 1936 నుంచి 1963 వరకు దాదాపు మూడు దశాబ్దాల కాలం మీద చెదరి చేజారి దొరికిన కథలు. చెదరని రావిశాస్త్రి చేవ్రాలు వీటిల్లోనూ కనబడడం విశేషం.

ఈ కథల్లో నాలుగు 30వ దశకంలో రాసినవి. ముప్పయ్యవ దశకం అంటే మరీ ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధకాలం. ఆర్థిక సంక్షోభ కాలం కూడా. ఆకలి దశకంగా పేరుపడ్డ కాలం. రావిశాస్త్రి ఆ సమయానికి పదమూడేళ్ల స్కూల్ విద్యార్థి. కాంగ్రెస్ నేతృత్వంలోని జాతీయోద్యమంతో ప్రభావితమవుతూ యూత్ లీగ్ సభ్యుడయ్యాడు. జిజ్ఞాసతో ప్రపంచ పోకడను పరిశీలిస్తున్న సమయం అది. ఇటు తెలుగు సాహిత్యం అటు ఇంగ్లీష్ సాహిత్యం ఎడాపెడా చదివేస్తూ ప్రాపంచిక అనుభవం పెంచుకుంటూ అభిప్రాయాలు ఏర్పరుచుకుంటూ రావిశాస్త్రి ఒక వ్యక్తిత్వాన్ని రూపొందించుకుంటున్న కాలం. కథ నవల రచనాభ్యాసం పట్టుదలగా చేసిన కాలం. ఈకాలపు నాలుగు కథలల్లో *'కృష్ణా లాడ్జీలో ఖూనీ'* ఆ కాలంలో ఆయన విపరీతంగా చదివిన అపరాధ పరిశోధక నవలల ప్రభావంతో రాసినదై ఉంటుంది. మిగిలిన మూడు కథలు ముందు ముందు సామాజిక జీవిత సమస్యల పట్ల బలపడనున్న రావిశాస్త్రి ప్రాపంచిక దృక్పథ సూచికలే.

ముప్పయ్యవ దశకానికి సంబంధించిన రావిశాస్త్రి డైరీలను బట్టి పదిహేడు కథలున్నట్లు తెలుస్తున్నా లభించినవి మూడు మాత్రమే.. 'తొలి కథలలో ఒకటి శీర్షికతో అచ్చయిన కథ వాటిలో మొదటిది. 1936 నాటిది. "ఈ ఆడపిల్లలను కనడం కంటే





పెద్ద బండరాయి కంఠానికి కట్టుకుని నూతిలో పడితే మేలు మహానుభావా.." అని మొదలయ్యే ఈ కథకు కట్నం సమస్య వస్తువు. భావనారాయణ, దీక్షితుల సంభాషణగా ప్రారంభమయ్యే ఈ కథలో భావనారాయణ, ఆరుగురు ఆడపిల్లల తండ్రి. ఎదిగి వచ్చిన ఇద్దరు కూతుళ్లకు పెళ్లి చేయాలనే ప్రయత్నం మొదలు పెట్టేసరికి అతడికి ఎదురైన సమస్య కట్నం. చదువుకున్న కుర్రవాళ్లు ఆశిస్తున్న కట్నాలు అతడు ఇవ్వగలిగినవి కావు. అలాగని చదువు లేని కుర్రవాళ్లకు చూస్తూ చూస్తూ పిల్లనిచ్చి చేయలేడు. ఆ సంక్లిష్ట సందర్భంలో ఆడపిల్లలను కనడం కంటే పెద్దబండ రాయి 'కంఠానికి కట్టుకుని నూతిలో పడితే మేలు' అన్నంత నిస్పృహకు లోనయ్యాడు భావనారాయణ.

కట్నం సమస్యకు కారణం ఇంగ్లీష్ చదువులు అని భావనారాయణ సరిగానే గుర్తించాడు. ఇంగ్లీషు చదువు అంటే డబ్బుతో కూడిన వ్యవహారం. అందుకోసం అంతో ఇంతో ఆస్తులు అమ్ముకోవడం, దానిని ఆ తర్వాత కట్నంతో పూడ్చుకోవాలనుకోవడం పరిపాటి అయ్యింది. దీనిని గురించే భావనారాయణ విసుక్కున్నాడు. ఇక భావనారాయణ ఏ దీక్షితులతోనైతే మాట్లాడుతున్నాడో అతడు మగబిడ్డ తండ్రి. అతని కొడుకు ఇంగ్లీష్ చదువు చదువుతున్నాడు. తాను వద్దన్నా వినకుండా భార్య కొడుకును పట్నం పంపించిందంటాడు అతను. ఆ చదువైపోతే ఉద్యోగం చేసి కొడుకు బాగా సంపాదిస్తాడనే ఆశ అతడికి లోలోన ఉండడమే కాదు– చదువుకైన ఖర్చును కట్నం కింద లాగాలని కూడా ఆలోచనలో ఉన్నాడు. ఉన్నదంతా ఖర్చు పెట్టి చదువు చెప్పించాక కట్నం తీసుకోకపోతే ఎలా అన్నది అతడి సమస్య.

పట్నంలో బీఏ చదువుతూ సెలవులకు ఇంటికి వచ్చిన దీక్షితులు కొడుకు కృష్ణమూర్తి 'కట్నం పుచ్చుకుని పెళ్లి చేసుకోవడమంటే నాకసహ్యం.' అని తండ్రి ముందు కుండబద్దలు కొట్టినట్లు ప్రకటించడం, భావనారాయణ కూతురిని చూసి మనసు పారేసుకోవడంతో కట్నం సమస్యకు పరిష్కారం దొరికినట్లు అనిపిస్తుంది. ఇంగ్లీష్ చదువులతో వ్యక్తిత్వాన్ని సంతరించుకుని, జీవితాదర్శాలను నిర్మించుకుని స్వంత అభిప్రాయాలతో, నిర్ణయాలతో ప్రవర్తించగల కొత్త యువతరం రూపొందుతున్న దృశ్యం

కళ్ల ముందు సాక్షాత్కరిస్తుంది. ఇక్కడ కథను ఆపేయ్యవచ్చు. ఆపేస్తే సాధారణ కథ అయి ఉండేది. ఆపకండా అంతకన్నా మరొక పెద్ద సమస్యలోకి, సమూహానికి సంబంధించిన సమస్యలోకి కథేతివృత్తాన్ని మలుపు తిప్పాడు రావిశాస్త్రి. 1935, 36 నాటికి యువతరం వ్యక్తిగత జీవితాన్ని విలువలతో వెలిగింపజేసుకుందామన్న లక్ష్యాన్ని ఏర్పరచుకొనడమే కాదు. సామాజిక సమస్యల గురించి, దేశ విముక్తి గురించి కూడా ఆలోచించేందుకు అవకాశాలు పుష్కలంగా సమకూరాయి.. ఆ నేపథ్యంలో శ్రీకృష్ణమూర్తి దేశసేవకు సిద్ధపడ్డాడు. దేశసేవకు అతనెన్నుకున్న రూపం గ్రామీణ రైతాంగాన్ని చైతన్యపరచడం, వాళ్లను స్వీయ సమస్యల పరిష్కారానికి సన్నద్ధం చేయడం. స్వీయ జీవితంలో స్వతంత్రులవుతూ దేశ దాస్య విముక్తికి దోహదకర శక్తులుగా ఎదిగేటట్లు చేయడం. కట్నం తీసుకోకుండా భావనారాయణ కూతురు సుందరిని పెళ్లాడి ఆదర్శాన్ని ఆచరణ వాస్తవం చేసుకుందామని అతడికి అనిపించిన క్షణాన అతడికి ఎదురుగా నిస్సహాయమైన రైతును తీసుకొచ్చి నిలుపుతాడు రావిశాస్త్రి. 'సుందరిని వివాహమాడి నిర్విచారంగా, సంతతీనందంగా, ప్రేమోపాసకుడై జీవితం గడపడమా ? లేక కష్టపు బతుకు బతికి తిండికి లేక అల్లాడే రైతుల కష్టాల్ని నిర్మూలించడానికి ధారపోయడమా ? అన్న విచికిత్సలో కృష్ణమూర్తిని పడేసి ఈ కథ ముగిస్తాడు రావిశాస్త్రి.

సుందరిని కట్నం లేని పెళ్ళి చేసుకుంటే అతడు సుందరిని ఉద్ధరించినవాడవుతాడు. సుందరి సమస్యను పరిష్కరించిన వాడవుతాడు.. ఒక ఆదర్శం కోసం నిలబడ్డ యువకుడిగా గుర్తింపు పొందుతాడు. తనకు నచ్చిన సుందరిని పెళ్లాడడం వలన జీవితమంతా సౌఖ్యంగా గడుస్తుంది. అయితే ఈ పెళ్లి చేసుకోవడానికి అతడు ఎదుర్కోవాల్సిన పాత శక్తులు తన తల్లిదండ్రులు మాత్రమే. జమిందారు నా సర్వస్వం వేలం వేయిస్తున్నాడు. మీరు వచ్చి నాకు దన్నుగా నిలబడాలి అని ఒక రైతు అడిగినప్పుడు అతడి పక్షాన నిలబడడమంటే జమిందారీ వ్యవస్థను ఎదుర్కొవాల్సి రావడమని అతడికి అర్థమైంది. నిస్సందేహంగా తల్లిదండ్రులను ఎదుర్కోవాల్సి రావడం కంటే జమిందారీ వ్యవస్థను ఎదుర్కోవాల్సి రావడంలో 'రిస్క్' పెద్దది. వ్యక్తిగత జీవిత సౌఖ్యాలకు తావుండదు.





కట్నం లేని పెళ్ళి ఒక ఆదర్శం. ఒక విలువ. అది వ్యక్తుల జీవితాలలో వెలుగును నింపితే ఇది వ్యవస్థను సమూలంగా మార్చడం వైపుకు దారి తీస్తుంది. కట్నం సమస్య ఆర్థికమే. రైతు సమస్య ఆర్థికమే. రెండూ పరిష్కరించదగినవే. పరిష్కరించవలసినవే. సాపేక్షతలో రెండవది ప్రాధాన్య క్రమంలో ముందుంటుంది. ఉండాలి. యువత ఏ ఆదర్శం కోసం నిలవాలన్నది వాళ్ల విజ్ఞతకు సంబంధించిన విషయం. యువతరం ఎదుర్కోనున్న కొత్త సవాళ్లను, సంఘర్షణలను 1936లోనే కథలో ఇంత చక్కగా ఇమిడింపజేయడం ఆశ్చర్యంగా అనిపించక మానదు. చదువుకున్న వాళ్లంతా పల్లెటూళ్లకు పోయి పల్లె ప్రజలను బాగు చేయాలని గాంధీ చెప్పిన దాని గురించి తానొక కథ రాశానని రావిశాస్త్రి చెప్పుకున్నది(రావిశాస్త్రీయం) ఈ కథ గురించే అయి ఉంటుంది.

కట్నానికి సంబంధించిన కథాశకలం కాలం తెలియనిది ఒకటి ఉంది. అందులో మూడు భాగాలున్నాయి. మొదటి భాగం కట్నం – కట్నం తీసుకుంటున్న వాళ్ల చెడ్డతనం గురించి గట్టిగా చెప్తున్న వ్యక్తిని అందువల్ల మర్యాద పోతుందనుకుంటున్న వాళ్లు అతన్ని నెమ్మదిగా మాట్లాడమని, అసలు మాట్లాడవద్దని అభ్యంతరాలు చెప్తుంటే ఆ వ్యక్తి వాటిని లక్ష్య పెట్టకుండా గట్టిగానే చెప్తాననడం ఉంది.

రెండో భాగం 'కట్నం' అతడు చెప్తున్న విషయం

"అక్షరాలు రెండు

ఎప్పుడు నాశనమవుతాయివి

ఎన్ని వంకలున్నాయి మొదటి దానికి ?

ఎంత కుటిలమైనది రెండోది ?" – అని కవితాత్మక ఉద్వేగంతో సాగే ఈ భాగంలో కథకుడు ముద్ద మింగడానికి, డబ్బులు జుర్రడానికి తప్ప నోరు తెరవని వాళ్ల మీద విరుచుకుపడతాడు. మిమ్మల్ని తిట్టి లాభం లేదు – కొట్టవలెను. మట్టవలెను. శూన్యం చేయవలెను అని తీర్పు ఇయ్యడంతో ముగుస్తుందీ భాగం. తరువాతి భాగం 'ఉహ్హూహ్హూ' కట్నంతో పిల్ల కావాలనే చదువుకున్న యువకులను స్త్రీ, పురుష, నపుంసక వర్గాలు

మూడింటికీ చెందని నాలుగో రకంగా ప్రస్తావిస్తాడు. కట్నం అవసరం లేదనే యువకులు పరోక్షంగా డబ్బు, ఆస్తి రాగల సంబంధాలకు ఎగబడడాన్ని ఎండగట్టాడు. కుల బేధాలతో నిమిత్తం లేదంటూ అభ్యుదయ భావాలను వెలిబుచ్చే యువకులు, వింతంతువులనైనా పెళ్లాడడానికి సిద్ధమనే సంస్కరణవాదులు అలాంటి సంబంధాలు చేసుకోవడం వల్ల రాగల ఆర్థిక ప్రయోజనాలను గురించి ఆలోచించటమూ గ్రహించి తిరస్కరించాడు. మానవ సంబంధాలను ఆర్థిక ప్రయోజనాలు నిర్దేశించేవిగా ఉండటాన్ని ఎలుగెత్తి నిరసించడం ఈ కథలో ముఖ్యాంశం. 1938లో రాసిన *'అభాగిని లలిత'* అనే కథలో రావిశాస్త్రి పెళ్ళిళ్ళలో ప్రేమకు, వధూవరుల పరస్పర స్నేహానికి, ఇష్టానికి తప్ప ధనానికి ప్రథమ ప్రాధాన్యత ఇస్తే జీవితాలు దుఃఖ భాజనమవువుతాయని, ముఖ్యంగా స్త్రీలు మరింత కష్టపడాల్సి వస్తుందని స్పష్టం చేశాడు.

1939లో రావిశాస్త్రి రాసిన మరొక కథ *'మీరే ఆలోచించండి'.* తొలి కథల్లో ఒకటైన శీర్షిక లేని కథలో రైతు సమస్యను స్పృశించిన రావిశాస్త్రి ఈ కథలో కార్మిక సమస్యను వస్తువు చేశాడు. అరవై నాటి *సారా కథలు* రాయడానికి ప్రారంభం ఈ కథతో జరిగిందనుకోవచ్చు. సారా ఫ్యాక్టరీ కార్మికుడి కథ ఇది. సారా ఫ్యాక్టరీ ఏర్పడి నిరంతరాయంగా సారా ఉత్పత్తి జరుగుతూ యజమానులు డబ్బులు మూటకడుతుంటే అందులో పనిచేసే కార్మికులు అతి తక్కువ కూలిని పొందుతూ అది సరిపోక అప్పులపాలవుతూ, అవసరాలకు సెలవు దొరకక అవస్థలు పాలవుతూ ఉన్న వ్యత్యాస స్థితిని ఈ కథ చిత్రించింది. పెట్టుబడిదారుల లాభార్జన, కూలీల శ్రమ దోపిడీ పరస్పర సంబంధం కలవే నన్న స్పృహ ఈ కథలో ఉంది. హక్కుల గురించి ప్రశ్నించడం, ధిక్కరించడం జీవన వేదన నుంచి అత్యంత సహజంగా పుట్టేవే అయినా పెట్టుబడిదారీ వర్గానికి అవెంత కంటగింపు, ఏవగింపు కలిగిస్తాయో పరిణామంలో కార్మికుడు తన ఉద్యోగాన్ని ఎలా కోల్పోవడం జరుగుతుందో కూడా ఈ చిన్న కథ చెప్పింది. కార్మికులంతా ఏకమై పని పోగొట్టుకున్న కార్మికుడికి పని ఇప్పించాలని సమ్మెకు దిగడం కూడా ఈ కథేతివృత్తంలో భాగమే. కూలీల సమ్మెను భగ్నం చేయడానికి రిజర్వు పోలీసులను





రప్పించబడడాన్ని చెప్పి పెట్టుబడిదారీ వర్గం పక్షాన కార్మికవర్గంపై తుపాకీ ఎక్కుపెట్టే రాజ్యం స్వభావాన్ని సూచించాడు రావిశాస్త్రి. తర్వాతి కాలంలో పోలీసు, న్యాయ వ్యవస్థలతో కూడుకున్న రాజ్యం విశ్వరూపాన్ని, వికృత స్వభావాన్ని కూడా కథేతివృత్తాలుగా మలచుకొనడానికి అవసరమైన చేతన రెక్క విప్పుకొనడం ఈ కథలో కనబడుతుంది.

పోలీసు కాల్పుల్లో మరణించిన పది మంది కార్మికుల్లో ఏ కార్మికుడిని తిరిగి ఉద్యోగంలోకి పెట్టించాలని సమ్మె జరిగిందో ఆ కార్మికుడు రామస్వామి కూడా ఉన్నాడు. 'అతడి కుటుంబానికి అతడే రక్షకుడు. ధనమార్జించేవాడు కూడా. ఇక అతడు చనిపోయిన పిమ్మట అతడి కుటుంబం ఏమికాను?' అని ఒక ప్రశ్న వేసిన రావిశాస్త్రి మీరే ఆలోచించండి అని కథ ముగించాడు. తాను ఆలోచించడం ప్రారంభించాడు కనుక మనల్ని ఆలోచించమన్నాడు. కార్మికుల పక్షాన ఆలోచించేవారి సంఖ్యను పెంచదలచుకున్నాడు.

తమ తుమ్మపాల గ్రామంలో కొత్తగా పంచదార ఫ్యాక్టరీ పెట్టినప్పుడు వెంటనే తానొక కార్మికుడి కష్టం గురించి కథ రాశాను అని(రావిశాస్త్రీయం-45) చెప్పుకున్నాడు రావిశాస్త్రి. ఆ కథ మరొకటి ఉందేమో తెలియదు గానీ ఈ కథ ఆ కథ కావడానికి అవకాశం ఉంది. ఇందులోనూ కార్మికుడి కష్టం, తక్కువ జీతం, అదనపు పని, జీతంలో కోత, ఇంట్లో వాళ్లకు ప్రాణాల మీదకు వచ్చినా సెలవీయక పోవడం, ఉద్యోగం కోల్పోవడం – ఇలా అనేక విషయాలు కార్మికుడి కష్టానికి సంబంధించినవే. అయితే ఆ కార్మికుడు పనిచేసింది పంచదార మిల్లులో కాదు సారా ఫ్యాక్టరీలో. పంచదార మిల్లులో చెరుకును పంచదారగా మార్చే క్రమంలో ఉత్పత్తి అయ్యే 'మొలైస్' అనే పదార్థమే సారా ఫ్యాక్టరీకి ముడి సరుకు – కనుక పంచదార మిల్లుకు సారా ఫ్యాక్టరీ అనుబంధ వ్యవస్థ అనవచ్చు. సారా ఉత్పత్తి క్రమంలో శ్రమ దోపిడీ పీడనల గురించి ఈ కథ రాసిన రావిశాస్త్రి ప్రభుత్వ ఖజానాకు సింహభాగపు ఆదాయాన్ని సమకూర్చే సారా వ్యాపార ప్రపంచపు మాయను విప్పిచెప్తూ ఆ తర్వాతి కాలంలో సారా కథలు రాశాడు. లాభాలే లక్ష్యంగా, దోపిడీ విధానంగా చేసుకున్న పెట్టుబడి వికృత ముఖాన్ని ప్రదర్శించే *'పాతదే కథ'* వంటి

కథలు తర్వాతి కాలంలో ఆయన రాశాడు.

ఇప్పుడు అధ్యయనానికి అందుబాటులో ఉన్న రావిశాస్త్రి కొత్త(పాత) కథలలో మరొక ఆరు యాభయ్యవ దశకంలోవి. వీటిలో మొదటి కథ *'దేముని యెదుట ప్రమాణం చేసి....'* 1953 నాటిది. రావిశాస్త్రి న్యాయవాద వృత్తిలోకి ప్రవేశించి అప్పటికి అయిదేళ్లు. కోర్టు వ్యవహారం, సాక్ష్యాల తీరు, తీర్పులు అన్ని న్యాయానికి ఎంత దూరమో ఆయనకు అనుభవంలో తెలిసి వచ్చింది. ఆ అనుభవం నుంచే *'కోర్టుకు రాని సాక్షులు'* కథను 1952లో రాశాడు. ఒకరి శ్రమ మరొకరికి లాభంగా మారే వ్యవస్థలో వ్యాపార వర్గం దేన్నయినా తమ లాభం కోసం వాడుకొనటమో, వదిలేయడమో చేస్తుంటుంది. స్త్రీకి కూడా అందులో భాగమే. దిగువ వర్గాల స్త్రీలను సొంత సుఖాల కోసం వంచించి వాడుకుని వదిలేద్దామనుకున్నప్పుడు ఆ స్త్రీలు శాశ్వత సంబంధాల కోసం పట్టుబట్టినప్పుడు 'న్యాయ బద్ధంగా' వాళ్లను వదిలించుకోవడానికి దొంగ కేసులు, కూట సాక్ష్యాలు సృష్టించి విజయం సాధించడంలోని విషాదాన్ని వ్యంగ్యమానం చేసిన కథ *కోర్టుకు రాని సాక్షులు.* ఆ కోవలోనిదే *'దేముని యెదుట ప్రమాణం చేసి.....'* అనే కథ.

దేముని ఎదుట ప్రమాణం చేసి అంతా నిజమే చెప్తాను.. అబద్ధం చెప్పను'. అని ప్రమాణం చేసే సాక్షులకు గానీ, ప్రమాణం చేయించే బెంచీ గుమాస్తాకు గానీ నిజం నిషిద్ధ వస్తువు. అసలు నిజాన్ని హత్య చేసి నిజం కానిది నిజంగా నిరూపించబడి చలామణీలోకి రావడానికి ఉపయోపగపడే కోర్టు ప్రక్రియను ఈ కథలో చూపించాడు రావిశాస్త్రి. వాదోపవాదాలను విని వివేకంతో, విజ్ఞతతో సత్యాసత్యాలను పసిగట్టి నిరపరాధులకు న్యాయం, దోషులకు శిక్ష విధిస్తూ తీర్పు ఇవ్వాల్సిన జడ్జీలు ముందే స్థిరపడిన అభిప్రాయాలతోనూ, అసలు తాము చేస్తున్న ఉద్యోగం పట్ల శ్రద్ధారాహిత్యంతోనూ ఉన్నప్పుడు ఏం జరుగుతుందో నగ్నంగా చూపింది ఈ కథ. *నిజం* నాటకం ఆ తర్వాతి కాలంలో(1957) రాయడానికి పునాది ఇక్కడే పడి ఉంటుంది. 1953లోనే రాయబడిన *స్టేషన్ దగ్గర, దొంగ* అనే కథలు అసంపూర్ణాలు. *స్టేషన్ దగ్గర* కథలో ఒక మధ్య తరగతి కంగారు మనిషి, దేనినీ, ఎవరిని నమ్మలేని, ఎప్పుడూ ఏదో ఒక తొందరను





ప్రదర్శించే మనిషి స్టేషన్ దగ్గర జట్కాబండి దిగుతూ దర్శనమిస్తాడు. *అల్పజీవి*లోని సుబ్బయ్యతో పోలికలు ఉన్న మరొక మనిషి కేంద్రంగా ఏదో కథ అల్లబోయి ఆపేసినట్లు ఈ కథను బట్టి అర్థం చేసుకోవచ్చు.

తోట, తోటలో మేడ, మేడ మీది గదిలో పెద్దయ్య దొంగల భయంతో నిద్ర పట్టక గడిపిన క్షణాలను కొన్నింటిని చూపించిన కథాశకలం *దొంగ.* అతడిని దొంగల భయం ఈ నాలుగు నెలల నుంచి మాత్రమే పట్టి తినేస్తుందని చెప్పడం ద్వారా సంపదలున్న వాళ్లకే దొంగల భయం - నాలుగు నెలల క్రితం అక్రమంగానో.. అన్యాయంగానో ఆయన ఏదో సంపాదించి దాచి ఉంచడం వల్లనే ఆందోళన పడుతున్నాడని అనుకోవడానికి అవకాశం కల్పించాడు రచయిత. సంపద పెరిగే కొద్దీ సంపద లేని వాళ్ల నుంచి దానిని కాపాడుకోవడం ఒక సమస్యగా మారే రాజకీయార్థిక వ్యవస్థ వైపు, పరిణామంలో సొంత ఆస్తి రక్షణకు ఏర్పడే పోలీసు వ్యవస్థ వైపు ఈ చిన్న కథాంశం మన ఆలోచనను తిప్పుతుంది.

1953లోనే *వెలుగు* కథ రాశాడు రావిశాస్త్రి. సిద్ధార్థుడు బుద్ధుడైన నేపథ్యంలో బాధ నుంచి అందరిని విముక్తం చేయగల, దు:ఖాన్ని మనిషి నుంచి తొలంగించివేయగల మార్గం గురించిన అన్వేషణలో ఎవరికి వారుగా విముక్తం కావడం కాదు. అందరూ విముక్తమయ్యే మార్గం గురించిన చింతనకు సమాధానంగా నిస్వార్థంగా, నిష్కామంగా సేవ చేయగల నిష్కల్మషత్వాన్ని ప్రతి మనిషి తనలో సజీవం చేసుకోవడమేనని చెప్పిన కథ. ఉన్నతమైన, ఉదాత్తమైన మానవత్వ పరిమళాలను వెదజల్లే మంచి కథ. ఏ చింతనలు, సిద్ధాంతాలు లేని ఒక కాపు పిల్ల, అతి సహజంగా తోటి మనిషిని బతికించడం కోసం పడిన ఆరాటం, తన ప్రయత్నం ఫలించి ఆ మనిషి బతికినందుకు పడిన ఆనందం- సామాన్యుల జీవితాచరణలోనే అసాధారణ విలువలున్నాయని సన్యాసికి తెలియజేస్తాయి. ఆ బిందువు దగ్గరే జీవన సౌందర్యం, కథా సౌందర్యం కూడా ఆవిష్కృతమయ్యాయి.

యాభయ్యవ దశకపు మరొక కథ ' *అతని కోర్కె'* (1953-54). జీవితంలో నాయకులు కాదు సరే కనీసం మనుషులుగా గుర్తింపునకు కూడా నోచుకోని అతి

సామాన్యుల, నికృష్ట జీవితానుభవ చీకటి కోణాలను స్పృశిస్తూ కథలు రాయగల రావిశాస్త్రి పరిశీలనా శక్తికి మంచి నిదర్శనం ఈ కథ. ఇందులో డబ్బున్న వాళ్లను ఆశ్రయించుకుని ఉంటే ఇంత కూటికి, గుడ్డకు ఇబ్బంది ఉండదని ఆలోచించి పిచ్చయ్య అనే వ్యక్తి స్వకులస్థుల వద్ద అడవా చాకిరీ చేస్తూ పడుండడం కనిపిస్తుంది. బీద బంధువుగా పేర్కొనబడిన పిచ్చయ్యలాంటి వ్యక్తి జీవితంలోని నీడలను, దైన్యాన్ని మన ముందు ప్రదర్శిస్తుందీ కథ. పిచ్చయ్య జీవితాన్ని చూపిస్తూ రాజమ్మను దూరం నుంచి చూపించడం తద్వారా వారిద్దరి జీవితంలోనూ సామాన్యమైన పరాధీనత, బానిసత్వం గత్యంతరం లేక భరించాల్సి రావడంలోని దైన్యం సూచించబడ్డాయి. ఇది అసంపూర్ణ కథ. రాజమ్మ పాత్రను క్లోజప్‌లోకి తేకుండానే ఆగిపోయిన కథ. 'డబ్బులో ఉండే సౌఖ్యాలూ, లేమిలో ఉండే దు:ఖాలు, ధనం కల్పించే గొప్ప గర్వం మదాంధత, లేమి కల్పించే నిస్పృహ నైచ్యం, దైన్యం అవన్నీ జీవితంలో నుంచి తెలుసుకుని వాటిని వ్యక్తీకరించడానికి రకరకాల కథలు రాశానని చెప్పుకున్న రావిశాస్త్రి(రావిశాస్త్రీయం 45) జీవిత తత్వానికి ప్రాతినిధ్యం వహించగల సత్తా ఈ అసంపూర్ణ కథలో ఇమిడి ఉంది. మనిషిలోని అల్పత్వాలను ఏవగించుకోవడంగాక వాటికి మూలమైన సామాజిక క్రౌర్యం వైపుకు దృష్టి మళ్లించడం ఇలాంటి కథల ప్రత్యేకత.

ఇంతకూ ఈ కథలో అతని కోర్కె ఏమిటి? బాగా డబ్బున్న ఆడమనిషిని లేవదీసుకుపోవాలన్నది అతడి కోర్కె. అతడు బీదవాడు అందుకే ప్రాథమిక అవసరాల కోసం అవమానాలెన్నో భరిస్తూ పెద్దింటి వాళ్లను ఆశ్రయించి వాళ్ళు పురమాయించే అడ్డమైన పనులు చేసి పెడుతుంటాడు. అందువల్ల అతడికి డబ్బు మీద కోరిక. డబ్బుంటే తనకీ దౌర్భాగ్యం తప్పేది కదా అన్నది లోపలి ఆలోచన. డబ్బు లేకపోవడం వల్లనే పిలిచి పిల్లనిచ్చిన వాళ్లు లేరు. పెళ్లి లేదు కనుక ఆడదాని మీద కోరిక చాటుమాటుగా తీర్చుకోవాల్సి వస్తున్నది. తనకంటూ ఒక ఆడమనిషి కావాలని కోరిక. తనకు లేని డబ్బుతో సహా ఆడమనిషి దొరకాలన్న గాఢమైన కోరికగా అది వ్యక్తమైంది. అలాంటి కోరిక అతనికి ఉండటం అందరి దృష్టిలో తప్పు కావచ్చు. కానీ అతడి జీవితం





జీవించేవాడెవరికైనా అటువంటి కోరిక కలగడానికి అవకాశం ఉందని, అలాంటి ఆశలు, కోరికలే జీవితంపై నిస్పృహను పెంచుకోకుండా వాళ్ళను కాపాడుతుంటాయని కూడా రావిశాస్త్రి చెప్పదల్చుకున్నాడు ఈ కథలో.

*పేరు పెట్టని కథ ఒకటి* కూడా యాభయ్యవ దశకంలోదే. పేదరికం ఒక తల్లిని బిడ్డకు దూరం చేయడం ఆర్థిక సంబంధాలు ఆ తల్లిని మరొక బిడ్డ దగ్గర వంట మనిషిని చేయడం ఈ కథలో విషయం. 'నవ్వు' ఈ దశకపు చివరి కథ. ఎక్కువ వాళ్ళతో కలిసి కూర్చోవాల్సి వచ్చిన సందర్భంలో తక్కువ వాళ్ళు పడే ఇబ్బంది - ఇందులో విషయం. ఎక్కువ వాళ్ళంటే డబ్బులో ఎక్కువ వాళ్ళు. తక్కువ వాళ్ళంటే డబ్బులో తక్కువ వాళ్ళు. డబ్బున్న వాళ్ళ సమూహంలో డబ్బు లేనివాడు పరాయివాడుగా ఒంటరిగా వేదన పడాల్సిన పరిస్థితి ఎలా ఉంటుందో చెప్పడం దగ్గర ప్రారంభమై అసంపూర్ణంగా మిగిలిపోయింది.

ఇక అరవయ్యవ దశకపు మూడు కథా శకలాల గురించి ప్రస్తావించుకోవాలి. *అయిదంకాల కథ* కోర్టు వ్యవహారాలకు సంబంధించింది. *'దేముడి ఎదుట ప్రమాణం చేసి..'* వంటి కథల వరుసలోది. *అయిదంకాల కథ.* మూడవ అంకం దగ్గర ప్రారంభమవుతుంది. నాటకంలోని విష్కంభం లాంటి ప్రారంభం అది. సెషన్స్ కోర్టులో ఖూనీ కేసుంది. అందుచేత సివిల్ కేసులన్నీ వాయిదా పడి పోయేయి అన్న వాక్యంతో మొదలై సివిల్ కేసులకీ, క్రిమినల్ కేసులకు తేడా ఏమిటో చెప్పి ఏ కేసులోనైనా డబ్బున్నవాడే గెలుస్తాడన్న నగ్న సత్యాన్ని చెప్పి – దొంగతనం, లంజతనం, దౌర్జన్యం, దగుల్బాజీతనం వగైరాలు ప్రధాన లక్షణాలుగా కలవి క్రిమినల్ కేసులని చెప్పి ఆ నేపథ్యంలో సుందరాన్ని ముద్దాయిగా బోనులో ప్రవేశపెట్టడం వరకు మాత్రమే కథ నడిచింది. *'దేముడి ఎదుట ప్రమాణం చేసి'* కథలో సివిల్ తగాదాలను వస్తువుగా చేసి న్యాయ వ్యవస్థలోని బండారాన్ని బయటపెట్టిన రావిశాస్త్రి క్రిమినల్ కేసు చుట్టూ కథ అల్లడం ద్వారా న్యాయవ్యవస్థను మరోసారి మరొక కోణంలో విమర్శకు పెట్టడం లక్ష్యంగా ఈ కథ ప్రారంభించి ఉంటాడు. 1962 లో రాయనున్న *నిజం* నాటకానికి తొలి రూపం కూడా అయి వుండొచ్చు

ఈ అసంపూర్ణ రచన.

మిగిలిన రెండు కథాంశాలు పేరు పెట్టని అసంపూర్ణ రచనలు. ఒకటి మధ్య తరగతి మనుషుల ఆశ, స్వార్థం, మంచితనం మొదలైన అంశాల చీకటివెలుగుల సమ్మిశ్రణంగా ప్రారంభమైంది. జానకిరాం మధ్య తరగతి ప్రతినిధి. మంచి చదువు, ఉద్యోగం, కోరిన భార్య, చక్కని సంతానం, వాళ్ళ ప్రయోజకత్వం వీటి చుట్టూ మాత్రమే పరిభ్రమించే మధ్య తరగతి స్వార్థం అతడు. ఆ జానకిరాం లక్ష్మమ్మ అందాన్ని చూచి ముచ్చటపడి పెళ్ళాడాలనుకుని కూడా కట్నం లేకుండా పెళ్ళాడటం నామోషి అనుకుని ఆమె తండ్రి చేత ఎకరం భూమి అమ్మిస్తాడు. గతం లక్ష్మమ్మకు ఇచ్చిన జ్ఞానం కష్టంలో ఉన్నవాళ్ళ పట్ల సానుభూతితో ఉండడం, చేతనయిన సాయం చేయడం. ఎదురింటి పేద సాంబయ్య కూతురు పంచదార అప్పుకని వస్తే జానకిరాం అసహనంగా ముఖం పెడితే లక్ష్మమ్మ ఆదరంగా ఆహ్వానించింది. ఆ విషయంలో కల్పించుకోబోయిన భర్తను, అప్పుకు వచ్చిన ఆడపిల్లను ఏదో అని కసి తీర్చుకోవాలనుకున్న భర్తను నిలువరించగలిగిన చొరవ, మంచితనం లక్ష్మమ్మవి. మధ్య తరగతి స్వార్థాన్ని, ప్రయోజనా కాంక్షను జానకిరాం ముఖంగానూ, మంచితనాన్ని లక్ష్మమ్మ ముఖంగానూ చూపుతూ రావిశాస్త్రి మధ్యతరగతి వాళ్ళు వదిలించుకోవాల్సిన చెడు గుణాలను, అభివృద్ధి చేసుకోవాల్సిన మంచిని గురించి హెచ్చరించినట్లయింది.

పేరు పెట్టని మరొక కథాశకలం వ్యాపార వర్గాన్ని కేంద్రంగా చేసుకుని ప్రారంభమైంది. పాత్రల పరిచయాలతో అసంపూర్ణంగా ముగిసింది. జీవితంలోని మారుమూలల నుంచి కథాంశాలను ఎంపిక చేసుకుని రావిశాస్త్రి 'కాదేది కథకు అనర్హం' అని నిరూపించాడు. జీవితం నుంచి ముడి సరుకును తీసుకుని మళ్లీమళ్లీ దానిని ఒక దృక్పథం నుంచి చిత్రికపడుతూ కథా సంపద విలువను పెంచాడు. చిత్రిక పట్టే అవసరం కనబడకనో అవకాశం కలిసి రాకనో కొన్ని కొన్ని కథాంశాలను అసంపూర్ణంగా వదిలేశాడు. అసలు రావిశాస్త్రి వలె ఇన్ని రచనలు అసంపూర్ణంగా మిగిల్చిన రచయిత మరొకరు కనిపించరు. జీవితం ఒక నిరంతర పరిణామశీల ప్రవాహంగా సాగిపోతుంటే నిత్యం,





నిరంతరం దానిని పరిశీలిస్తూ వచ్చిన రావిశాస్త్రికి జీవితమైనా, మనుషుల మధ్య వైరుధ్యాలతో, ఘర్షణలతో, సమన్వయంతో సాగే జీవనయానమైనా ఎక్కడో ఒక చోట ఆగేవి కావు. ముగిసేవీ కావు. *రత్తాలు – రాంబాబు, రాజు – మహిషి* వంటి నవలల్లో మానవ జీవన యాతనలకు పరిష్కారం ఇంకా వెతకవలసే ఉన్న నేపథ్యంలో అవి అసంపూర్ణ రచనలు అయి ఉంటాయి. మొత్తం మీద జీవితాన్ని, మనుషుల మధ్య సంబంధాలను నడిపించే శక్తుల గురించిన అవగాహన కలిగించే పర్యంతం కథాంశాన్ని అభివృద్ధి చేయడమే రావిశాస్త్రి రచనా వ్యూహం.

### *ఉపయుక్త గ్రంథాలు*


1. జూలై 30 : గౌరవ సంపాదకుడు కాళీపట్నం రామారావు, సంపాదకుడు అత్తలూరి నరసింహారావు, 1982 జూలై
2. రాచకొండ విశ్వనాథ శాస్త్రి రచనా సాగరం : సంపాదకులు : వివినమూర్తి, ఎ.వి. రాయుడు, మనసు ఫౌండేషన్ 2007 జూలై
3. రావిశాస్త్రీయం : కూర్పు : చలసాని ప్రసాద్, రాచకొండ ప్రచురణలు, నవంబర్ 1998(మూడో ముద్రణ)

# తెలుగు సాహిత్య సాగరానికి తూర్పుతీరం – రావిశాస్త్రి సాహిత్యం

:అట్టాడ అప్పల్నాయుడు

తెలుగు కథ అప్పటికింకా సౌఖ్యవంతుల, సౌభాగ్యవంతుల, మరియు వారి తత్తుల్యుల భవంతులనూ, వారి మానసిక మన్వంతరాలనూ దాటి బయటికి రాలేదు. లోకాన్ని చూడలేదు. లోకంలోని వెలుగూ, చీకటీ; మంచీ, చెడూ; ఆనందం, విషాదం; మాయామర్మం; స్వార్థం, త్యాగం; వీరత్వం, భీరత్వం వగైరా ద్వంద్వాలనూ ఎరుక గాంచలేదు. చెట్టూ, చేమా, పిట్టాపిచుకా, మేకా, పులీ, మనిషీ... లోకంలోన జీవించే సర్వప్రాణుల జీవలక్షణాన్ని గురించిన చింతనలో లేదు. ఒక్కమాటలో చెప్పాలంటే – తెలుగు కథ వీధి మొహం చూసి ఎరుగదు.

నిజానికి తెలుగుకథ పుట్టుకతోనే వీధిలోకి రాడానికి ప్రయత్నించింది గానీ బ్రాహ్మణవీధి దాటలేకపోయింది. తర్వాత గూడా చాలారోజులు వారి మండువాదాటి వెళ్ళలేదు. ఒకింత స్వాతంత్ర్యోద్యమ కాలంలోనూ, తర్వాతా, తెలుగుకథ సౌభాగ్యవంతుల, సౌఖ్యవంతుల భవంతులూ, బ్రాహ్మణలోగిల్లూ దాటి వచ్చింది. కాకపోతే మధ్యతరగతి ఇళ్ళల్లో తచ్చాడింది. స్వాతంత్ర్య ఫలాల గురించీ, స్వేచ్ఛ గురించీ, సాగే ఉద్యమాల గురించీ వినికిడి పొంది జాతీయోద్యమ స్ఫూర్తిని కలిగించ ప్రయత్నించింది. తర్వాత, స్వాతంత్ర్యం వచ్చేక ... మారని పాలనారీతుల ఫలితంగా లోకంలోని శోకం గురించి, అదిగూడా పైన చెప్పిన తరగతుల శోకం గురించీ, మధ్యతరగతి దు:ఖం గురించీ విలపించింది. రావిశాస్త్రి గారే చెప్పినట్టు...అయ్యో, అయ్యో...అనింది తెలుగుకథ ! చివరికి రావిశాస్త్రిగారు కూడా, యివే కథలు ... తొలినాళ్లలో రాశారు. *అల్పజీవి* నవలా, *ఆరుసారా* కథలతో రాచకొండ విశ్వనాథశాస్త్రి... ప్రజాసాహిత్య క్షేత్రాన రాచకొండగా నిలిచారు.





తెలుగు కథా సాహిత్యంలో దశలున్నట్టే, రావిశాస్త్రి కథారచనలో గూడా దశలున్నవి. క్రమంగా సమాజంతో తనకు సాంగత్యం పెరిగే కొద్దీ ఆయన శక్తివంతమైన రచయితగా ఎదిగారు. 'నేనెందుకు రాసేను' అన్న వ్యాసంలో తనే చెప్పుకున్నట్టు...అతని రచనల్లో దశలవారీ పరిణామాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. తొలినాళ్లల్లో సాహిత్య వ్యాసాంగమనేది వ్యక్తిగతం అనుకున్నారు. తర్వాత్తర్వాత కొన్ని రచనలు చదివాక, కొంతమందితో పరిచయమయ్యాక, జీవితసారం అనుభవంలోకి వస్తూంటే...ఆ అనుభవ సారాన్ని లోకంతో పంచుకోడానికి రచనను సాధనంగా ఎంచుకున్నారు. ఆ క్రమంలో తర్వాత్తర్వాత జీవితాదర్శాన్నీ, సామాజిక బాధ్యతనూ గుర్తెరిగి, ప్రభువుల తరపున గాకుండా ప్రజల పక్షాన నిలిచి తన రచనలను సాగించారు.

రావిశాస్త్రి రచనలను యీ నేపథ్యంలో పరిశీలిస్తే, తొలినాళ్ళ కథలను, ఆయనే అన్నట్టు 'బేఖాతరు' కథలనవచ్చు. రాయటం తెలిసీ, ఎందుకు రాయాలీ తెలియని దశ. ఈ కథలంతగా ఇపుడు చదువరులకు అందుబాటులో లేవు గూడా.(మనసు ఫౌండేషన్ వారు ప్రచురించిన 'రాచకొండ విశ్వనాథ శాస్త్రి రచనా సాగరం' పుస్తకంలో తొలికథలలో ఒకటి అని ప్రచురించిన ఒక్క కథ తప్పా).

తర్వాతి దశలో సామాజికంగా కొన్ని తరగతుల ప్రజలూ, కుటుంబాలూ, వ్యక్తులూ అనుభవిస్తోన్న ఇబ్బందులను గూర్చి కథనం చేశారు. జీవితంలోని ఇబ్బందులూ, మనుషుల మధ్య కలతలూ, సామాజికంగా ఏర్పడే సమస్యలూ యీ దశలో కథా వస్తువులు. *జరీ అంచు తెల్లచీర, కార్నర్‌సీటు, పువ్వులు, కోర్టుకు రాని సాక్షులు* వగైరా కథలు ఉదాహరణలు. ఈ దశలోనే ఆయన రాసిన *'అల్పజీవి'* నవల ఆయనకూ, ఆయన సాహిత్యానికీ ఒక మూల మలుపు. బహుశా, యీ నవల తర్వాత రావిశాస్త్రిలో కలిగిన మార్పు... తర్వాతి రచనల్లో స్పష్టంగా కన్పిస్తుంది. అల్పజీవుల బతుకు భయాన్ని గురించి మాత్రమే కాదు, కష్టజీవులకు వారి బతుకుపట్ల ఉత్సాహాన్ని నింపే కథలు ఆ తర్వాత

రాశారు. అవి... *వర్షం, ఓ మంచివాడి కథ, మంచి చెడ్డల్లో ఏ కథ* వగైరా కథలు. ఈ దశలోనే రావిశాస్త్రిగారు సమాజానికి తాత్త్విక చింతనను కలిగించే కథలు... *మామిడిచెట్టు, కష్టార్జితం, నల్లమేక* వగైరా అద్భుతమైన కథలు రాశారు. *అల్పజీవి* నవల తర్వాత రావిశాస్త్రిగారికి అభిమాన పాఠకులేర్పడ్డ దశ యిది. అభిమానులను శాశ్వతం చేసుకున్న కథలు ... *ఆరుసారాకథలు*! తెలుగు సాహిత్యానికి యివి జవజీవాల్ని అందించిన కథలు. ఈ కథలతో రావిశాస్త్రి తెలుగుకథను వీధిలోకి మాత్రమేకాదు బజారులోకి తీసుకొచ్చేరు. బహుశా యే భాషలోనూ యింతటి శక్తివంతమైన కథలు అప్పటికి వచ్చివుండవు. *ఆరుసారాకథల* తర్వాత తెలుగుకథ శైలినే కాదు కథాంశాన్నీ రావిశాస్త్రి నుంచి అనుకరించింది.

అప్పటికి రెండు పంచవర్ష ప్రణాళికలు ఖర్చయిన కాలం! రెక్కలు తప్ప వేరే ఆస్తి లేనోళ్ళూ, రెక్కలు కింద ఆస్తుల్ని దాచుకున్నవాళ్ళూ, తెల్లవారిపాలనలో గాక, నల్లవారి పాలనలోనా ముదురుతున్నకాలం! గ్రామాలూ, బస్తీలూ, పట్టణాలూ, నగరాలూ కొత్త ఆఫీసులతో, కొత్త ఆదాయ మార్గాలతో, కొత్త పద్ధతులతో, కొత్త రూపురేఖలు దిద్దుతోన్న కాలం! దేశభక్తి ఆదర్శంపోయి, దేశాన్ని భుక్తంజేసే ధ్యాసలో మనుషులు మెసిలేకాలం! మాయా, మర్మమే ధర్మమనబోయే కాలం! లాభనష్టాల తక్కెడలు తప్పా ధర్మాధర్మాల తక్కెడలు అదృశ్యమయే కాలం! మనుషులు బతకడానికి నెత్తురుగక్కే కాలం! కష్ట జీవిని కాటేసే కాలం!

సరిగ్గా అప్పుడు రావిశాస్త్రి కలంతో ఝళిపించాడు. తెలుగుకథను మధ్యతరగతివీధిలోంచి కష్ట జీవుల ఇళ్ళకూ, వీధులకూ నడిపించేడు. సమాజమ్మీద ఆధిపత్యం చేసే శక్తుల గుట్టును రట్టు చేశాడు. సాహిత్యంలోని సౌభాగ్యవంతుల స్థానంలో సాదాసీదా మనుషులకు స్థానం కల్పించాడు. అల్పజీవులనూ, అధోజగత్ సహోదరులనూ సాహిత్యంనిండా నింపుకొచ్చేడు. వారి పలుకుబళ్ళనూ, సామెతలనూ, యాసనూ, నుడికారాన్నీ తెలుగువచనానికి అందించి తెలుగుకథా సాహిత్యానికి మునుపెన్నడూలేని జవజీవాలను





కలిగించాడు. కథ, నవల, నాటకం, వ్యాసం అన్ని ప్రక్రియల్లోనా కష్టజీవి కొరకు వకాల్తా పుచ్చుకుని రచనలు చేశాడు.

వర్గ సమాజంలో రాజ్యం పాత్రనూ, దానికి ఒకానొక స్తంభమైన న్యాయవ్యవస్థనూ విమర్శకు గురిజేస్తూ రచనలు చేయసాగారు. కమ్యూనిస్టు మూలసూత్రాలకు సంబంధించిన ఎరుకను కలిగించేందుకు, జీవితంలోంచి కథావస్తువులను తీసుకుని కథలు రాయడం ఆరంభించారు. మార్క్స్ చెప్పిన అదనపు విలువకు కథా రూపం... *'బల్లచెక్క'*; అదనపు విలువ యెలా యేర్పడుతుంది, శ్రమజీవి తన శ్రమకు రావాల్సిన ప్రతిఫలాన్ని యెలా కోల్పోతాడో చూపిన కథ. అలాగే, ప్రకృతి వనరులపై వ్యక్తిగత యాజమాన్యం వలన కలిగే మానవసంబంధాల విధ్వంసం గురించి బోధించే కథ *'మామిడిచెట్టు'* (నిజానికీవాళ దేశమంతటా ప్రకృతివనరుల యాజమాన్యం కొరకు కార్పొరేట్ కంపెనీల ప్రయత్నం, ఆ ప్రకృతి వనరులమీద ఆధారపడ్డ ప్రజల ఆరాట పోరాటాలను...సూక్ష్మరూపంలో ఆనాడు యీ కథలో తనదైన శైలిలో కదనం చేసారు రావిశాస్త్రిగారు. ఇదేదో వ్యక్తుల మధ్య, కుటుంబాల మధ్య గొడవగా కనిపించే కథ అనుకుంటారు గానీ కాదు. తాత్త్వికంగా వనరులపై యాజమాన్యహక్కు, ఆస్తిహక్కుకు సంబంధించిన విలువను వెటకరిస్తూ, వ్యక్తిగత హక్కు కలిగించే మానవసంబంధాల విధ్వంసాన్ని తెలిపే తాత్త్విక కథ యిది.) కార్మికవర్గం యెవరిని నమ్ముకోవాలి, కార్మికవర్గం అస్తిత్వ స్పృహకు సంబంధించిన ఎరుకను కలిగించే కథలు... *'వేతనశర్మ'*, *'పిపీలికం'*. ఈ కథలు ప్రపంచ భాషలన్నిటిలోకీ వెళ్ళాల్సిన కథలు! బహుశా, తెలుగు సాహిత్యంలో సమాజాన్ని విమర్శకు గురిజేసే రచనలు వచ్చివుండవచ్చు గానీ, మానవీయ తాత్త్వికతను బోధించే, ఎరుకను కలిగించే ... *'సృష్టిలో..'*, *'పిపీలికం'*, *'మామిడిచెట్టు'*, *'కష్టార్జితం'* వంటి కథలు, ఒక్క రావిశాస్త్రిగారు మాత్రమే రాశారేమో! మానవుడు కలిగుండాల్సిన మానవీయ గుణానికి సంబంధించి రాసిన గొప్పకథ *'తప్పు'*. ఇది, కాళీపట్నం రామారావుగారి కెంతో యిష్టమైన కథ. వ్యక్తుల అవసరాలను ఆసరా చేసుకుని, లబ్ది పొందరాదని, అది తప్పనీ, మానవీయం కాదనీ.. యీ కథలో ఒక సామాన్యుడి ద్వారా మనకు తెలిసేట్టు చేస్తారు. వ్యక్తుల్లో నైరాశ్యం పనికిరాదనీ...నిత్యోత్సాహాన్ని నింపుకోవాలనీ...నేర్పే కథ..*'వర్షం'*. పాఠకుడి దృక్పథాన్ని

ప్రశ్నించే కథ '*మంచిచెడ్డల్లో యేది మంచికథ*' ఒక అగ్నిప్రమాదాన్ని ఘటనజేసి, రెండురకాల కథలు రాసి, యేది నీకిష్టమని పాఠకుణ్ణి ప్రశ్నిస్తారీ కథలో.

రావిశాస్త్రిగారు రచయితగా తన సామాజిక బాధ్యత పట్ల పూర్తి ఎరుక గల రచయిత. రచయిత, పొరపాటున యే మంచికి హాని, యే చెడ్డకు మేలుచేస్తున్నాడో చూసుకోవాలని చెప్పినవాడు. అంతేగాక, సమాజ స్వరూపాన్నీ, దాన్ని పాలించే రాజ్య స్వభావాన్నీ అవగాహన చేసుకున్నవాడు. ప్రజల జీవితాలను చుట్టుముట్టిన, సామాజిక ఆధిపత్యశక్తుల అంతరంగాలనూ, బహిర్‌రూపాలనూ, పాఠకుల కళ్ళకు గట్టినవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే...అల్పజీవులూ, ప్రజలూ తమ బతుకు భయాన్ని జయించడానికి అంతరంగ శత్రువుతో చేయాల్సిన యుద్ధాన్ని '*అల్పజీవి*' నవలద్వారా తెలియజేస్తే, వ్యవస్థతో, ఆధిపత్య వర్గాలతో చేయాల్సిన బహిర్ యుద్ధాన్ని ...తన తర్వాతి కథలల్లో, *సారాకథలు, ఋక్కులు, బాకీకథల్లోనూ,* యీ వరుసలో రాసిన అనేక రచనల్లో తెలియజేసారనొచ్చు. భయం అజ్ఞానం నుంచి జనిస్తుంది. అజ్ఞానాన్ని సకల ప్రభువులూ పోషిస్తారు. నిర్భయాన్ని, సాహసాన్ని ప్రజల్లో కలిగించాలంటారు. పెట్రోలుకి నిప్పంటుకున్నట్టు జనంలో భయం అంటుద్ది గానీ, ధైర్యసాహసాలు రాజుకుని ప్రజ్వరిల్తాయి అనంటారు రావిశాస్త్రిగారు. సరిగ్గా, అతని రచనల మొత్తం ప్రజ్వలించే జ్వాలలే!

వస్తువుకు సంబంధించి, చేసిన చేర్పేగాక, శైలికి సంబంధించి, రావిశాస్త్రి తెలుగు సాహిత్యానికి వ్యంగ్యాన్నీ, ఉపమానాలనూ... అనితరసాధ్యమైన రీతిలో చేర్పు చేశారు. రావిశాస్త్రి సంభాషణలూ, సామెతలూ రచనకు జవాన్నీ, జీవాన్నీ యిచ్చేయి. ఉపమా కాళిదాసస్య...అనేదో అంటారు, గానీ వచన సాహిత్యంలో రావిశాస్త్రిగారు ఉపమానాలకు ఆద్యుడూ, అగ్రగణ్యుడూ అనొచ్చు. అలిగి పిడకల కుచ్చి రెక్కి కూచున్న అల్లుడిలా...బెంచీమీద జడ్జీ కూచున్నాడంటాడు. ఇంకోచోట ఒక దుర్మార్గుడి గురించి చెప్తున్నపుడు – 'వాడు, ఆకాశాన వుంటే వర్షాలు పడవు, భూమ్మీదుంటే పంటలు పండవు, అనంటారు. వాస్తవికత నిండిన కళాత్మక పాత్రలూ, సంభాషణలూ, సన్నివేశాలతో...పాఠకుని పంచేంద్రియాలకూ స్పర్శనిచ్చేట్టు రచనలు చేశారు రావిశాస్త్రి.

కళింగాంధ్రాకు ఆంగ్లేయులు యిచ్చిన వరమూ, శాపమూ...విశాఖపట్టణం! వారు తొలుత తాము కొనాల్సిన సరుకులకోసం అప్పటి ఓడరేవులలో (మచిలీపట్నం, గోవా, సూరత్) దిగి, తర్వాత తాము అమ్మాల్సిన వస్తువుల కోసం కొత్తఓడరేవుల్ని నిర్మించారు, అలా నిర్మించినదే విశాఖ ఓడరేవు. దాంతో అనేక గ్రామాలను గర్భంలో కలుపుకుని విశాఖ విస్తరించింది. నగరంగా మారింది. నగర విస్తరణా, గ్రామీణ ఛిద్రం జమిలిగా సాగింది. గ్రామీణ ప్రాంతం నుంచి వలసలూ, పట్టణాలలో, నగరాలలో లంపెన్‌శ్రేణుల పుట్టుకా అప్పుడే జరిగింది. వీటికి సంబంధించిన ఆనుపానులూ, వీటి అనేక రూపాలూ, వీటి స్వభావాలూ మనకు రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తాయి. బహుశా, చెప్పుకోదగ్గ మహానగరాలు తెలుగునేలకూ, కళింగనేలకూ లేకపోయినా...గ్రామాల సారాల్ని జీర్ణం చేసుకుని యెదిగే పట్టణాలూ, ఆ పట్టణాలే పెట్టుబడులతో, దొంగవ్యాపారాలతో నగరాలుగా యెదిగే దశలో తయారైన బూర్జువాలూ, వారిని ఆశ్రయించుకు యెదిగే వకీల్లూ, పోలీసధికార్లూ, న్యాయమూర్తులూ, రాజకీయనాయకులూ... వారి వెనకాల పులెనకాల వరదల్లా లంపెన్ వ్యక్తులూ...తెలుగుసాహిత్యంలో రావిశాస్త్రిగారే పసిగట్టి, రచనల్లో చూపించారు లోకానికి! సమాజంలో అపుడపుడే ఎదిగొస్తోన్న... మందుల భీముడు, సార్వభౌమారావు, ముకుందం ప్లీడరూ, కౌన్సిలర్లూ, సర్పంచ్‌లూ, లిటిగెంట్లూ, లాయర్లూ, వీరిమధ్య బతికే అల్పజీవులు, రాకెట్టప్పారావూ, గంగరాజేడ్డు, ముత్యాలమ్మా, రత్తాలు, అరుణ ప్రకాశాలూ వగైరా పాత్రలు మనం మరచిపోలేం! ఇవి రావిశాస్త్రి సృష్టించిన పాత్రలే కావచ్చుగానీ అవన్నీ ఆధునిక సమాజంలో అనేక రూపాల్లో మనకు దర్శనమిచ్చే సజీవప్రాణులు. అయితే, రావిశాస్త్రిగారి... చెడ్డపాత్రలైన... సార్వభౌమారావు, ప్లీడరు ముకుందబాబు, కౌన్సిలర్లూ, గంగరాజేడ్డు వగైరా వారిపట్ల కలగాల్సిన యేహ్యత కలుగుతూనే...ఒకింత, ఆయా పాత్రలపట్ల చిన్నపాటి ఆకర్షణ కలుగుతుంది. వారి గురించిన వర్ణనలూ, సంభాషణలూ, వారి చమత్కారాలూ... యీ ఆకర్షణను కలిగిస్తాయి, గురజాడగారి గిరీశంలా! కొంతమంది పోలీసధికారులూ, జడ్జీలూ, పెద్దలూ రావిశాస్త్రి అభిమానులుగా వుండడానికి కారణం...ఆ పాత్రల చిత్రణలో ఆకర్షణీయతే నన్న అనుమానం నాకుంది. నివృత్తిజేయడానికి రావిశాస్త్రిగారు లేరు. ఏమయినా..తన వృత్తిపరంగా మాత్రమేగాక, తన రచనల ద్వారా కూడా కష్టజీవులవైపు నిలిచిన గొప్ప రచయిత, తెలుగుసాహిత్యంలో సాటిలేని రచయిత రావిశాస్త్రి.

## ఆరు సారాకథల్లో స్త్రీ పాత్రచిత్రణ

:డా. ఎన్. మల్లీశ్వరి

రావిశాస్త్రి రాసిన *ఆరు సారా కథలు* విశాలాంధ్ర దినపత్రికలో 2.4.1961 నుంచి 14.5.1961 వరకూ ప్రచురించబడ్డాయి. ప్రచురణ కాలమే కాకుండా రచనా కాలంలో కూడా ఏకసూత్రత ఉండటం మూలంగా సారా వ్యాపారాన్ని కథాంశంగా తీసుకుని దానిచుట్టూ చిక్కుముడులు పడిన పాపం, పుణ్యం, న్యాయం, మోసం, మోక్షం, మాయ వంటి భావనల నైతికతను ప్రశ్నకు పెట్టాడు రావిశాస్త్రి.

సమాజంలో ధనిక పేద వర్గాల మధ్య స్పష్టమైన విభజనని నిర్ణయించుకున్న రచయిత రావిశాస్త్రి. ఈ వర్గదృక్పథపు పదును వల్ల జెండర్ వివక్ష బాధింపబడిందేమో పరిశీలించడం ఒక ఆసక్తికరమైన అంశం. పీడిత వర్గాల్లోనూ ఆది పీడితులు స్త్రీలే కనుక వారి గురించి రావిశాస్త్రి ఏం రాశారూ? ఎట్లా రాస్తారన్నది స్త్రీల దృష్టికోణంలో పరిశీలించినపుడు కొత్త విషయాలు చర్చకి వచ్చే ఆస్కారముంది.

*'పాడి'* కథలో నూకాలమ్మ, *'మాయ'* కథలో ముత్యాలమ్మ, *'న్యాయం'* కథలో వేశ్య, *'పుణ్యం'* కథలో పోలమ్మ *మోక్షం* కథలో ముసలమ్మ ప్రధాన స్త్రీ పాత్రలు. నిర్మాణరీత్యా ఈ అయిదు పాత్రలూ క్లిష్టత ఉన్న పాత్రలు (Round characters) కావడం గమనార్హం. నిశ్చల నిశ్చితంగానో, నలుపు తెలుపులు గానో కాక ఒకపాత్ర స్వభావంలోనూ, నడకలోనూ ఘర్షణ, లోకప్రమాణాలకు అందని ప్రవర్తన, భిన్న కోణాలూ దాగి ఉన్నప్పుడు ఆ పాత్రని క్లిష్టత ఉన్న పాత్రగా చెప్పుకోవచ్చు. క్లిష్టత లేని పాత్రల్ని (Flat characters) నమూనాల్ని (Archy types) సృష్టించడం రచయితలకు సులువుగా ఉంటుంది కానీ వివిధ వర్ణాల కలబోత పాత్రలు రచయితలకు సవాల్ వంటివి. చిత్రం ఏంటంటే రావిశాస్త్రి సాహిత్య పాత్రల్లో నూటికి తొంభైశాతం క్లిష్టత ఉన్న పాత్రలే. ఆ రకమైన ప్రత్యేకత ద్వారా తదనంతర రచయితలకి ఒక ట్రెండొసీ నమూనాని సెట్‌చేసి పెట్టారు రావిశాస్త్రి.

1960ల నాటికి సాహిత్యంలో కొత్త ధోరణలు వచ్చాయి. కలల సాహిత్యం,





ఆదర్శాలకు పట్టంగట్టే సాహిత్యం మొదలయింది. ఆరడుగుల అందగాళ్ళు, ఆత్మాభిమానంతో వెలిగిపోయే అమ్మాయిలూ, తియ్యని కష్టాలూ, శుభంకార్డు ముగింపుల సాహిత్యం కూడా పాఠకుల సంఖ్యని ఇతోధికంగా పెంచుతూ ఉన్న సందర్భం అది. అలాంటప్పుడు ఎటువంటి స్త్రీలను సాహిత్యానికి పరిచయం చేశాడు రావిశాస్త్రి! "సారా సరఫరాలో ముండల కంపెనీ మేనేజిమెంటులో లెక్కలు చూచుకుని రిక్షావాళ్ళ నుంచి అద్దెలు వసూలుచేయడంలో, రౌడీలనీ నిలబెట్టి వాళ్ళకి పనులు పురమాయించడంలో, చిన్నకారు జవాన్లని అదుపులో ఉంచడంలో పెద్దలకు మూతులు కట్టడంలో, డబ్బు దాచడంలో అది మూలక్కుండా వడ్డీలతో దాన్ని పెంచడంలో ..." ఆరితేరిన నూకాలమ్మని చూచినపుడు అధికారం ముందు స్త్రీ పురుష భేదం ఎంతగా సన్నగిల్లుతోందో అర్థమవుతుంది.

తమ ఊహల్లోనో, వాస్తవంలోనో ఉన్న కొన్ని రకాల పాత్రలనూ అంశాలనూ చిత్రించలేదని రచయితలపై విమర్శలు రావడం చూస్తూనే ఉంటాం. అయితే రచయిత సమస్తాన్నీ సృజన చేయగలిగిన శక్తిమంతుడు కాడు. రచయిత తన బుద్ధినీ, హృదయాన్ని నిలిపిన చోట అది సమస్తంలోని కొన్ని పార్శ్వాల మీదే అయినప్పటికీ గొప్పసాహిత్యాన్ని సృష్టించగలరు. అటువంటి తాదాత్మ్యతతో రావిశాస్త్రి స్త్రీ పాత్ర చిత్రణ చేశారు.

నూకాలమ్మ పాత్ర స్వభావాన్ని చూసినపుడు తుర్గినెవ్ కన్యలు గుర్తొస్తారు. అధికార మోహితులైన స్త్రీలను వారి నడతనూ గొప్పస్వరం (good tone) తీసుకుని రాసిన రచయిత తుర్గినెవ్. స్త్రీలు సర్వవేళలా నిజాయితీయులే కానక్కరలేదని అధికారం సమకూరినపుడు స్త్రీలు కూడా పురుషుల మాదిరిగానే వ్యవహరిస్తారన్న కఠోర వాస్తవాన్ని ఆ సాహిత్యం తెలియజేస్తుంది. జీవన తాత్త్వికత అమరిన రచయితలు పతనం చెందిన పాత్రల పట్ల ఎంతటి ప్రేమని కలిగి ఉంటారో తుర్గినెవ్, రావిశాస్త్రిల స్త్రీ పాత్రలు తెలియజేస్తాయి.

విశాఖపట్నం నేపథ్యంగా లంపెన్ (Lumpen) వర్గపు జీవితాల్ని చిత్రించే క్రమంలో స్త్రీల జీవితాలను దయనీయం చేసే పలు కోణాలను ఆవిష్కరించారు. పేదరికం, సారా అమ్మకాలు, వ్యభిచారం, హత్యలు, కోర్టు కేసులు, జైళ్ళు, రాజకీయాల మధ్య కింది తరగతి స్త్రీల వేదనను *ఆరు సారాకథలలో* ప్రతిఫలించారు.

న్యాయభావన మాయగా మారిపోయిన స్థితిలో వంటసారాకేసులు పట్టుబడిన

విషయంలో ఒక వేశ్యకీ, మేజిస్ట్రేటుకీ మధ్య జరిగిన సంభాషణ...

"మదరాసు ప్రొహిబిషన్ యాక్టు సెక్షన్ 4(1) ఎ ప్రకారం నువ్వు నేరం చేసేవని పోలీసువారు నీ మీద కేసు పెట్టేరు. నేరం చేసేవా?" అని ముద్దాయిగా నిలబడ్డ ఆమెని పద్ధతి ప్రకారం ప్రశ్నించేరు.

సమాధానంగా పిల్ల తలూపింది.

"తలూపడం కాదు. నోటితో సమాధానం చెప్పాలి"

"కేసు వొప్పేసుకుంటానండి" అందామె

"అంటే నేరం చేసేనంటావా?"

"కేసు వొప్పేసుకుంటాను బాబుగారూ"

"అంటే నేరం చేసేనంటావా?"

"నేనేం నేరం చెయ్యలేదండి"

"అయితే నేను వొప్పుకుంటానని యెందుకంటున్నావు?"

"కేసు వొప్పేసుకుంటానండి"

"కేసు వొప్పుకోవడం అంటే ఏమిటో నీకు తెలుసా?" అంటూ సాగుతుంది. సారా అమ్మినందుకు కాక సారా తాగినందుకు తీసుకొచ్చి అబద్ధపు కేసు పెట్టించారని తెలియడ మొక విశేషమే అయినా వేశ్యలచే బలవంతంగా మందు తాగించి ఆనందించే విటుల సరదాలు విస్మయ పరుస్తాయి. వ్యభిచారానికీ, సారా వ్యాపారానికి, గూండాగిరికి వీలున్నన్నింటికీ రాజకీయాలకు ఉన్న లింకు... వీటిలో భాగమై అనివార్యంగా రాటు దేలిన స్త్రీలను మరింతగా కిందికి దిగజారిన స్త్రీలనూ వ్యంగ్యంతోనూ, ఆర్తితోనూ చిత్రించారు.

*'మాయ'* కథలో సారా వ్యాపారం చేసే ముత్యాలమ్మ కథాకాలం నాటికి 'భూమట్టమయిపోయి ఉన్నానంటుంది. సారాకేసుల్లో కోర్టు, జవాన్లు, ప్లీడర్లు, మెజిస్ట్రేట్ల సవాలక్ష లెక్కల మధ్య న్యాయం మాయగా మారిపోయే స్థితిని ముత్యాలమ్మ బోధించినపుడు ప్లీడరుతో పాటు పాఠకులూ నివ్వెరపోతారు. ఈ కథలో ముత్యాలమ్మ పాత్రలో రెండు ప్రధాన పార్శ్వాలు ప్రత్యేకంగా కనిపిస్తాయి. మొదటి దాంట్లో తన గత వైభవం, సారావ్యాపారం దెబ్బతిని చితికిపోవడం, ఆరేళ్ళ చురుకైన కూతురు, పోలీసుల జాడ





పసిగట్ట గానే 'అమ్మీ కుక్కలొస్తున్నాయే' అని హెచ్చరించగల కూతురు పిచ్చికుక్క కరిచి మరణించడం, సారా పాలయిన మొగుడు, పోలీసుల పాలయిన సారా వ్యాపారి మధ్య కుమిలి కుమిలి ఏడుస్తున్న ముత్యాలమ్మ మీద మామూలు యివ్వలేదని కేసు పెట్టడం లాంటివన్నీ ప్లీడరుతో చెప్పుకుని, ఫీజు తగ్గించమని వేడుకుంటున్న ముత్యాలమ్మ మన కళ్ళని తడిచేస్తుంది.

సాక్షులిద్దరినీ గట్టిగా క్రాస్ చేసి బోల్తా కొట్టించి తన వాదనా పటిమతో కేసు గెలిపించబోతున్నానన్న ధీమాతో ఉన్న కుర్రప్లీడరుకి, కేసుల గెలుపోటముల మాయని బోధ పరిచిన తీరు ముత్యాలమ్మలోని మరో పార్శ్వాన్ని చూపుతుంది. తన మీద కేసు పెట్టిన వాడికే లంచం ముట్టచెప్పటం ద్వారా కేసు ఆమె వైపు తిప్పుకోగలిగింది గానీ తన వాదం చట్టం, న్యాయం ద్వారా కాదని ప్లీడరుకి కనువిప్పు కావడం కథా నిర్వహణని పతాకస్థాయికి తీసుకువెళ్ళింది. ప్లీడరు చిన్నబుచ్చుకుంటాడేమోనని మళ్ళీ చివర్లో అతన్ని అనునయించి అతని అత్మవిశ్వాసాన్ని నిలబెట్టాలని చెప్పే మాటలు మనసుని రసార్ధ్రం చేస్తాయి.

*సారాకథల్లో* మరొక ముఖ్యమయిన విషయం సారా వ్యాపారానికీ, పట్టణ, దిగువ తరగతి స్త్రీలకి మధ్య ఉండే సంబంధం. పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడిని అత్యధికంగా నిర్వహిస్తున్నది పురుషులే. స్త్రీలు కేవలం వస్తువును ఉత్పత్తి చేసే శ్రామికులుగానో, ప్రచారం చేసే సాధనాలుగానో భాగస్వామ్యం పొందుతున్నారు. పెట్టుబడికి జెండర్ అండనే మాట నిజమే కానీ ఆచరణలో పెట్టుబడిదారుల్లో పురుషులే అధికంగా ఉంటారు.

అయితే పట్టణ, దిగువ తరగతి సారా వ్యాపారాలల్లో ఆ చిన్న పెట్టుబడిని నిర్వహించే అనివార్యత స్త్రీలకు ఉండటం ఒక విశేషం. దీని వెనుక ఉండే రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక కారణాలనూ వాటి మూలాలనూ పరిశోధించాల్సిన అవసరాన్ని *ఆరుసారా కథలు* తెలియజెప్పుతున్నాయి. పెట్టుబడి పెట్టడం, సారా తయారీ అమ్మకం కొన్ని సందర్భాల్లో లైసెన్సులు లేకుండా దొంగసారా తయారీ, అమ్మకం... వీటివల్ల కేసులు ఎదుర్కొంటున్న వాళ్ళలో స్త్రీలు అత్యధికంగా ఉండటమనే ప్రత్యేకతని *ఆరుసారా కథలు* బాగా పట్టుకున్నాయి.

*పుణ్యం కథ*లో పోలమ్మ తన లాభం తనకి తెలీక నష్టపోయే వెర్రి వెంగలప్ప అంటాడు కథ చెప్పే ఆయన. పోలీసుల్లో కూడా మంచితనం చూడగలిగిన పోలమ్మ మంచితనం మీద నమ్మకం ఉందంటాడు కరుణాకరం. మంచి చెడు, పాపం పుణ్యం వంటివేమీ లేవని లాభం నష్టం రెండే ఉన్నాయని చెప్పే పాత్రని పోలమ్మ మంచితనం ఎట్లా జయించిందో చదివినపుడు చెడుని జయించడానికి మంచితనం ఎట్లా మార్గమో బోధ పడుతుంది. పోలమ్మలాంటి వాళ్ళు లోకంలో కోటానుకోట్లు ఉన్నారనే వాళ్ళు ఎల్లకాలం వెర్రివెంగళప్పల్లా ఉండిపోరనీ ఎపుడో అపుడు గప్పున తెలివి తెచ్చుకుంటారన్న సూచన కథలో అందుతుంది. మరుక్షణం పోలమ్మ మంచితనపు పరిమళం మనని చెడుకి విముఖుల్ని చేస్తుంది.

*'మోక్షం' కథ*లో ముసలమ్మ దయనీయ స్థితిని ఒకే ఒక్క సన్నివేశంలో చిన్నభాగంగా చెప్పినప్పటికీ చాలా రోజుల పాటు వెన్నాడుతుంది. కోర్టులో కనిపించవద్దని మెజిస్ట్రేటు ఎన్ని సార్లు చెప్పినా సారా కేసులోనో, కల్లు కేసులోనో కోర్టుకి వచ్చేస్తుంది. ఎపుడూ అబద్ధం కేసే. ఎపుడూ వాదించదు. కేసు వొప్పేసుకుంటుంది. జరిమానా కట్టదు. మూణ్నెల్లో ఆర్నెల్లో జైలు శిక్ష పడటమే కావాలి తనకి. శిక్ష ప్రకటించగానే "అదే వకీలు బాబూ కానీ సూదు బాబూ ఒణ్నం రాయించు బాబూ! ముసిల్దాన్ని ఆ జూన్నకూదు తిన్లేను. సచ్చిపోవాలన్న మాట. ముసిల్దాన్ని సంపేక ఒణ్నం రాయించా బాబూ వచ్చే జల్మల నీ కడుపున పుడతాను. ముసలి ముండకూతుర్ని" అంటుంది. ఈ దీనత్వానికి ఎవర్ని నిందించాలో తెలియని అసహాయతలోంచి వ్యవస్థ పై క్రోధంతో రగిలిపోతాము. ప్రత్యేకించి స్త్రీలుగా ఎదుర్కొనే సమస్యలుగా కాక పేదవర్గపు పీడనలో ఇమిడిపోయి ఉన్న జెండర్ వివక్షను *ఆరుసారా కథ* ల్లోని స్త్రీ పాత్రలు నిరూపిస్తాయి.

టాల్ స్టాయ్ రచనల్లో పాత్రచిత్రణ పట్ల ప్రత్యేక శ్రద్ధ కనపడుతుంది. పాత్రల్ని వర్ణించే తీరు ఆ శ్రద్ధని పట్టిస్తుంది. రావిశాస్త్రి పాత్రలు కూడా కథానిర్మాణం లోని చాలా అంశాలను వెనక్కి నెట్టి ముందుకు వచ్చి నిలబడతాయి. బలమయిన, నిబద్ధమయిన ఇతివృత్తం దానికి అనుగుణమైన పాత్ర నిర్మాణం వల్ల నూకాలమ్మ, ముత్యాలమ్మ, పోలమ్మ, ముసలమ్మ, వేశ్యలను మనం ఎన్నటికీ మరిచిపోలేము.





## రావిశాస్త్రి గారి కథలు–పరిశీలన

**:బీనాదేవి**

రావిచెట్టు వేరు చర్మవ్యాధులకి మంచిది. రావిచెట్టుకిందే బుద్ధుడు తపస్సు చేశాడు. అందుకే దాన్ని బోధి వృక్షం అని కూడా అంటారు. రావిశాస్త్రి గారి రచనలు సాహిత్యానికి బోధివృక్షం లాంటివి. అవి అర్థం అవ్వాలంటే నిజంగానే తపస్సు చేయాలి. అంత పవర్‌ఫుల్ గా ఎలా రాయగలిగేరు? ఆయన డికెన్స్, షా, మపాసా, టాల్‌స్టాయ్, చెకోవ్ లాంటి మహారచయితల సాహిత్యం ఔపోసన పట్టేశారు.

వాటితోపాటు అట్టడగు మనుషుల జీవితాలు చదివేరు. ఆ జీవితాల భాష విన్నారు. ఎ.సి. గదిలో కూర్చొని దరిద్రం గూర్చి ఎప్పుడు రాయలేదు. వృత్తిరీత్యా క్రిమినల్ లాయరు. దగా, మోసం, పోలీసులు, దొంగలు, దొంగసాక్ష్యాలు క్షుణ్ణంగా తెలుసు. ముఖ్యంగా అతనికి కోర్టులంటే ఎలాంటి అభిప్రాయం ఉందో *న్యాయం* అన్న కథలో రాశారు.

గుప్పున సారా కంపు – కోర్టు
గొల్లున సంతగోల – కోర్టు
అబద్ధాలకి పాముల పుట్ట – కోర్టు

అనాథల ఆక్రందన, అసహాయుల ఆర్తనాదం, పేదల కన్నీటి జాలు, అదే మాయా కోర్టు. అంతేకాదు లాయార్లంటే కూడా అంతే అసహ్యం. "లాయర్లంత స్కౌండ్రల్స్ మరొకరు భూప్రపంచంలో లేరు. పరమ ధూర్తులు. As a class, I hate them though I belong to them" అంటారు.

'కాదేదీ కవిత కనర్హ ం' అని శ్రీ.శ్రీ. అంటే, కాదేదీ కథకి అనర్హం అన్నారు శాస్త్రిగారు. ఎండ, వర్షం, నల్లమేక, కోడిపెట్ట... ఇలా అన్నిటి మీద రాశారు. అతని కథలన్నీ చుట్టూ ఉన్న మనుషుల జీవితాల్లోంచి వచ్చాయి. ఆ జీవితాల్లోని దరిద్రం లోంచి వచ్చాయి. ఆ దరిద్రంలో ఉన్న భాషలోంచి వచ్చాయి.

తన దగ్గరకొచ్చే పార్టీలంతా అట్టడుగు ప్రజలే. ఒకసారి ఒక ఆడమనిషి

వచ్చిందట " నీకు దిక్కెవరూ లేరా అమ్మా?" అనడిగేరు. "దిక్కెవరున్నారు బాబూ! ధరణి భూదేవి, ఆపైన దేముడు, ఆ యెనక నీలాంటి మారాజులు అందిట. దాన్ని ఆయన తన కథలో వాడుకున్నారు. ధరణి అన్నమాట ఆ చదువురాని పల్లెటూరి మనిషికి ఎలా వచ్చింది? తమ ఆవేదనల్ని ఇతరులకి స్పష్టంగా చెప్పాలంటే బలమైన భాషే పుట్టుకొస్తుంది అంటారాయన.

శాస్త్రిగారి రచనల్లో వర్ణనలు ఎక్కువని ఒక విమర్శ ఉంది. దానికాయన సమాధానం "ఔను విషయ పరిపుష్టికి భావ తీవ్రతా సూచకంగా సమర్థంగా వర్ణిస్తే తప్పేమీలేదు. చుట్టూ ఉన్న వాతావరణాన్ని పరిచయం చెయ్యడానిక్కూడా వర్ణనలు అవసరమే" అంటారు. అంటే అవి మనల్ని కథలో రాబోయే సన్నివేశాలకు సిద్ధం చేస్తాయి.

*న్యాయం* అన్న కథలో ఒక వేశ్య సిగ్గుని "పగటివేళ మెరుపులా వికృతంగాను, అర్ధరాత్రి మెరుపులా భయంకరంగాను ఉందామె సిగ్గు" అన్నారు. సిగ్గును ఇంతకంటే బాగా ఎవరూ చెప్పలేరు. ఆమె ఎలా ఉంది? వంట్లో ఊపిరి లేదు. ముఖంలో కళాకాంతులు లేవు. మూడోతరగతి రైలు పెట్టెలో ఓ మూల నలిగిపడి వాడిపోయిన పువ్వుల దండలా ఉందామె.

రచయిత కొంచెం కష్టపడితే బీదరికం, బాధలు వగైరాలు రాయగలడేమో కాని "*నల్లమేక" కథ* లాంటిది మాత్రం ఎవరూ రాయలేరు. శాస్త్రిగారి ప్రకారం కథ మొదటి పేరా పాఠకుడ్ని పిలక పట్టుకుని చివర వరకు చదివించగలగాలి అప్పుడే అది మంచికథ అవుతుంది. *నల్లమేక* కథ ప్రారంభంలోనే ఈ మనుషులు గడుసు వెధవలు అనుకుంది. అది భారతం చదవలేదు. హరికథలూ వినలేదు. అంచేత అది ఎరగదు. అది గోడ మీద నిల్చుని క్రోటను ఆకులు తింటోంది.

"భారతీయులకి సీమ కూరల మీద, మేకజాతికి క్రోటను మొక్కల మీద మోజు ఎక్కువ అంటారు. ఇది మనకి ఫారెన్ సరకుమీద మోజు సెటైర్. మనకేకాదు. మేకకి కూడా. అదే కథలో తోటమాలిని చెప్పులు కరుస్తాయి. ఆ చెప్పులు అతనికి ఆఫీసుగారి భార్య ఇచ్చింది. దానికి శాస్త్రిగారి భాష్యం " ఆఫీసర్లు, వారి భార్యలే కాకుండా, వారి చెప్పులు కూడా కరుస్తాయి అనడానికి ఇదొక నిదర్శనం" మన ఆలోచనల్ని మనం





సరిగ్గా రాయలేం. అలాంటిది శాస్త్రిగారు మేక ఆలోచనల్ని ఎంత గొప్పగా రాశారు! కారు కింద పడబోయి తప్పించుకున్న నల్లమేకని తోటమాలి అందరికీ చూపిస్తున్నాడు.

అది గర్భంతో ఉన్న నల్లమేక. వాళ్ళంతా తనవైపు అమర్యాదగా చూడ్డమే కాకుండా వెకిలిగా నవ్వడంతో ఆ మేకకి చాలా కోపం వచ్చి " ఛీ! ఛీ! ఈ మనిషి వెధవలకి బుద్ధి లేదు. చివరికి మర్యాదా, మప్పితం కూడా మరచిపోతున్నారు. ఈ వెధవలు అని ఈసడించి" వీళ్లకి సిగ్గు, లజ్జ లేకపోతే నాకైనా ఉండొద్దా! అని తన తోక కిందకి దించుకుని సాధ్యమైనంతవరకు పొదుగు చాటు చేసుకుని గంభీరంగా వెళ్ళిపోయింది. దాని ఆలోచనల్లో మనుషులు పరమ నీచులు. జంతువుల కంటే హీనం.

*"సృష్టిలో"* అన్న కథ అతిచిన్నది. వీరినాయుడి మూడు కోళ్ళని వీరన్న ఎత్తుకు పోయేడు. అందులో రెండింటిని నక్క ఎత్తుకుపోయింది. నక్కపిల్లల్ని కొండచిలువ తినేసింది. మిగిలిన మూడో కోడిని మళ్ళీ వీరినాయుడు తీసుకుపోయేడు. ఇంతే కథ. కాని దాన్ని మలచడంలో శాస్త్రిగారి ప్రతిభ అపూర్వం.

ముందు వాతావరణం వర్ణిస్తారు. "వెన్నెల చల్లగా ఉంది. తుమ్మలు దొంగల్లా ఉన్నాయి. రాళ్ళు బండగా ఉన్నాయి. దొంగ గెడ్డతో ఇసక మెత్తగా ఉంది. వల్లకాడు శవరహిత ముండ మోపిలా ఉంది. (ఏం ఉపమానం శాస్త్రిగారూ! శవాలు ఉంటే ముత్తైదువులా కలకలలాడుతూ ఉంటుందా? అంటే స్మశానానికి శవాలే అందమా?) కోడిపెట్ట మాత్రం కోళ్ళ గూట్లో కూర్చుని కళ్ళు మూసుకుందే కాని నిద్రపోలేకపోతుంది. దానిది కోడికునుకు. జీవితం దానికి అర్థంకాకుండా ఉంది. వందఏళ్ళు తపస్సు చేసిన మునీశ్వరులకే అర్థం కాలేదు. ఆఫ్టరాల్ కోడిపెట్ట ఎంత? తను ఎందుకు పుట్టింది? అది వేదం చదవలేదు. ఖురాన్ చదవలేదు. అది ఎమ్మే చదవలేదు. కథలేవీ ఊహించలేదు. ఇవన్నీ చేసిన జీవితం అర్థం కాదు. అర్థం కానిదే జీవితం. ఆ సంగతి దానికి తెలీదు. దానికి ప్రశ్నలు వేసుకోవడం కూడా సరిగ్గా రాదు! కాని ఆ సమయంతో అది ఆ గూడు కింద నిరాకారుడైన దేవుడి ముందు రెక్కలొచ్చిన కొశ్చన్ మార్కులా (ఈ ఉపమానం ఎవరైనా ఊహించ గలరా?) ధిక్కరించి కూర్చున్నట్టు కూర్చొంది. అదే సమయంలో ఓ నక్క తన పిల్లల తిండి కోసం బైల్దేరింది.

వెన్నెల చల్లగా ఉన్న రచయితలకీ రచయిత్రులకీ అయితే చల్లగాలికీ, వెన్నెల

తడికీ, కడుపులు నిండిపోవచ్చేమో కాని మిగతా జంతువులకి అలా కడుపులు నిండవు అంటారు శాస్త్రిగారు.

వీరన్న విసిరిన కర్ర తగిలి ఆ నక్క చచ్చిపోయింది. చచ్చిపోతున్నప్పుడు అది కూడా కోడిలాగే “నన్నెందుకు పుట్టించేవు? ఎన్ని హింసలు పెట్టించేవు? ఎన్ని పాపాలు చేయించేవు? ఎందుకు చంపుతున్నావు? అని దేవుడ్ని అడుగుతుంది. పాపం రాత్రంతా నిద్రలేని కోడిపెట్టకి ఏమీ అర్థం కాక విసుగేసింది.” ఛీ! ఈ దేవుడి లోకం గురించి ఆలోచిస్తేనే పాపం! అని ఛీత్కరించుకుంది.

తమాషా ఏమిటంటే, ఒక్క మనిషి తప్ప మిగిలిన ప్రతి ప్రాణి తనెందుకు పుట్టేను? అని ఆలోచిస్తుంది. మనిషి మాత్రం ఏదో ఉద్ధరించడానికే పుట్టేనని అనుకుంటాడు.

ఒక చిన్న చీమని ఆధారంగా చేసుకుని కమ్యూనిజం గురించి చెప్పడం ఒక్క శాస్త్రిగారికే చెల్లింది. పిపీలికం అన్న కథలో ఒక చీమకి నేనెవరు? అన్న సందేహం వచ్చింది. ఇంతవరకు ప్రపంచంలో ఆ ప్రశ్న ఎవరూ వేసుకోలేదు. ఒకవేళ వేసుకున్నా సమాధానం దొరకదు. కాని ఆ చీమ పట్టు వదలలేదు. తోటి చీమలు తిట్టినా వినకుండా నిగమశర్మ అనే బ్రాహ్మణుడి దగ్గరకి వెళ్ళి “స్వామీ! నేనెవర్ని ? ఎందుకు పుట్టేను? ఎందుకు బతుకుతున్నాను? ఎందుకు చస్తాను? అని అడిగింది. అప్పుడతను ఎలా ఉన్నాడు? గొప్ప ఆకలి మీద ఉన్నాడట. (శాస్త్రిగారూ! ఆకలి క్కూడా గొప్ప, పేద అన్న వర్గ భేదం ఉంటుందా?)

ఆత్మపదార్థానికైనా సరే ఆకలి తప్పదని నిగమశర్మకి తెలుసు. ఈ చీమకి చదువు చెప్పి నాలుగు నూకలు లాగొచ్చు అని ఆశ పడ్డాడు. “అలాగే చెప్తాను. ఆకలికి మాడి చచ్చేవాడు ఆ పరమాత్ముడైనా సరే (పరమాత్ముడికి ఆకలి వేస్తుందా?) ఎవరికీ పాఠాలు చెప్పలేడు. ప్రతిరోజు నువ్వు నాకు ఓ గిద్దెడు నూకలివ్వు చాలు” అన్నాడు. అది ఎద్దులా కష్టపడి నూకలిచ్చి చదువు నేర్చుకుంది. ఆఖర్ని నేనెవర్ని స్వామీ! త్వరగా చెప్పండి అంది. నిగమశర్మ మనసులో నవ్వుకుని ‘నువ్వు చీమవి’ అన్నాడు. అది గెంతుతూ వెళ్ళిపోయింది. వెళ్ళిందే కాని దాని అనుమానాలు ఇంకా అలాగే ఉన్నాయి.‘ చీమంటే ఏమిటి? కాళ్ళా? చేతులా? తలా? ఇలా రకరకాల ప్రశ్నలు. ఈ సారి చతుర్వేది అనే





బ్రాహ్మణుడి దగ్గరికి వెళ్ళి తన సందేహాలు అడిగింది. అతనికి గురుదక్షిణ అలవాటు లేదట. కాని అతను చేయబోయే యజ్ఞానికి బంగారం కావాలి. అంచేత అతను చీమని రేణువు రేణువు చొప్పున ఎంత తేగలిగితే అంత తెమ్మన్నాడు. అంటే పండితుడు చీమ సాయం కోరాడు.

మొత్తానికి ఆ చీమకి వేదసారం అంటే ఒక్క ముక్కలో చెప్పేడు. “సోహం” అన్నాడట. దానికి ఏమర్థమైందో తెలీదు కాని తిరిగి తన పుట్ట దగ్గరికి వెళ్ళిపోయింది. అయితే ఆ పుట్టలో తన బలగం చీమలు లేవు. మరేమిటుంది? ఒక పాము ఆ పుట్టను ఆక్రమించింది. చీమ ధైర్యంగా వెళ్ళి మాకు అపకారం చెయ్యటం మీకు న్యాయమా? అని అడిగింది. గుడిసెలు కూల్చేస్తున్న బుల్ డోజర్లని ఆ కార్మికులు అడిగినట్టు. అప్పుడా పాము అంగుళం కదలకుండా దర్జాగా పడుకొని ఓ చిన్న లెక్చరు ఇచ్చింది.

“నేను సుఖభోగిని. నువ్వు ఒకతుచ్ఛజీవివి. కష్టజీవులు కష్టపడాలి. సుఖభోగులు సుఖపడాలి” అని కాపిటలిస్టు సిద్ధాంతాన్ని ఒక్క ముక్కలో చెప్పింది. పైగా అది ప్రకృతి ధర్మం ఉంది. భగవంతుడే ఆ హక్కు ఇచ్చేడంది. ఆ చీమకి చిర్రెత్తింది. తరువాత ఆశ్చర్యపోయింది. ఇంతమంది దగ్గర చదువుకున్నాను. అందరూ నువ్వో చిరుప్రాణి వన్నారు. చీమ పేరుగల దానివన్నారు. దేవభాషలో పిపీలికం అన్నారు. అదన్నారు. ఇదన్నారు. అంతేగాని నువ్వు కష్టజీవివని ఎవరూ చెప్పలేదు. అంత పెద్ద పండితులు చెప్పనందుకు వాళ్ల మీద కోపం వచ్చింది. తన ఎదురుగా ఉన్న శత్రువు పాము అన్న సంగతి మరచిపోయింది. వెంటనే “ మేము కష్టజీవులమే కావచ్చు. నువ్వు సుఖభోగివే కావచ్చు. కాని మాకష్టాలమీద నువ్వు సుఖపడటం మేము సహించం. తిరగబడతాం. నువ్వు జెప్పింది భగవన్న్యాయం అయినా సరే అది అన్యాయం కాబట్టి మేము సహించం” అని సవాలు చేసింది.

“బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చావదే సుమతీ” అన్నది నిరూపించింది. తన వాళ్లందరినీ కూడగట్టుకుని ఆ పాముని చంపేసింది. ఈ కథలో అంతర్లీనంగా అన్యాయాన్ని ఎదిరించి పోరాడమని సందేశం ఉంది. కష్టజీవులు కడుపు మండితే తిరగబడతారు. వాళ్ల కడుపు మండితే శత్రువుని దగ్ధం చేసేస్తారు. ఒక గొప్ప సందేశాన్ని అతిచిన్న చీమని సింబాలిక్ గా తీసుకుని రాయడం ఒక్క శాస్త్రిగారికే చెల్లింది.

స్వాములవారు తన పంథాలో అలా ఉపన్యాసాలు ఇస్తూనే ఉంటారు. జనాలు మందు చల్లినట్టు వింటూనే ఉంటారు. తరువాత అంతా మామూలే. ఇంతకీ వాళ్ళు చీమలాగా, కోడిలాగా 'నేనెవరు? అని ప్రశ్న వేసుకోరు. వాళ్ళు మహాత్ములమని జనాన్ని మభ్యపెడతారు. అంతా 'మిథ్య' అనుకోమంటారు. కాదు అని 'బుద్బుదం' కథ చెబుతుంది.

"నీట్లోంచి లేచిన బుడగ ఎంతసేపు ఉంటుంది? ఉండదు. ఏమవుతుంది? బద్దలైపోతుంది. బద్దలవ్వడం అంటే ఏమిటి? మళ్ళీ నీట్లో కలిసిపోవడమే కదా! బుడగ నీట్లోంచి లేచింది. నీట్లోనే కలిసిపోయింది. నీరు నీర్లోనే ఉన్నప్పుడు ఆ నీరు పుట్టడం ఏమిటి? చావడం ఏమిటి? అంతా అసందర్భమే కదా? ఆ నీరు పుట్టలేదు చావలేదు. అలాగే ఆత్మపదార్థం పుట్టదు. చావదు" అని శాస్త్రులుగారు అనర్గళంగా ఉపన్యాసం ఇచ్చేరు.

ఉపన్యాసాలు, ఉపదేశాలు విన్నంత మాత్రాన బాధలు పోవు. బాధపడక మానరు. శ్యాంబాబు అనే కుర్రాడు రోజూ శాస్త్రులుగారి పురాణం విన్నాడు. వాడు పరీక్ష పాసవడం కోసం పురాణం వింటున్నాడు అనుకుంది తల్లి. కాదట తన తల్లి ఆరోగ్యం బాగు పడాలని వింటున్నాడు. పురాణాలు, వేదాంతం విన్నంత మాత్రాన చదువూ రాదు. ఆరోగ్యం బాగుపడదు. కాని ఆ వెర్రికుర్రాడికి అది తెలీదు. ఆఖరి రోజు ప్రసాదం తీసుకుని ఇంటికి వెళ్ళేసరికి తల్లి చచ్చిపోయింది. అతని ఏడుపును చుట్టూ ఉన్న మనుషులు, ఊరు, ఆకాశం అన్నీ విన్నాయి. ఆ ఏడుపుకి అవధులుండవనీ, అది ఒకంతట చల్లారదనీ అందరికీ తెలుసు. శాస్త్రులుగారి ఉపన్యాసం మీద దెబ్బకొట్టి ఆ కథ ముగుస్తుంది.

"నీటిబుడగ పోయినపుడు మిగతా నీటిబుడగలు ఏడుస్తాయో లేదో భగవంతుడికి తెలియాలి. కాని మనిషి పోతే మాత్రం మనుషులు ఏడుస్తారు. శాస్త్రిగారూ! చావు నిజంకాదని మీకు బాగా తెలిసి ఉండవచ్చు కాని బాధ నిజమని మాత్రం శ్యాంబాబుకి మీకంటే బాగా తెలుసు". నేను కేవలం ఓ నాలుగు కథలు మాత్రమే తీసుకున్నాను. అవైనా కొంత విలక్షణంగా ఉన్నవి. వాటిని నా శక్తి మేరకు విశ్లేషించేను.





## సముద్రం నుంచి ఒక బిందువు

**వి. రామలక్ష్మి**

రావిశాస్త్రి గారి గురించి రాయాలంటే... ఆకాశమంత విశాలమైన, సముద్రమంత లోతైన ఆయన భావాలను, ఆలోచనలను ఆమూలాగ్రం అర్థం చేసుకుని, మనలో ఇంకించుకుని వాటిని వివరించడానికి ప్రయత్నం చేయాలి. అలా చేయాలంటే మనకి ఎంతో సామర్థ్యం కావాలి. ఎన్నో విషయాల ఎరుక ఉండాలి. సూక్ష్మగ్రాహ్యత ఉండాలి. అప్పుడే ఆయన సాహిత్యాన్ని మనం కొద్దిగానైనా అర్థం చేసుకోగలం. అంతటి సామర్థ్యం నాకు లేదు. కాని ఆయన వ్యక్తిత్వమంటే, ఆయన సాహిత్యమంటే ఎంతో ఇష్టం. అందువల్ల నాకున్న చిన్ని మెదడుతో నాకు అర్థం అయ్యాయి అని నేననుకుంటున్న కొన్ని విషయాలను ప్రస్తావించి చంద్రునికో నూలుపోగులా సమర్పించాలని అనుకుంటున్నాను. అందుకని వారి *ఆఖరిదశ, తప్పు* కథలు రెండింటిని తీసుకుని వివరించాలనుకుంటున్నాను.

*ఆఖరి దశ* కథలో శాస్త్రిగారు మహాభారతకాలం నుంచి మొదలు పెట్టి, బుద్ధునికాలం, మొగలాయిలకాలం, ఆంగ్లేయుల కాలం చివరి దాకా ఆయాకాలాల్లో జరిగిన పరిణామాలను ఇద్దరు వృద్ధమిత్రుల సంభాషణల్లో టూకీగా వివరిస్తారు. వారి సంభాషణల్లో చివరి మాటలు అన్ని కాలాల్లోనూ ఒకేలా ఉంటాయని చెబుతారు. వాటిభావం 'ఇంకేం ఉంది? ఇలా జరిగింది కనుక ప్రళయం వచ్చి ఈ ప్రపంచం సర్వనాశనం అయిపోతుంది' అనుకుంటారు. చివరగా, శాస్త్రిగారు అంటారు... 'ప్రపంచం సాగుతూనే ఉంది ఇన్ని వేల సంవత్సరాల నుంచీ ఇన్ని యుగాలనుంచీ... అని.' ఆ మాటలతో పూర్తికథ మీద వెలుగు పడుతుంది. ప్రతికాలంలోను అలా అనుకోవడం ఎంత సహజమో, ఏం జరిగినాగానీ ఈ ప్రపంచం అలా నడుస్తూనే ఉంటుందనేది కూడా అంతే సహజం. ఈ విషయాన్ని శాస్త్రిగారు అలవోకగా చెబుతారు.

తప్పు అన్న కథ దృశ్యం తరవాత దృశ్యంగా నడుస్తుంది. మొదటి దృశ్యం ఏ వాక్యంతో పూర్తవుతుందో రెండవ దృశ్యం అదే వాక్యంతో పూర్తవుతుంది. నరసయ్య

పేదవాడు. అందువల్ల అతను తన లెవిల్ కి తగ్గట్టు ఫీజు ఇచ్చుకో లేడని లాయరు శ్రీకంఠరావు అతని తండ్రి కేసు వాదించడానికి నిరాకరిస్తాడు. లాయరు కూతురు 'తప్పు చేస్తున్నావేమో నాన్నా! అని తండ్రిని హెచ్చరిస్తుంది. అయినా అతను వినిపించుకోడు. 'అతను తనకి తగ్గ లాయరు దగ్గరికి వెళతాడు లేమ్మా! అని అంటాడు. రెండవ దృశ్యంలో నరసయ్య జబ్బుగావున్న తన తల్లిని తీసుకుని మూర్తి డాక్టరు దగ్గరికి వెళతాడు. ఆమెకు ఆపరేషన్ చేసి బతికించమని అతని కాళ్ళవేళ్ళాపడి బతిమిలాడతాడు. అతను తప్పకుండా డాక్టరు అడిగిన ఫీజు ఎంత కష్టపడైనా చెల్లిస్తానని చెబుతాడు. అయినా అతను తనకి 'వేరే అర్జెంటు పని ఉందని, ఇప్పుడు ఆపరేషన్ చేయడం కుదరదని' చెప్పి పంపించేస్తాడు. అపుడు అతని భార్య 'మీరు తప్పు చేస్తున్నారు అతను మీరడిగిన ఫీజు చెల్లిస్తానని అంటున్నాడు కదా, వైద్యం చేయకూడదా?' అని అడుగుతుంది. అయినా అతను వినిపించుకోడు. 'అతని లెవిల్ కి తగ్గ డాక్టరు దగ్గరికి వెళతాడులే' అంటాడు.

మూడవ దృశ్యంలో ఒక రాత్రి భయంకరమైన గాలివాన. కటిక చీకటి. తీవ్రమైన గాలి, జోరుగా వర్షం. శాస్త్రిగారి మాటల్లో చెప్పాలంటే – వర్షం జోరుగా పడుతోంది. ఏనుగు తొండంలా లేక రక్కసి కుండలా అనిపించేటంత హడావుడిగా పడుతోంది. ...ఆ సమయంలో నరసయ్య, కళ్ళెంలో పందిరికింద ఉన్న పశువులని పాకలో కట్టెయ్యాలని, లేకపోతే అవి చచ్చిపోతాయని యజమాని చెప్పగా తలమీద కాడలేని తాటాకుల గొడుగుని రెండు చేతులతో ఎగిరిపోకుండా గట్టిగా పట్టుకుని నడుస్తూ ఉంటాడు. మొలలో ఉన్న బేటరీలైటు తీసి వెలిగించు కోవడానికి కుదరక ఆ చీకట్లో కష్టపడి అలాగే నడుస్తూ ఉంటాడు. అతని బట్టలు పూర్తిగా తడిసిపోయి బరువెక్కి నడవడానికి ఇబ్బందిపెడుతూ ఉంటాయి. ఆ సమయంలో వేగంగా వస్తున్న ఒక కారుకి ప్రమాదం జరిగి రోడ్డువారకి పడిపోతుంది.

ఆ భయంకరమైన చప్పుడుకి నరసయ్య చేతుల్లోని గొడుగు వదిలేసి అటువైపుగా పరుగెడతాడు. ఆ కారు ఒక పక్కకి ఒరిగిపోతూ ఉంటుంది. అందులోంచి ఒక ముసిలాయన తలుపు తీసుకుని బయటకు రావడానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు. ఒక స్త్రీ కూడా ఆ కారులో ఉంటుంది. నరసయ్య కష్టపడి వాళ్ళిద్దరిని బయటకు తీస్తాడు. వాళ్ళిద్దరూ ఏడుస్తూ ప్రాధేయపడుతూ ఉంటారు. నరసయ్య ఆ భయంకరమైన చప్పుడులో





కష్టపడి విషయం అర్థం చేసుకుంటాడు. టార్చిలైటు వెలిగించి డ్రైవరుసీటులో కూరుకుపోయి తీవ్రంగా గాయపడి, స్పృహ తప్పి ఉన్న అతన్ని రక్షించడానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు. ఇంతలో వాళ్ళందరినీ టార్చిలైటు వెలుగులో అతను గుర్తిస్తాడు. అయినా అతను ఒక భుజం మీద, పక్కకి ఒరిగిపోతున్న కారుని పడిపోకుండా కాస్తూ, రెండో చేత్తో మూర్తిడాక్టరుని కష్టపడి లేనిశక్తిని తెచ్చుకుని రక్షిస్తాడు. అంతేకాకుండా, డాక్టరుని భుజం మీద వేసుకుని మోస్తూ, రెండో చేత్తో ఆమెకు ఆసరా ఇచ్చి నడిపిస్తుంటే, ఆమె తండ్రిని పట్టుకుని నడిపిస్తుంటే వాళ్ళని సురక్షిత ప్రాంతానికి చేరుస్తాడు. ఆ పాకలో కింద గడ్డి వేసి డాక్టరుని పడుకోబెడతాడు. అతను బతుకుతాడని గ్రహిస్తాడు. అప్పుడు అతను 'వీళ్ళని నేనెందుకు రక్షించాలి, నేనడిగినంత ఇప్పుడు ఇవ్వగలరా, లేకపోతే ఇంకొకడ్ని తెచ్చుకుంటారు' అని అనుకుంటాడు. మరుక్షణం ఛ! తప్పు అని అనుకుంటాడు.

డాక్టరుకి వైద్యం జరిగి, మర్నాడు వాళ్ళు ఊరికి వెళ్ళేటప్పుడు, 'దేవుడిలా వచ్చి మా ప్రాణాలు రక్షించావు నీకేం కావాలో కోరుకో' అంటాడు లాయరు. నరసయ్య ఏమీ మాట్లాడడు. మనసులో అనుకుంటాడు. 'సరైన లాయరు దొరక్క జైల్లో మగ్గి చనిపోయిన నా తండ్రిని తెచ్చి ఇవ్వగలవా? ఈ డాక్టరు వైద్యం చేయనందున సరైన వైద్యం దొరక్క చచ్చిపోయిన నాతల్లిని బతికించగలవా? అందువల్ల కాలిబుగ్గయిపోయిన నా బంగారు బతుకుని తిరిగి తెచ్చివ్వగలవా? ఏమీ ఇవ్వలేవు' అని ఏమీ అడక్కుండానే అక్కణ్ణించి వెళ్ళిపోతాడు.

ఈ కథ పాఠకుల గుండెల్ని పిండేస్తుంది. అంత డబ్బు ఉన్న ఆ లాయరు, ఆ డాక్టరు పేదవాడైన నరసయ్య ఎంత ప్రాధేయపడ్డా, ప్రాణావసర సమయంలో కూడా చేయగలిగి సహాయం చేయలేదు. కాని తనకి అపకారం చేసినవాళ్ళకి కూడా, ఆ భయంకర వాతావరణంలో, వానలో పూర్తిగా తడిసిపోతూ, లేనిశక్తిని కూడదీసుకుని, మృత్యుముఖం నుంచి వాళ్ళని కాపాడి, వాళ్ళకి ప్రాణదానం చేసి సహాయం చేశాడు నరసయ్య. వాళ్ళ ముగ్గురిలో లాయరు కూతురు, డాక్టరు భార్య అయిన ఆమె చాలా మంచిమనిషి. దయార్ద్రహృదయురాలు ఆమె ఎంత చెప్పినా వాళ్ళిద్దరూ వినిపించుకోరు. శాస్త్రిగారు ఆమె రూపాన్ని చాలా అందంగా, మృదువుగా ఉన్నట్టు వర్ణిస్తారు. ...ఆవిడ పచ్చగా దబ్బపండులా ఉంది. బొద్దుగా ఉన్నప్పటికీ పొడవుగా ఉంది. పొడవుగా

ఉండటమే కాకుండా అందంగా ఉంది. ఆందంగానే కాకుండా చాలా నాజుగ్గా, కళగా ఉంది. మంచిగా కూడా ఉంది.... ఆమెను గురించిన శాస్త్రిగారి వర్ణన ఆమె రూపాన్ని మన కళ్ళకు కట్టినట్టుగా కనిపింపజేయడమే కాకుండా, ఆమె తన స్వభావానికి తగ్గట్టుగా ఉన్నట్లు పాఠకులకు చక్కగా అర్థమవుతుంది. లాయర్ని, డాక్టర్ని వర్ణించిన విధానం, వారి నడవడిక గురించి చెప్పిన విధానం, వారి కరుకు, స్వార్థపూరిత స్వభావాన్ని గురించి తెలియజేస్తుంది. అదేవిధంగా నరసయ్య రూపాన్ని, అతని ప్రవర్తనని వర్ణించిన విధానం అతని మంచితనాన్ని, మృదుహృదయాన్ని తెలియజేస్తుంది. డబ్బుతో సంబంధం లేకుండా మనుషులు తమతమ స్వభావాన్ని బట్టి ఎలా ప్రవర్తిస్తారో వర్ణించడంలో శాస్త్రిగారు ఆయనకి ఆయనే సాటి.

శాస్త్రిగారి కథనం ఎంత పటిష్టంగా, ఎంత ప్రతిభావంతంగా ఉంటుందంటే ఆయన చెప్పదలచిన విషయం సూటిగా పాఠకుల గుండెల్లోకి చొచ్చుకుని పోతుంది. ఆయన పాఠకులపై ఏ ప్రభావాన్ని చూపించాలనుకుంటారో, ఏ విషయాన్ని ఎరుక పరచాలనుకుంటారో అది స్పష్టంగా పాఠకులకు అనుభూతమవుతుంది. ఆయన శైలి పాఠకులను ఎంతో ఆకర్షిస్తుంది. ఆ ఆకర్షణ ఎంత బలంగా ఉంటుందంటే కొంతమంది రచయితలు ఆయన శైలిని అనుకరించడానికి ప్రయత్నాలు చేశారు. చేస్తున్నారు కూడా.

శాస్త్రిగారిని చాలామంది పేదల పక్షపాతి అని అంటుంటారు. అది నిజం కూడా. ఆయన వృత్తి ఆయన ప్రవృత్తికి ఎంతో ఉపయోగపడింది. ధనవంతులు ఇంకా ధనవంతులుగానూ, పేదవారు ఇంకా పేదవారుగానూ మారడానికి ఈ వ్యవస్థ ఎంతగా ఉపయోగపడుతోందో శాస్త్రిగారికి ప్రతినిత్యం అనుభూతమవుతూనే ఉండేది. అట్టడుగు వర్గాల అగచాట్లు గురించి, బతుకు బండిలాగడానికి వాళ్ళుపడే కష్టాల గురించి, వారిమీద మోపబడే అబద్ధపు ఆరోపణల గురించి, వారికి దొరకని న్యాయం గురించి, అన్యాయం చేసే బడాబాబుల చొక్కాజేబుల్లో దాక్కున్న న్యాయం గురించి, ఒక్కమాటలో చెప్పాలంటే బడుగుజీవుల బతుకుల్లోని వేదనని అర్థం చేసుకుని, వారి జీవితాలపై శాసనం చేసే రాజ్యం గురించి, అకారణంగా వారనుభవించే హింసను గురించి శాస్త్రిగారు సృష్టించిన సాహిత్యం విలువకట్టలేనిది.

శాస్త్రిగారి వంటి మంచిమనిషి, ప్రతిభావంతుడైన రచయిత నభూతో నభవిష్యతి.





# రావిశాస్త్రి కథల్లోని శైలీ శైలూషి

:ఎమ్. వి. లక్ష్మి

"ఆవేళ పొద్దున్నే కొండ మీంచి నెమ్మదిగా కిందికి జారిన ఎండ నీలపు పొగమంచుతో కలిసిపోయి, నెమ్మదిగా పురివిప్పగా మెరిసే నెమలిపింఛంలా మెరిసింది. మరికొంతసేపటికి ఆ ఎండే ముద్దుగా విడుతున్న గులాబీ పువ్వులా ఎర్రగా విరిసింది. పదిగంటలకి ఎండ వెచ్చవెచ్చగా ఉంటూ కమ్మగా వండిన వంటవాసనల్లో కలిసిపోయి అన్నం తినిపించే అమ్మ చూపులా హాయిగా ఉంది. పన్నెండు గంటలకి చెట్ల ఆకుల్లోంచి పల్చపల్చగా కిందికి జారిన ఎండ పౌర్ణమి నాటి అర్ధరాత్రి పండువెన్నెల్లా సుఖంగా ఉంది. చెట్ల కింద కొత్త తాటాకు మీద పడుకున్న సుందరానికి పై నున్న లేతాకులన్నీ ఆకుపచ్చ గాజుతో నాజూగ్గా చెక్కిన గాజాకుల్లా వింతగా కనిపించాయి. ఒంటిగంటకి బాగా తళుకెక్కిన ఎండకొత్త కొత్త వెండి గిన్నెలా తళాతళా మెరిసింది."

రావిశాస్త్రి కథలు శైలీశైలూషీ విన్యాసాల కొక మచ్చుతునక ఇది. శైలూషి అంటే నర్తకి. ఒక గొప్ప నృత్య కారిణి ఎలాగైతే వివిధ భంగిమలనూ, విభిన్న ముద్రలనూ ప్రదర్శిస్తూ, జీవితంలోని నవరసాలనూ అభినయిస్తూ ప్రేక్షకులకు మనోరంజనాన్నీ, హృదయ వికాసాన్నీ కలిగిస్తుందో, అలాగే రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి కథల్లోని శైలి మనుషుల్లోని మంచిచెడ్డలనూ, రకరకాల ఆలోచనాతీరులనూ వర్ణిస్తూ, ఈ ప్రపంచంలో అనాదిగా జరిగిన, జరుగుతున్న, జరగబోయే విషయాలను నేర్పుగా అనుసంధానిస్తూ, సమస్త విశ్వాన్నీ మన కళ్ళముందు ఎలా విస్తారంగా పరుస్తుందో చెప్పడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యం.

నాట్యం అంటే లలితకళల సమాహారం. రావిశాస్త్రిగారి కథలు సమాజంలోని సత్యాసత్యాలను చిత్రిస్తాయి. విభిన్న వ్యక్తుల్నీ, పిపీలికాది సమస్త జంతుజాలాన్నీ మన కళ్ళకు కట్టేటట్లు పదునైన పదాల ఉలితో చెక్కుతాయి. ప్రతిజీవి హృదయనాదాన్నీ వినిపిస్తాయి. మనం సామాన్యం అనుకునే సంగతులను అనన్యమైన కవిత్వభాషతో అసామాన్యం చేస్తాయి. ప్రపంచం నలుదెసలా సంభవించే సంఘటనలను మన మెదడు

కుహరాలలో నర్తింపజేస్తాయి. అందుకే ఆయన శైలి శైలూషి లాంటిది.

శైలి అంటే ఒక రచయిత నాడిని పట్టి యిచ్చే రచనా విధానం. ఏదైనా ఒక కథలోని మొదటి పేరా చదివీ చదవగానే 'ఇది పలానా రచయిత రాసినది' అని టక్కున చెప్పగలుగుతాం. అందుకు దోహదపడేవి వాక్యనిర్మాణం, పదప్రయోగం, పదాల ఎంపిక, కథను చెప్పే పద్ధతి మొదలైనవి.

'కాదేదీ కథకనర్హం' అంటూ రావిశాస్త్రిగారు రాసిన ఎన్నో కథలలో *'కలకంఠి'* అనే సంపుటం కింద వెలువడ్డ *నల్లమేక, సైగల్, వర్షం, ఎండ, ముగ్గురు గుమాస్తాల కథ, ది స్మోకింగ్ టైగర్, సృష్టిలో, కలకంఠి, సూరిబాబు నవ్వు* అనే కథలను ప్రధానంగా దృష్టిలో పెట్టుకుని వారి శైలిని సమీక్షించడం జరిగింది. రావిశాస్త్రిగారి శైలిలో విశిష్టంగా కనిపించేది, ఆకర్షించేది ప్రవాహంలా సాగిపోయే ఆయన వాక్యనిర్మాణం, ఒక్క బిగిని చదివింప చేస్తూ, పాఠకుడి మెదడుని ఒక్క కుదుపు కుదుపుతాయి. ఆయన వాక్యాలు అవి సమకాలీన సమాజ పరిస్థితుల్ని మనకళ్ళకి కట్టినట్టు చూపిస్తాయి. ఉదాహరణకి *'ఎండ'* కథలో చేయని తప్పుకి జైలు పాలై కఠిన శిక్ష ననుభవిస్తున్న భర్తనీ, ఏమీ అర్థం చేసుకోలేనీ వెర్రికొడుకునీ, కటిక పేదరికంలో నానాబాధలకూ లోనవుతున్న తన ఆడ పిల్లలనూ తలుచుకుని తీవ్ర పరితాపానికి గురైన శారద దు:ఖాన్ని ఇలా వర్ణిస్తారు, "ఆమె కళ్ళంట జారిన కన్నీళ్ళు నడవలో రాతి గచ్చు మీద పడి అక్కడ కురుస్తున్న నీళ్ళతో కలిసి వాకిట్లోకి కుంటు కుంటూ పోయి, అక్కడి నుంచి రోడ్డు మీదకి తేలి, అక్కడి నుంచి కాలవలోకి దూకి, ఆ రాత్రి ఆ చీకట్లో, ఆ వర్షంలో ఎక్కడో ఏ చీకటి సముద్రంలోకో కాని కొట్టుకుపోయాయి" ఈ వాక్యం చదువుతూంటే కళ్ళు చెమరుస్తాయి.

'సైగల్' అనే కథలో నీచాతినీచుడైన రామారావులో అంతర్మథనాన్ని కలిగించి, అతనిలో హృదయ పరివర్తనకి దోహదం చేసిన కుందల్ లాల్ సైగల్ పాటనిలా వర్ణిస్తారు. "ఈ పాటలో వెన్నెల వెలుగులున్నాయా? చుక్కల తళుకులున్నాయా?... ప్రియురాలి విరహముందా? పడుచు రక్తపు ప్రవాహముందా? కూలివాని కష్టముందా? పేదవాని ఏడుపుందా? సీతాదేవి శోకముందా? రాధేయుని హృదయముందా? అసహాయుని ఆర్తనాదముందా?' *'ముగ్గురు గుమస్తాల కథలో'* గుమస్తాల చాలీచాలని జీతాలు చిన్నచిన్న కోరికలు కూడా తీరడం ఎంతో కష్టం మీద జరిగే పరిస్థితుల్ని బాగా వర్ణిస్తారు. ఇంటద్దె





చెల్లించమనీ వేధిస్తూ, అనరాని మాటలన్న ఇంటావిడనీ, ఆవిడ మేనల్లుడి ప్రవర్తననీ తల్చుకుని అసహ్యంతో గుమస్తా రవి భార్య రవితో "మనం ఈ ఇంట్లోంచి పోదాం, చెట్టుకిందకే పోదాం, మనకి ఈ ఇళ్ళెందుకు? ఊళ్ళెందుకు, ఈ నౌకరీ చాకిరీ లెందుకు? పక్షులు బతకడం లేదా? పశువులు బతకడం లేదా? చెట్టుకిందకే పోదాం. అవీ లేకపోతే ఆపాటి పడి చావడానికి నూతుల్లేవా? గోతుల్లేవా? అవిలేకపోతే మహాసముద్రం లేదా? అందులోకి పోతే అక్కడ్నుంచి మనల్నెవరూ పొమ్మనలేరు కదా" అంటూ కళ్ళొత్తుకుంటుంది. మనస్సుని కదిలించే ఇటువంటి వాక్యాలు శాస్త్రిగారి కథలలో అడుగడుగునా కనిపిస్తాయి. రావిశాస్త్రి కథల్లో ప్రస్ఫుటంగా కనిపించే మరో అంశం – పాత్రోచితమైన, సందర్భోచితమైన పదాల ఎంపిక. జీవితంలో, సమాజంలో, ప్రకృతిలో జరిగే సన్నివేశాలను వర్ణించడానికి తెలుగు భాషలో పుష్కలంగా, విరివిగా ఎన్ని పదాలున్నాయో అన్ని పదాలనూ ఆయన వాడారంటే అతిశయోక్తి కాదు; ముఖ్యంగా శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల్లోని – కూలీ నాలీ చేసుకుని బతికే ప్రజలూ, వివిధ వృత్తులు చేసుకుని జీవిస్తున్నవారూ, పల్లెల్లోనూ పట్నాలలోనూ కూడా బడుగువర్గాల ప్రజలూ తమ నిత్యజీవితంలో వాడే భాషను ప్రయోగించారు. ఉదాహరణకి, నాను, భోగట్టా అడుతుంబడుతుం, ఓలమ్మో, కాలు మట్టీసినాడు, బలిసిపోయి, పారెళ్ళాడు, వెళిపొచ్చీసేడు, గింజుకున్నాడు, గిజామన్నా, వేగిరం– ఇలాంటి ఎన్నో పదాలకు ఆయన గుర్తింపునిచ్చి సాహితీ గౌరవాన్ని కలిగించారు. ఆనాడూ, ఈనాడు కూడా వాడుకలో ఉన్న ఎన్నో హిందీ, ఉర్దూ, ఆంగ్ల పదాలను సహజాతి సహజంగా ఉపయోగించారు. అంతేకాదు కుర్రమేక, చీకటి కోపం, ముసలిచొక్కా, తెల్లటి మేఘాల చాందిని రెయిల్‌గాడీ, మగకుర్రవోడు, సొట్టబుర్రోడు, కడీపని, ఆడమనిషి, ఇసుకగూడు, శృంగారపుటబ్బాయి – లాంటి విచిత్ర పద ప్రయోగాలు కూడా చేసారు. వృత్తిరీత్యా ఆయన లాయరవడం చేత తమవద్దకు వచ్చే పార్టీలతో వారి యాసలోనే మాట్లాడేవారు. రావిశాస్త్రి రచనల ద్వారా పాఠకులు కోర్టుభాషనీ, కోర్టుల్లో జరిగే వాస్తవాలనూ, అవాస్తవాలనూ బాగా అర్థం చేసుకుంటారు.

రావిశాస్త్రి కథల్లో శైలికి ప్రధానంగా పరిపుష్టి నిచ్చేది ఆయన హాస్య వ్యంగ్య రచనావిధానం. సమాజంలోనీ, వ్యక్తుల ఆలోచనల్లోనీ అవకతవకల్ని ఆయన తమ పదునైన మాటల బాణాలతో తునాతునకలు చేయడానికి వాడిన శైలి అద్భుతమైనది.

అసూయ, స్వార్ధం, కామం, ధనాశ, ద్వేషం మొదలైన అవగుణాలతో నానాటికీ ఉగ్రరూపం దాలుస్తున్న ధనిక వర్గాన్ని ఈయన తన కలంబలంతో చీల్చి చెండాడడానికి ప్రయత్నించారు. వేడి వాడి కలిగిన పదాలతో చురకలంటించారు. 'నల్లమేక' కథలో తోటమాలి కర్ర దెబ్బ నుంచి తప్పించుకున్న ఒక నల్లమేక గోడదూకి రోడ్డు మీదకి గెంతేయడంతో, అదే సమయంలో కారు నడుపుతున్న ఒక కుర్రవాడు మేకను రక్షించబోయి, ఒక పేదమనిషిని తన కారుకి బలి చేస్తాడు. మనిషి చావుకి కారణమైన ఆ మేకను తోటమాలి అందరికీ చూపిస్తూ ఉంటాడు. అది గర్భంతో ఉన్న నల్లటి ఆడమేక. వాళ్ళంతా తన వైపు అలా అమర్యాదగా చూడ్డమే కాకుండా, వెకిలిగా నవ్వడంతో ఆ ఆడమేకకి చాలా కోపం వచ్చింది. "ఛీఛీ! ఈ మనిషి వెధవలకి బుద్ధి, జ్ఞానం లేనేలేదు. చివరికి మర్యాదా మప్పితం కూడా మర్చిపోతున్నారే ఈ వెధవలు ఛీఛీ" అని ఈసడించి, తిట్టుకొని "వీళ్ళకి సిగ్గూ లజ్జా లేకపోతే నా కయినా ఉండొద్దా" అన్నట్టుగా తన తోకని బాగా కిందికి దించుకుని, సాధ్యమైనంతమట్టుకు పొదుగు చాటు చేసుకుని, ఆ పరిస్థితుల్లో వీలయినంత గాంభీర్యాన్ని తెచ్చుకుని వడిగా వడిగా నడిచి వెళ్ళిపోయింది వాళ్ళకి దూరంగా. ఇలా క్రిమి కీటకాది, చిన్న, పెద్ద జంతువులను, చెట్లను ప్రతీకలుగా చేసుకుని, ఆయన చాలా ఛెణుకులు విసిరారు. 'సృష్టిలో' అనే కథలో ఒక మామూలు కోడిపెట్ట తాను నిత్యం క్రిములకు చేసే హింస నుంచీ, అనుక్షణం తాను పొందే ప్రాణ భయం నుంచీ తనకి విముక్తి లేదా అని స్వగతంలో చింతిస్తూ, గుడిలో నిరాకారుడైన దేముడి ముందు రెక్క లొచ్చిన క్వశ్చన్ మార్కు ధిక్కరించి కూర్చున్నట్టు గూడు కింద కూర్చున్న చిత్రం పాఠకుల మనోఫలకాల మీద శాశ్వతంగా నిలిచి ఉంటుంది.

రావిశాస్త్రిగారి శైలిలోని నాటకీయత *'ది స్మోకింగ్ టైగర్'* అనే కథలో విశ్వరూపం ప్రదర్శించింది. ఈ నాగరిక పోటీ ప్రపంచంలో గొర్రెమార్కు సిగరెట్లకు పోటీగా పులిమార్కు సిగరెట్లను ప్రవేశపెట్టిన సంస్థ ఇచ్చిన ప్రకటనను చూడండి.

" పులి! పులి! పులి!
పదణాలకి పదిపులులు!
అణాకొక పులి, అద్భుతం కదూ!
జేబులో పులి, గుండెకి ధైర్యం





నోట్లో పులే నవరాజ చిహ్నం
వగలెరిగిన వనితలు మిమ్మల్ని వాంఛించాలంటే
పులితో మీరు ప్రత్యక్షమవండి!

అంటూ రకరకాలుగా ప్రజల్ని మభ్యపెడతారు, చివరికి కథ అనుకోని మలుపు తిరుగుతుంది. ఇలా కళ్ళంట నీళ్ళూ, నిప్పులూ రెంటినీ రప్పించే 'భోగట్టా' లెన్నిటితోనో తమ ప్రత్యేకమైన శైలిలో కథలను రచించి, తరతరాలుగా యుగయుగాలుగా జరుగుతున్న అన్యాయాలు అంతమై, మానవకళ్యాణం జరిగే రోజు కోసం ఎదురు చూసిన రావిశాస్త్రిగారు ప్రజలకూ, పాఠకులకూ ప్రాత: స్మరణీయులు.

## రావిశాస్త్రి తిరుగుబాటు కథలు
## (పిపీలికం, వేతన శర్మ)

**: ఎన్. ఎస్. కామేశ్వరరావు**

పిపీలికం అంటే చీమ అనీ, జీవరాశిలో అది అల్పజీవి అనీ మనకు తెలుసు. ఆవిషయం దానికీ తెలుసు. కాని ఒకనాడు ఉన్నట్టుండి అసలు తనెవరో, ఏమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగిందట. నేనెవర్ని? కళ్ళనా, తలనా, మొండేన్నా? ఎందుకు జీవిస్తున్నాను; మొదలైన ఆలోచనలు కలిగి నిద్రచెడి, ఆరోగ్యం కూడా క్షీణించిపోయిందట. పొరుగు చీమల సలహా మీద పక్క ఊళ్ళో ఉన్న 'నిగమశర్మ' అనే గురువుగారి వద్దకు వెళ్ళి తలవంచి నమస్కరించి 'స్వామీ! నేనెవర్ని? ఎందుకు పుట్టేను? ఎందుకు బతుకున్నాను? వగైరా వగైరా' అడిగిందట. పూటకు తిండిలేక బాధపడుతున్న నిగమశర్మకు ఆ చిరుచీమ అన్నపూర్ణ అవతారంలాగా కనిపించినట్టై కొండంత ఆనందం కలిగింది. తాను ఆకలితో మాడుతున్న యధార్థాన్ని చీమకి చెప్పి, రోజుకు ఒక గిద్దెడు నూకలు తెచ్చియిస్తే చదువు చెప్పగలనన్నాడు. పాపం ఆ చిరుచీమ ఒక్కొక్క గింజ చొప్పున పోగుచేసి, నడుం విరిగేలా మోసి మోసి రోజు గిద్దెడు నూకలు తెచ్చి ఇచ్చేది. వీలైనంత ఎక్కువకాలం తనకు వచ్చిన కొద్దిపాటి చదువుచెప్పి, ఒకనాటి సుముహూర్తాన చీమను పిలిచి చదువు పూర్తయిందని చెప్పాడు నిగమశర్మ. చీమ ఎంతో ఆనందపడి త్వరగా చెప్పండి స్వామీ నేనెవర్ని అని బతిమాలింది. గురువుగారు చిరునవ్వుతో సృష్టి రహస్యం చెప్పారు. 'నువ్వు చీమవి' అన్నారు. 'ఆహా నేను చీమనా! అని సంతోషించి ఇంటికి వెళ్ళిపోయిందా చీమ. తన శ్రమని ఇంతకాలం నిష్ఫలంగా దోచుకున్నాడని పాపం దానికి తెలియదు.

ఇంటికెళ్ళిన కొన్నాళ్ళకి తనెవరో ఏమిటో తనకి సరిగా అర్థం కాలేదన్న విషయం తెలిసింది. మళ్ళీ అదే ఆలోచన. ఈసారి మరొక జ్ఞాని దగ్గరకు వెడితే ఆయన చేయబోతున్న యజ్ఞానికి కావల్సిన హిరణ్యం తెస్తే చీమకు వేదసారం తెలియజేస్తానన్నాడు. కొన్ని సంవత్సరాల కాలం చిన్నచిన్న రేణువులుగా హిరణ్యం మోసుకువచ్చి గురువుగారికి ఇచ్చింది. వేదవేదాంగాలన్నీ తెలుసుకుంది. వేదసారం అంతా ఒకే మాటలో చెప్పారట





ఆయన – 'సోహం' అని చదువైపోయిందన్నాడు. చీమ ఇంటికి వెళ్ళిపోయింది. బ్రహ్మ జ్ఞానం పొందినాగానీ బ్రతుకులో ఏమి తేడా కనిపించలేదా పిపీలికానికి. కొన్నాళ్ళ తర్వాత మరొక గురువు దగ్గరకెడితే తపస్సు చెయ్యమన్నాడు. జన్మరాహిత్యం పొందమన్నాడు. చీమకి ఏమి అర్థం కాలేదు.

అలాగ గురువుల వల్ల మోసగింపబడి శ్రమ దమాదుల కోర్చిన చీమకు తానెవరో మాత్రం సరిగా అర్థం కాలేదు. నిరాశతో తన పుట్టింటికి తిరిగివచ్చిన చీమకు అక్కడ గొప్ప ఘోర దృశ్యం కనిపించింది. తమ పుట్టలోంచి లక్షలాది తన తోటి చీమలు చెల్లా చెదిరి పారిపోయి వచ్చేస్తున్నాయి. ఏదో ఆపద సంభవించింది. 'ఏమైంది? ఏమి ఆపద సంభవించింది?' అని ఆతృతగా అడిగి తెలుసుకుంది. తమ భూగృహంలోకి, చాలా భయంకరంగానూ, ఎంతో పొడవుగా బలంగా ఉన్న త్రాచుపాము ప్రవేశించి తన వాళ్ళందరినీ తరిమేసిందట!

మన చీమ ఒక్క క్షణం ఆగింది. చీమలు పెట్టిన పుట్టలు పాములకిరవైనయట్లు... అవును. ఇంత కాలం అదే జరుగుతోంది. కాని, ఇంకానా! ఇకపై సాగడానికి వీల్లేదని నిశ్చయించుకుంది. తాను ఇన్ని సంవత్సరాలూ కష్టపడి చదివిన చదువంతా ఉపయోగించి, తన వారందరినీ ఒకచోట చేర్చి, తాను ఒంటరిగా పుట్టలోకి వెళ్ళి పాముతో వాగ్యుద్ధానికి దిగింది. ఇది అక్రమం, అన్యాయం అని అరిచింది. పాము ఆ చిరుచీమని చూసి తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టింది. నువ్వీలోకంలో తుచ్ఛ మైన కష్టజీవివి. నీ బతుకింతే! కష్టాలు పడటమే. మేము సుఖభోగులం. మేము సుఖపడాలి. అది మాహక్కు. కాదంటే చంపేస్తాం. ఇక్కడనుంచి పొమ్మంది. చీమ నివ్వెరపోయింది. తనకు విద్యనేర్పిన గురువులందరూ నువ్వు చిరుప్రాణివనీ, చీమ పేరుగల దానివనీ, దేవభాషలో పిపీలికానివనీ, అదనీ ఇదనీ అన్నారుగాని–'నువ్వు కష్టజీవివి' అని ఎవ్వరూ చెప్పలేదు. అప్పుడు చీమ తన కర్తవ్యాన్ని ఆలోచించింది. ఆలోచించగా జ్ఞానోదయం కలిగింది. బయటకు వచ్చింది. తనసోదరులందరికీ హితబోధ చేసింది. వారందర్నీ వీరులుగా మార్చి, తమ లక్షలాది బలగాన్ని తీసుకుని లోపలికి వెళ్ళింది. ఆచీమలన్నీ కలిసి పామును కరచికరచి, మరింత కొరికికొరికి, ఆ బలమైన, భారీ అయిన పాముని చంపేశాయి. రక్తం కక్కుకుంటూ అది చచ్చింది.

'బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చావదె సుమతీ' అన్నాడు శతకకారుడు. ఈ పద్యపాదాన్ని నిరూపించారు శాస్త్రిగారు. చీమపడినపాట్లు అన్నీ చక్కని చిక్కని వర్ణనలతో సన్నివేశాలతో అల్లి, గురువుల ధనలాలసతను ఎద్దేవా చేస్తూ, చిరు చీమపై జాలిగొలిపే విధానంలో కథను చిత్రీకరించారు రచయిత. జ్ఞానుల బోధలన్నీ నిరుపయోగమైన గాలి కబుర్లు అని చీమకు అర్థం కావడం ఇందలి విశేషం. ఆ తర్వాత నిజజీవిత సంగ్రామంలో ఎదురైన శత్రువు చెప్పిన విషయమే నిత్యసత్యమని గ్రహించింది.

ఇంతకీ చీమకి కలిగిన జ్ఞానోదయం ఏమిటి? తాను కష్టజీవట. తుచ్ఛమైన అల్పజీవట. కష్టజీవుల బతుకింతేనట. మా కష్టంపైనే వారు సుఖపడతారట. అదే భగవన్న్యాయమట! నాన్సెన్స్ యిదంతా అనుకుంది చీమ. అదే నిజమైతే – తనలాంటి కష్టజీవుల శ్రమను దోచుకుని పనీపాటూ లేకుండా హాయిగా సుఖించే సోమరిపోతుల్ని తమదగ్గరకు వెళ్ళి నేర్చుకోమని మతగ్రంథాలలో కూడా ఎందుకు చెప్పారు? 'సోమరి చీమల వద్దకు వెళ్ళుము. వాటి నడతలు కనిపెట్టి జ్ఞానము తెచ్చుకొనుము. వాటికి న్యాయాధిపతి లేకున్నను, పై విచారణ కర్త లేకున్నను, అవి వేసవి కాలమందు ఆహారము సిద్ధపరుచుకొనును. కోతకాలమందు ధాన్యము కూర్చుకొనును" (పరిశుద్ధ గ్రంథము. సామెతలు. 6.6.–8) అందుచేత ఈ పాములూ, పాములవంటి దుర్మార్గపు గురువులు చెప్పినదంతా పచ్చి అబద్ధం. ఇటువంటి పరాన్నభుక్కులకు తిరగబడి అణగదొక్కేయడమే సరైన మందు అని చీమకు జ్ఞానోదయమయింది. అదే చేసింది చీమ. ఇది 'విప్లవ విజయం' కథ.

**వేతన శర్మ కథ:**

అనగనగా ఓ కాలంలో ఒక దేశాన్ని ఒకరాజు పాలిస్తూ ఉండేవాడు. ఆరాజు పంటల్లో నూటికి పదోవంతు మాత్రం ప్రజలనుంచి పన్నుగా వసూలు చేస్తూ, దానిని ప్రజాసేవల నిమిత్తమే కాకుండా తన బంధువర్గానికి, వ్యాపారస్తులకీ అనుకూలంగా తీర్పు చేస్తూ తానుకూడా వ్యాపారం చేస్తూ సుఖ సంతోషాలతో రాజ్యం ఏలుతూ ఉండేవాడు. లాభాలు ఎక్కువ కావడానికీ, నష్టాలు భర్తీ చేయడానికీ, పన్నులు పదిశాతం నుండి పెరిగి ఇరవై శాతానికీ, కొన్నాళ్ళకు ముప్ఫై శాతానికీ అలా కొంచెం కొంచెం





పెరిగాయి. ప్రజలు భరించలేక పోయారు. మధ్య తరగతి, చిన్నతరగతుల కుటుంబాలు చితికిపోయాయి. చిన్న వ్యవసాయదార్లు చితికిపోయారు. అటువంటి సమయంలో ఒకసారి క్షామం వచ్చింది. తిండిలేక పేదలు పిట్టల్లాగా రాలిపోయారు. అన్యాయాలు అక్రమాలు ఎక్కువై పోయాయి.

ఆ రాజ్యంలో మార్కండేయ మహర్షి అనే ఋషి ఉత్తముడొకడుండేవాడు. జరుగుతున్న ఈ దౌర్జన్యం అంతా చూసి "రాజునీ అతని అనుయాయుల్ని పారద్రోలండి. మీ రాజ్యం మీరేలుకోండి' అని బోధ చేసి ప్రజల్ని ఉత్తేజ పరిచాడు. దానితో ప్రజానీకం రాజవర్గం మీద తిరుగుబాటు చేసింది. ఆ తిరుగుబాటులో ప్రభుత్వ యంత్రాంగంలో పనిచేసే కరణాలు కూడా ఉన్నారు. వారికి జీతాలు చాలా తక్కువ. అందుకోసం వారు జేరారు. మార్కండేయ మహర్షి తిరుగుబాటుకు రాజు కోపించి, అతన్ని ఏదో అబద్ధపు నేరారోపణ చేసి, చిత్రహింసలు పెట్టి చంపించాడు. రాజు సైనికులు తిరుగుబాటుదార్ల కుటుంబాలను హింసించడం ప్రారంభించారు. అప్పుడు ఆ కరణాలలోని ఒక తెలివిగల వాడు కరణాలందర్నీ కూడదీసి "మనం ప్రభుత్వంలోనే ఉన్నాంగదా. మనకి రాజుతో తగువు మంచిది కాదు. మనకు కావాల్సింది జీతాలు ఎక్కువ చెయ్యడం. కనుక రాజుతో సంప్రదించి జీతాలు పెంచమందాం. మిగతా విషయాలతో మనకు సంబంధం లేదుకదా" అని వారందర్నీ ఒప్పించి రాజుగారితో మంతనాలు జరిపి జీతాలు పెరిగేలాగా చేశాడు. వారు సమ్మెలోంచి తప్పుకున్నారు. ఆ విధంగా తిరుగుబాటు పూర్తిగా దెబ్బతినేసింది.

మార్కండేయ మహర్షి లేవదీసిన విప్లవం 'వేతన శర్మ పొడిచిన వెన్నుపోటుకి చాలా మట్టుకు గాయపడింది. మిగతాది అలసట తీర్చుకుని మరునాడెపుడో చిచ్చుగా మారడానికి వీలుగా అడవుల్లో తలదాచుకుంది" అని ముగించారు శాస్త్రిగారు. కథకు కింద చుక్కలు కూడా పెట్టారు. కాని కింద మరొక పేరాలో తన కామెంట్ కూడా పెట్టారు. కానీ – ఆ కింద మరొక పేరాలో తన కామెంట్ రాశారు. వేతన శర్మలే కార్మిక నాయకులుగా కూడా రూపొందడంతో ప్రభువులంతా ధన కనక వస్తు వాహనాలతో తుల తూగుతున్నారనీ, ఎక్కువ జీతాల కోసం సమ్మెలే తప్ప, సమసమాజం కోసం విప్లవాలు వద్దంటారు ప్రభువులు, అవునంటారు ప్రభుత్వోద్యోగులు అని పూర్తి చేశారు. విప్లవం ..... అడవుల్లో తలదాచుకుంది అనడం దగ్గర కథ పూర్తి అయి, రచయిత

అభిప్రాయం తెలుస్తోంది. చివరలో కార్మిక నాయకుల మీద కామెంట్ అతికినట్టుగా వేళ్ళాడుతూ మిగిలిపోయింది.

చీమ కథలో చీమలు ఐక్యతతో ప్రబల శత్రువును పూర్తిగా ఓడించాయి. ఇది 'విప్లవ విజయం' కథ. వేతన శర్మ కథలో విప్లవకారుల అనైక్యత వల్ల విప్లవం పూర్తిగా నశించిపోయింది. ఇది 'విప్లవ విఫలం' కథ.

క్రిమికీటకాలలోనూ, జంతువులలోనూ ఉన్న ఐక్యత, సంఘీభావం, కారుణ్యం మనుష్యులలో లేదు. ఒక కాకి చచ్చిపోయినా, దెబ్బతిని పడివున్న, దానిచుట్టు చాలా కాకులు చేరి అక్కడ ఉన్న మనుష్యుల్ని కూడా నెత్తిమీద పొడిచి పరిగెత్తిస్తాయి. ఒక కుక్క గట్టిగా అరిస్తే దాని దగ్గరకు చాలా కుక్కలు అరుచుకుంటూ పరుగుపరుగున వచ్చి, సహాయంగా నిలిచి అరుస్తాయి. కాని, ఒక మనిషి దెబ్బతిని రోడ్డు మీద నిస్సాహయకంగా రక్తపు మడుగులో పడివున్నా.....





## రావిశాస్త్రి కొన్ని కథలు – విశ్లేషణ

:డా. కమలాదేవి

సాహిత్య ప్రక్రియలో కథారచన ఎంత క్లిష్టమైనదో అంతటి ఆకర్షణీయమైనది. చిన్నకథకి సాహిత్యంలో పెద్దపీఠం వేయతగినంత ప్రాముఖ్యత ఉందనటంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు.

కథకు వయసు ఆరువేల సంవత్సరాలు. నోటిమాటలలో ఆరంభమైన కథలు, గాథలు అచ్చులో రెండువందల ఏళ్ళ క్రితం వచనరూపంలో వచ్చాయి. సాహిత్యంలో ఆధునిక కథకి గల ప్రాముఖ్యత ఎటువంటిదంటే ప్రపంచం మొత్తం మీద ఒక నెలలోనే లక్షలదాకా కొత్తకథలు వస్తూ ఉంటాయి. అన్ని దేశాల్లోనూ, భాషల్లోనూ కథలకు చాలా ప్రాముఖ్యత ఉంది.

వంద సంవత్సరాల క్రితం గురజాడవారు తెలుగుకథకి శ్రీకారం చుట్టారు. ఆ తరువాత తెలుగుకథ మకుటంలేని మహారాజు లాగా సాహితీరాజ్యాన్ని ఏలింది. అంతర్జాతీయ సాహిత్యంలో తెలుగు కథకి పాలగుమ్మివారి వల్ల ప్రత్యేక స్థానం లభించింది.

'A short story is a story that can be easily read at single sitting. సంక్షిప్తత, సమగ్రత, ఏకాగ్రత, నిర్భరత కథా లక్షణాలుగా చెప్పబడ్డాయి. సంక్షిప్తత అందరికీ తెలిసిందే. పాత్రల విశిష్ట లక్షణాలు వివరించినపుడు రచయితకు దృష్టి చెదరని ఏకాగ్రత అవసరం. సంక్షిప్తత వలన ఎటువంటి లోపాలు రాకుండా ఉండటానికి సమగ్రతా లక్షణం చెప్పబడింది. కథ స్వయం సంపూర్ణం. నాతి విస్తృతం. నాతి క్లుప్తం. ఇక నిర్భరత అంటే రస నిర్భరత. కథ చదివిన తర్వాత ఆ కథాపురుషులను గూర్చి భావుకుడు యోచించేటట్లు చేయటమే నిర్భరత.

కథల్ని మూడు విధాలుగా విభజించచ్చు. కథాబీజం. పాత్రబీజం. ధర్మం లేదా ప్రకృతి బీజం. కథాబీజంలో రచయిత ప్రప్రథమంగా ఒక కథను తీసుకుని దానికనుగుణంగా పాత్రలను నిర్మించుకుంటాడు. పాత్ర బీజంలో పాత్రలకే ప్రాధాన్యం. విశిష్ట లక్షణ లక్ష్యమైన ఒక పాత్రను మనసులో పెట్టుకుని దానికనుగుణంగా రచయిత

కథను నడుపుతాడు. మూడవదానిలో జీవితానికి సంబంధించిన ధర్మాన్ని కానీ, మనోజ్ఞమైన ప్రకృతి దృశ్యాన్ని కానీ చిత్రించటానికి రచయిత యత్నిస్తాడు. తదననుగుణంగా పాత్రలను, సన్నివేశాల్ని సృజించుకుంటాడు.

"There are so far as i know three ways only for writing a story. You may take a plot and characters to it. You may take a character and choose incidents and situations to develop it. You may take a certain atmosphere and set actions and persons to realise it'' - Steavenson. పాత్రలు గావించే కార్యకలాపాల్ని వివరించటమే కథ అనబడుతుంది. పాత్రలు లేని కథకాని, కథలేని పాత్రలుగాని ఉండటం అసంభవం. కథాప్రతిపాదితమగు ధర్మానికి పాత్రల చేష్టలే కదా ఆధారం. కథాగతిని అనుసరించే ప్రకృతి దృశ్యాలు కూడా వర్ణింపబడతాయి.

రచయిత లాక్షణికులు చెప్పిన లక్షణాలను దృష్టిలో పెట్టుకుని రచన చేయడు. కాని రచయిత కథలలో ఈ లక్షణాలు ఎంతవరకు వర్తిస్తాయో విమర్శకుడు పరిశీలిస్తాడు. రాచకొండవారి రచనా సాగరం నుండి ఐదు, ఆరు కథల్ని తీసుకుని విశ్లేషించదలచుకున్నాను. మా మాటగా చెప్పబడిన "వారు రాసిన ఇతివృత్తానికి ఉపయోగించుకున్న భాష వేరుకావచ్చు. దాని వ్యక్తీకరణకు ప్రాంతీయతే ఉండవచ్చు. రచనలోని స్థల సన్నివేశాలకు ప్రాంతీయ సంస్కృతి అనుల్లంఘనీయం కావచ్చు. పాత్రల బహిరంగరూపం, అంతరంగ వివరణల మీద ప్రాంతీయతా ముద్ర అత్యంత సహజము, అత్యంత అవసరము కావచ్చు. వారు ఎత్తుకున్న సమస్యలు ఒక కాలానికి, ఒక సమాజానికి మాత్రమే వారు అభిప్రాయపడిన పరిష్కారాలకు తత్కాలీనత, తత్క్షణత, తత్కాలీన తాత్వికత రాజకీయతలు ఉండే అవకాశం మెండుగా ఉండవచ్చు" అనే అంశాలు చాలావరకు నిజం.

శాస్త్రిగారి కథలన్నీ 1972 కి ముందువే. 72 తర్వాత నవలలు రాశారు. ఆ కాలంలోనే వ్యాసాలు, ఉపన్యాసాలు తొంభై శాతం రాశారు. నేను తీసుకున్న కథలలో మొదటికథ *కష్టార్జితం.* తొలిప్రచురణ 1950. విశ్వవీణలోది. *ఆరు చిత్రాలు* పుస్తకరూపంలోది. ఈ కథలో పాత్రలు ఎక్కువగా లేవు. ఇందులో ప్రధాన పాత్ర 'ముసలాయన' కష్టార్జితం వ్యంగ్యంగా పెట్టిన పేరు. "కడుపు కక్కుర్తి వల్ల కష్టపడి





కొడుకు పెళ్ళికి 10వేలు కట్నం లాగాడు. కడుపు కక్కుర్తి వల్లే కష్టపడి, చెమటోడ్చి నిన్ను పీడించి, పీడించి లంచాలు గుంజేడు " – ఇదీ కష్టార్జితం. ఆ పేరు వినగానే మనకి అన్పిస్తుంది. నిజంగా ఎన్ని కష్టాలు పడి సంపాదించాడోనని. ఇది సంఘంలో, సమాజంలో ఆనాడేకాదు ఈనాడు కూడా సాగుతున్న లంచగొండితనాన్ని సూచిస్తోంది. దోపిడి విషయమై పోలీసు రిపోర్టు ఇవ్వనందుకు చెప్పిన కారణం కూడా ఆనాటికే కాదు ఈనాటికీ వర్తిస్తుంది. "గెద్దలన్నీ చేరి పిచ్చుకల మీద ఆరోపణలు, వాటి గురించి వివరణలు, ఆ పైన శిక్షలునూ. దేశం ప్రభుత్వం పాలన అలా ఉన్నాయి బాబు." – ఈ మాట ఎంత సత్యం. ఎంతో జీవితానుభవంతో చెప్పిన మాట.

ఇందులో రచయిత చెప్పదలుచుకున్న దేమిటి? సమాజం ఎలా ఉంటుందో, మనుషుల ప్రవర్తనలు, ప్రవృత్తులు ఎలా ఉంటాయో చక్కగా తెలిపారు. ఇది ఆనాటికే కాదు. సార్వకాలిక సత్యాన్ని చాటారు. ఒకే ఒక్క పాత్రతో చెప్పదలుచుకున్న అంశాన్ని చాలా చక్కగా చెప్పారు రచయిత. అదే శాస్త్రిగారి ప్రత్యేకత.

చీకట్లో కూడా బాగోలేరు అని చెప్పటానికి "చీకటి ముఖాలవాళ్లు – కొత్తప్రయోగం. భాషా విషయమై కష్టేఫలే, పిండికొద్ది రొట్టె– ఇలాంటి జాతీయాలు, సామెతలు కూడా కనిపిస్తాయి. శైలిసౌలభ్యం ఉన్న రచన.

*'కార్నర్ సీటు'* రచనాకాలం 1953. కలం పేరు కాంతాకాంత. పుస్తకరూపం *మరో ఆరుచిత్రాలు.* ఈ కథలో పాత్రను తీసుకుని సన్నివేశాలు కల్పించుకున్నారు. జీవితంలో ఎన్నో అనుకోని సంఘటనలు జరుగుతూంటాయి. అప్పటి వరకు మనకంటి ముందు కనిపించిన వ్యక్తి మరుక్షణంలో శవమై తేలటం ఎంత భయంకరమైన సంఘటన. అంతవరకు తన ఎదుట కార్నర్ సీటులో కూర్చొన్నవాడు కొద్దిక్షణాల్లో రైలుపట్టాల పై మొండెమై తేలటం రాజుకి జీర్ణించుకోలేని విషయం. ఈ సంఘటన తర్వాత ఆ కార్నర్ సీటు కావాలనుకున్న వ్యక్తులు కూడా ఆ సీటులో కూర్చోటానికి సంశయిస్తారు. అదే మానవ ప్రకృతి. ఈ కథ వలన సామాజిక ప్రయోజన మేమిటి? అని ఆలోచిస్తే మానవ ప్రవృత్తిని అద్దం పట్టి చూపించటమే రచయిత ఉద్దేశ్యం . ఇది సార్వకాలికం. ఒక కాలానికి, ఒక సమాజానికి, ఒక జాతికి మాత్రమే సంబంధించింది కాదు. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ మానవనైజం అలానే ఉంది. సందర్భానుసారంగా ఈ కథలో ప్రకృతి

వర్ణనలు కూడా చోటు చేసుకున్నాయి.

*'గుంటూరు'* కథలో మానవ సహజమైన ప్రాంతీయాభిమానం కనిపిస్తుంది. రచనా కాలం 1953. పుస్తకరూపం. ఒక *మంచివాడికథ.* ఇందులోని ప్రధానపాత్ర అప్పల నరసన్న. విశాఖపట్నంలోని చాలామంది పేర్లు అప్పల నరసన్నలు, నరసమ్మలు, సింహాద్రి, అప్పలమ్మ – ఇలా ఉంటాయి. అప్పల నరసన్న విజయనగరంలో పుట్టాడు. విశాఖపట్నంలో పెరిగాడు. కాని అతని గుంటూరు చదువ గొప్ప ముప్పు తెచ్చిపెట్టింది. ఈ ప్రాంతీయాభిమానం ఎటువంటిదంటే కొంచెం విపరీతమైందే. వెర్రితలలు వేసిందనే చెప్పవచ్చు. అతనికి గుంటూరంటే ఇష్టంలేదు. అన్ని విషయాల్లో చాలామంచివాడే కాని గుంటూరు వాళ్లంటే విపరీతమైన ద్వేషం. గుంటూరులో విశాఖపట్నం వాళ్లని ఏరిఏరి వాళ్లతో స్నేహం చేశాడు. వాళ్ళందరు అతనికంటె పెద్దవాళ్ళే . గుంటూరంటే ఇష్టంలేని వాళ్ళంటే మన నరసన్నకి చాలా ఇష్టం. గుంటూరు జిల్లాకి మంచి కలగడం ఏమాత్రం ఇతనికి ఇష్టం ఉండేది కాదు. వడదెబ్బల వల్ల గుంటూరులో మనుషులు చనిపోయారని, గుంటూరులో మంచినీటి ఎద్దడి – ఇలాంటి వార్తలు చదువుతూంటే అతనికి పట్టరాని అనందం కలిగేది. ఇది ఎంతటి విపరీతమైన మనస్తత్వమో కదా! నరసన్నది అదొక రకం జబ్బు అని అతని కి తెలీదు. చివరికి అతని భార్య తండ్రి – (అంటే మావగారు – రచయిత ఈ పదం వాడలేదు) గుంటూరు జిల్లాలో పనిచేసాడని, గుంటూరు అతని భార్య జన్మస్థలమని తెలిసాక అంతవరకు ఎంతో అభిమానంతో చూసుకుంటున్న భార్యను పుట్టింట్లో వదిలివస్తాడు. రచయితకి ఇలాంటి వ్యక్తులు తారసపడి ఉంటారు. 'ఇది ఒక కథ నిజం కానేకాదు' అని నొక్కి చెప్పటంలో – ప్రాంతీయాభిమానం అందరికీ ఉంటుంది. ఉండచ్చు. ఉండాలి కూడా. కాని ఇంతటి వెర్రితలలు వేసే ప్రాంతీయాభిమానం, ఇలాంటి మనస్తత్వం ఉండకూడదు అనే సందేశం కనిపిస్తుంది.

*'స్టేషను దగ్గర'* – కథ రచనాకాలం 1953. అముద్రితం, అసంపూర్ణం. ఇందులోని ప్రధాన పాత్ర కామయ్య. భార్య కమలమ్మ. ఈమె భర్త ప్రవర్తనతో విసిగి వేసారి పోయింది. గాభరా, గాభరా, మనిషికి ఊరంతా గాభరా. దిక్కుమాలిన గాభరా. గాభరాతో కేకలు, కోపం, కోపం వల్ల తగువులు, కయ్యానికి కాలు దువ్వడానికి ఫస్టు. కయ్యం. కయ్యం. ఎక్కడికెళ్లి నా కయ్యం జట్కావాళ్లు, రిక్షావాళ్లు, పాలవాళ్లు అందరిమీద





కేకలు వెయ్యడం. అందరివల్లా మాటలు పడటం. 'రోడ్డు పక్క వెలిగే విద్యుద్దీపాన్ని చెట్టుకొమ్మ వచ్చి తాకుతోంది. గాలికి మళ్లీ వెనక్కి పోతుంది. కామయ్య మీద, జట్కావాడి మీద ఆకుల నీడలు ఆటలాడుతున్నాయి." ఇలాంటి వర్ణనలు కనిపిస్తాయి. ఒల్లక, బోలెడు లాంటి పాత్రోచితమైన భాషాప్రయోగం, పరిశీలనా పటిమ కనిపిస్తాయి.

*పువ్వులు* – ప్రచురణ కాలం 1954. *మరో ఆరు చిత్రాలలో*నిది. ఇందులోని పాత్రలు అవతారం, శేషమ్మ, కమలబాల కాక మరో ఐదుగురు పిల్లలు. చివరిది విమల. నలుగురు అబ్బాయిలు. సీతారాముడు, రాధాకృష్ణుడు, పార్వతీ ప్రసాదుడు, నాలుగోవాడు గంగాధరుడు. ఈ నలుగురిని ఇంట్లో పిలిచే పిలుపు ఒరేయ్‌సీతా, ఒరేయ్ రాధా ఏవర్రా గంగా, పార్వతి. ఇంటియజమాని వ్యాపార రీత్యా కలకత్తాలో ఉంటూ ప్రతివేసవికి సొంత ఊరుకి వచ్చి నెలరోజులు కాలం గడుపుతూంటాడు. కమల బాలకి పువ్వులంటే చాలా ఇష్టం. సున్నిత మనస్కురాలు. తల్లి కొత్తిమీర, కాకరపాదు, దొండబద్ద లాంటి మొక్కలు వేస్తుంది. ఎరువు కుప్ప దగ్గర వచ్చిన బంతి మొక్కలను చూసి పరమానంద పడిపోతుంది. ఈ ఆరుగురు కలిసి వాటిని వరుసల్లో పాతడం, గోతులు తవ్వడం, నీళ్ళు పోయడం లాంటివి చేస్తారు. సాయంకాలానికి ఆ మొక్కలు వాడిపోవడం చూసి చాలా బెంగపెట్టుకుంటుంది. కాని రాత్రి వాన పడి అవి చక్కగా నిలబడటం, పెరగడం, పూలు పూయడం జరుగుతాయి. వాళ్ళంతా ఎంతో అపురూపంగా చూసుకుంటున్న ఈ చింతపూలను సెలవలకి వచ్చిన ఇంటి యజమానురాలి చివరి అమ్మాయి బలవంతంగా పూలను కోసేయటం ఎవరూ సహించలేకపోతారు. ఈ చర్యకు తట్టుకోలేకపోతారు. చివరికి ఏమి చేయలేక కళ్ళనీరు పెట్టుకుంటుంది మన కథానాయకురాలు కమలబాల. ఈ కథలో ఈ కమలే ఆ మొక్క అయింది. ఈ మొక్కయింది. రాత్రి నీటిమబ్బు ఈ కమలే. నిన్న రాత్రి వానచుక్క ఈ కమలే. సూర్యరశ్మిలా మెరుస్తుంది. చల్లగాలిలా వీస్తోంది.' – వర్ణన చాలా అద్భుతం. ఈ కథ ద్వారా అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ల – కుటుంబసభ్యుల అన్యోన్యత, సహాయసహకారాలు, ఇల్లు గల యజమానుల డాబు, దర్పం, అజమాయిషీ, అద్దెకున్న వాళ్ళ నిస్సహాయత తెలిపారు రచయిత. ఇవన్నీ ప్రత్యక్ష సత్యాలే. సహజసిద్ధాలే. సమాజంలో అడుగడుగునా కనిపించేవే.

*వర్షం* – రచనాకాలం 1959. పుస్తకరూపం *కలకంఠి.* సంకలనం – కథ–

*నూటపదహార్లు.* ఈకథలో పాత్ర పురుషోత్తం. కలకత్తా వెళ్తూ దారిలో అడవిపాలెంలో పెళ్లి కూతుర్ని చూసి అక్కడ వర్షంలో చిక్కుకుపోతాడు. పాకలో ఉండే తాత మనవళ్లచే ఒరసం శానాదూరం... లాంటి పదాలకి వారి జాతికి తగ్గ భాష మాట్లాడించడంలో సహజతను కనబరిచారు రచయిత. 'కత్తుల్లా మెరుపులు మెరుస్తున్నాయి. కొండలు బద్దలయినట్లు ఉరుములు ఉరుముతున్నాయి. శివాలెత్తి గాలి పరుగెడుతోంది. పగబట్టినట్టుగా వర్షం తెగపడుతోంది. దూరాన సూర్యుడు ఆకాశంలో అవతల గుమ్మం దగ్గర నిల్చున్నాడు. అంతలో గది తలుపులన్నీ గప్పున తెరిచి ఆకాశమంతటా కుంకాన్నెవరో కుమ్మరించారు. వర్ణనలు అద్భుతం. రోడ్డు పక్క అధికారిలా నిల్చున్న చింతచెట్టు ఈదురుగాలికి తల విసిరి అకాశాన్ని ఎదిరిస్తోంది. చెట్టుకింద కమ్మలపాక చలిగాలికి ముసలమ్మ వణికినట్లు వణుకుతుంది." – ఇలాంటి వర్ణనలు చూస్తుంటే రచయిత నిశిత పరిశీలనా దృష్టి తెలుస్తుంది. మొత్తం కథంతా చదివిన తరువాత మనకు అర్థమయ్యేదేమిటంటే పెళ్లికూతురు చూపుల ద్వారా అతడు వయసుకి తగ్గట్టు ఎదగలేదని, బలహీనంగా ఉంటాడని అనిపిస్తుంది. ఎవరు ఏంచెప్పినా వినే రకమని పురుషోత్తం స్వభావాన్ని కూడా చక్కగా వివరించారు. పాకలోని తాత కూడా ఇతణ్ణి చూసి ముద్దపప్పు అనుకుంటాడు. కాని చివరకు వర్షాన్ని లెక్కచేయకుండా తెరల్ని ఛేదించుకుంటూ చకచకా ముందుకు వెళ్తున్న పురుషోత్తాన్ని చూసి 'సెబాసో' అని మెచ్చుకుంటాడు. ఇదీ కథ. ఈ కథలో సహజ వర్ణనలు పరిశీలనా పటిమ, విషయాన్ని సూటిగా చెప్పకుండా అర్థమయ్యేటట్లు చెప్పడం, చెప్పకుండానే చెప్పటం లాంటివి ఉన్నాయి.

మనకు సాధారణంగా కనిపించే విషయాలను తీసుకుని అద్భుతమైన కథలుగా మలిచిన రావిశాస్త్రిగారి ప్రతిభ అనన్య సామాన్యమైనది.





## రావిశాస్త్రి రచనా వైశిష్ట్యం

:వెంపరాల వెంకట లక్ష్మీ శ్రీనివాస మూర్తి

'రచయిత మానవజాతి సంపద' అన్నది అందరికీ తెలిసిన నానుడి. ఒక్కో కథకుడు తను తీసుకున్న కథా వస్తువును బట్టి, దాని పరిధిని బట్టి కథాగమనాన్ని కొనసాగిస్తాడు. దీంట్లో ఒక్కొక్క రచయితది ఒక్కొక్క శైలి. అగ్గిపుల్ల, కుక్కపిల్ల, సబ్బుబిల్ల... కాదేదీ కథ(కవిత) కనర్హం. కథలో రసానుభూతి పొందడమన్నది కథ చదివే ఆ పాఠకుడిపైన ఆధారపడి ఉంటుంది. ఏ తరం పాఠకుడినైనా ఆకట్టుకునేలా కథ రాయడం ఒక ఎత్తు. అయితే కథా రసం ఏదైనా మనసుకి హత్తుకునేలా కథ చెప్పడం ఓ విశిష్టత. అటువంటి విశిష్ట కథలు ఎన్నిటినో రచించి, కథా సాహితీ జగత్తులో చిరంజీవిగా, తాడిత, పీడిత ప్రజా జనరంజకుడిగా మన్ననలందుకున్న మహా రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు.

'మహాసాగరం ముందు నిలబడి చూస్తున్నప్పుడు ఆ సాగర తీరం అంచులు కనపడతాయని ఆశిస్తాం కానీ అది ఎన్నటికీ సాధ్యం కాదు. మధ్యలో అలలు ముందుకొస్తాయి, మరుక్షణం మాయమవుతాయి. అలలు ముందుకొచ్చినప్పుడు తెలియని ఆనందం, ఓ రసానుభూతి మనకు కలుగుతాయి. అలాంటి ఆనందం, రసానుభూతి మనకు రావిశాస్త్రిగారి కథలు చదువుతున్నప్పుడు కలుగుతాయి. ఆ సాగరంలో ఇసుక రేణువులు మనం అయితే, మహాసముద్రం రావిశాస్త్రిగారు. ఆ సాగరంలో తవ్వినకొద్దీ ముత్యాలు వస్తూనే ఉంటాయి. ఆ తీసుకునే శక్తి మనలో ఉండాలంతే'.

ఆయన కథా సాగరాన్ని ఓ సారి చూస్తే నాకు అర్థమయిందేమిటంటే... కథ ఎప్పుడు రాసినా అంటే తొలికథలు, మలికథలు, మధ్య కథలు ఏదైనా వారి కథల్లోని వాడి, వేడి ఒకటే. సాధారణంగా ఒక రచయితకి రాస్తున్నకొద్ది పరిణతి పెరుగుతుంటుంది. అది సహజం. కానీ రావిశాస్త్రిగారికి రాత మొదలెట్టిన దగ్గరనుంచి ఆ విషయ పరిజ్ఞానం అలవడింది. వయసుతో సంబంధం లేకుండా మొదటి కథ నుంచి ఏ కథ చూసినా ఒక రకమైన ఆవేదన, సామాజిక పరిశీలన కనబడుతుంది.

వారికి బాగా పేరు తీసుకువచ్చిన కథల సంపుటాల్లో *ఆరుసారా కథలు* సంపుటం ఒకటి. ఇందులో కథ ఏదైనా, కథావస్తువు ఏదైనా ముందు చెప్పినట్టు ఆ కథల్లో అణగారిన సమాజపు ఆక్రందన, అసహాయుల ఆర్తనాదం, మహిళలపై తెలియని ఓసానుభూతి, పేదరికపు లోతులు, ఖాకీల క్రౌర్యం ... మొదలైనవి సహజంగా కనిపించే అంశాలు.

శాస్త్రిగారి కథల్లో వర్ణన ఎక్కువనే ఒక విమర్శ ఉంది. దీనికి ముందే చెప్పినట్టు ఒక్కో రచయితది ఒక్కొక్క శైలి. విషయం ఏదైనా దాన్ని చెప్పేటప్పుడు ఒక్కొక్కరు అనుసరించే పద్ధతి ఒక్కొక్క విధంగా ఉంటుందన్నది అక్షర సత్యం. కథా వస్తువు చిన్నదైనప్పుడు, ఆ విషయాన్ని చెప్పే మెళుకువలో చుట్టూ వున్న పరిస్థితిని, అక్కడి సన్నివేశాల్ని కళ్ళకు కట్టినట్టు చెప్పడం ఓ ప్రత్యేకం. అది అందరికీ సాధ్యం కాదు. అలా తీసుకున్నప్పుడు శాస్త్రిగారికి తిరుగులేదు.

ఇదిలా ఉంచితే... ఆయన రాసిన సంభాషణలు కానీ ఆయన ఊహించిన సందర్భాల్లోని భావనా వర్ణనలు కానీ నాటికీ, నేటికీ, ఏనాటికీ మరొకరికి స్ఫురిస్తే అది బహు సంభ్రమాశ్చర్యమే.

*న్యాయం* కథలో చూస్తే– బోనులో నిలబడ్డ వేశ్య పరిస్థితి నుద్దేశించి “మూడవ తరగతి రైలు గదిలో ఓ మూల నలిగిపడి వాడిపోయిన పువ్వుల దండలా వుందామె.” అదీ ఉపమానం. ఆ పోలిక నెవరైనా కాదనే సాహసం చేయగలరా? పడుతున్న మానసిక వేదన బయటికి చెప్పలేక లోలోపల నలిగిపోతూ మోము చాటున రోదించే వేశ్య అంతరంగాన్ని అంతలా కాచి వడబోసినట్టు వర్ణించడం శాస్త్రిగారికే చెల్లింది.

దేశంలో అవినీతి, లంచగొండితనం ఈనాటివి కావు. స్వాతంత్ర్యం వచ్చిన రోజునుంచి అది ఏదో ఒక దశలో, ఏదో ఒక రూపంలో వేళ్ళూనుకుని ఉందన్నది ఆయన తొలితరం కథల్లో అంటే 1950లో ప్రచురించబడిన *‘కష్టార్జితం’* కథని చూస్తే మనకి అర్థమవుతుంది. ఎక్కడా అవినీతి అనే విషయాన్ని బయటకు చెప్పకుండా సుతిమెత్తగా చురక పెట్టించే కథామేఘం ‘*కష్టార్జితం*’. ఆ కథని బాగా లోతుల్లోకి వెళ్ళి పరిశీలిస్తే ఆనాడు సమాజంలో జరుగుతున్న అరాచకాలపై ఎక్కుపెట్టిన అస్త్రం లాంటిది *‘కష్టార్జితం’* కథ.





ముక్కుతూ, మూలుగుతూ మంచాన్నెక్కే వయసొచ్చినా, కూతురు వయసున్న మగువని మనువాడే మహా ప్రబుద్ధుల వంకర బుద్ధికి ఓ ప్రశ్నార్థకం ఆ కథనాయకుడి జీవితం. సమాజంలో జరుగుతున్న చెడుని వేలెత్తి చూపడం, మంచిని వెతికి పట్టుకోవడం రచయిత లక్షణాల్లో ఒకటి. సమాజాన్ని సూటిగా ప్రశ్నించే నేర్పు, ఓర్పు రచయితకి సహజాతం కావాలి. దాన్ని పుణికిపుచ్చుకున్న వ్యక్తి మన శాస్త్రిగారు.

‘మనిషికి ఉన్నది బలం, పశువుకు తిన్నది బలం’ అంటారు. అలా సంపద ఉన్నప్పుడు మనిషి తాలూకా డాబూ, దర్పాన్ని– అవి పోయినప్పుడు డీలా పడి శుష్కించే మానవ స్వభావాన్ని ఆయన పాత్రలో చూపించారు.

నొప్పింపక, తానొప్పక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ అన్నట్టు, మనిషి అవసరానికి తగిన అబద్ధాలు ఆడి ఎలా తప్పించుకుంటారో ఆయన పక్కింటాయన పాత్రలో చూపించారు. ఇటువంటి విషయాలు రాయడానికి ఎంతో సామాజిక పరిశీలన అవసరం.

చిన్న సన్నివేశాల్లో, కొండంత అర్థాన్ని ప్రతిబింబించేలా రాయడం, కథ చదవడం పూర్తయ్యాక కూడా అది మనల్ని వెంటాడడం రచయిత నైపుణ్యానికి నిదర్శనం.

కథ ఇలా చెప్పాలి. ఇలాగే చెప్పాలి అన్న నిబంధన బహుశా లేకపోయుండొచ్చు. ఈ రోజుల్లో అనేకమంది కథకులు ఏవో ప్రయోగాలు చేస్తున్నామంటున్నారు. అది అనేక విధాలుగా కావచ్చు. అలాంటి ప్రయోగాలకి యాభైల్లోనే శాస్త్రిగారు పునాదులేశారు. దానికి ఓ మచ్చు తునకే ‘‘*అధికారి*’’ కథ.

ఈ కథా ప్రారంభంలోనే రచయిత కొత్త పుంతలకి ప్రాణం పోశారు. తన మీదున్న విమర్శలకి కూడా సుతిమెత్తగా సమాధానాన్ని చెప్పారు. కథకి వర్ణన అవసరమా? అవసరమైతే అది ఏ మోతాదులో వుండాలి? దాన్ని ఎక్కడ ఏవిధంగా ప్రయోగించాలి? ఇది చెప్పినంత, రాసినంత సులభం కాదు. ఒకవిధంగా చెప్పాలంటే కత్తి మీద సాము లాంటిది. అలాంటి సాము గారడీ విద్యలో ఆరితేరిన చేయి శాస్త్రిగారిది అనడం నిస్సందేహం. కథకి అవసరం లేని వర్ణన పాఠకుడికి పంటికింద రాయి లాంటిది. అందుకే దాన్ని ఎక్కడ, ఏవిధంగా వాడాలో తెలియడమే నైపుణ్యం. పాఠకుడు ఆశించిన చోట నిరుత్సాహ పరచకుండా కథా వర్ణన కొనసాగించడమే నేర్పు. ఆ నేర్పు శాస్త్రిగారి

సొంతం.

మరో ముఖ్యమైన విశేషం – శాస్త్రిగారికి మాత్రమే ప్రత్యేకం – ఉత్తరాంధ్ర మాండలికం. ఆ మాండలికం మీద విశేషమైన పట్టు ఆయన సొత్తు. ఆయన ప్రయోగించిన పదాలు అనేకమంది రచయితలను ఆ రోజుల్లోనే విస్తు పరిచేవని చెబుతారు. అంత పద సంపద ఆయన కథల్లో మాత్రమే దొరుకుతుంది. దీనికి కేవలం సామాజిక పరిశీలన సరిపోదు. అనేక రకాల ప్రజలతో దగ్గర సాహచర్యం కావాలి. వాళ్ళలో ఒకడు కావాలి. వాళ్ళ అంతరంగాల లోతుల్లో విహరించాలి. వాళ్ళ ఆత్మగా మారాలి. అప్పుడే అది సాధ్యపడుతుంది. అలాంటి అనుభవాల వల్లే అది శాస్త్రిగారికి పట్టుబడింది.

ఇక కథలోకెడితే– మనిషి అసహాయుడిగా మారినప్పుడు నిజ జీవితంలో అద్భుతాలు జరగవు. సినిమాల్లో లాగా ఏ హీరో వచ్చి మనల్ని కాపాడడు. ఇది వాస్తవం. జరిగేదదే.

కానీ మన రంగుల, ఊహల ప్రపంచంలో ఏదో జరిగినట్టు కలలు కంటాం. అది కల్పన. కల్పనకి, వాస్తవానికి మధ్య సన్నని గీతే కథ. ఆ గీతలో మనకి వాస్తవాన్ని విడమర్చి చెప్పిన ఓ కథా ముత్యమే ఈ *'అధికారి'* కథ. ఇది ఏనాటికీ ఓ కథా పారిజాతమే అన్నది ఎవరూ కాదనలేని సత్యం.

ఈ కథలో ఊహించని పరిస్థితిలో కథానాయకి నాగరత్నం అసహాయ పరిస్థితుల్లో ఖాకీల ఉచ్చులో పడి మోసపోతుంది. ఇక అక్కడ నుంచి వేరే గత్యంతరం లేని పరిస్థితి ఆమెది. అలాంటి సమయంలో ఆమె తనకే సొంతమని కలలు కనే కథానాయకుడి పాత్రలో నూకరాజు వేదన కళ్ళ ముందుంచారు శాస్త్రిగారు.

కథని కూడా కవితాత్మకంగా, పోయెటిక్ ఫీలింగ్‌లో రాసిన కొన్ని వాక్యాలు మనల్ని నిత్యం వెంటాడుతూనే ఉంటాయి. ఈ వాక్యాలు చూస్తే 'పుస్తెలతాడు పోనాది, పుట్టిన పిల్లలు పోనారు, ఏళ్ళు పోనాయి. ఎడ్లు పోనాయి, ఏరుకున్న గింజలు పోనాయి. కడాకి నమ్ముకున్న బూదేవత కూడా పోనాది.'

ఈ మాటల్లోని మాండలిక సౌందర్యం చూద్దాం. 'ఆ మూటేంటో తెల్దని ఓ పాలన్నావు, ఆడమని సొగ్గేసిందని మరోపాలన్నావు. మరింక మూడో పాలెటుంటుందో ఏటో మూటిప్పి సూడండ్రా'...





అతని పరిస్థితి రావిశాస్త్రి మాటల్లో చూస్తే 'అతను వెలిగించుకున్న జ్యోతులన్నీ అకస్మాత్తుగా అతని కళ్లెదుటే ఆరిపోయాయి. అతను వేసుకున్న రంగుల డేరా అతని కళ్ళెదుటే మాడి మసైపోయి మాయమైపోయింది. అతను వేసుకున్న పూలతోట అరక్షణంలో పాముల పుట్టగా మారిపోయింది. అతనికి తూర్పుదిక్కు ఎటో వెళ్ళిపోయి పడమట దిక్కు ఎదురొచ్చింది. అతని ఒళ్ళంతా జలదరించింది. అతని మనసులో తుఫాన్ రేగి చెలరేగింది.'

వీణ తీగలు మీటినట్టుండే కమ్మని పదాల్లో మనముందుంచారు. సుతిమెత్తగా, శృతిబద్ధంగా హాయిగా సాగిపోతుంది ఆస్రవంతి.

ఇది, అది అని కాదు అన్నీ ఆయన కథావస్తువులే. చీమ దగ్గర నుంచి, మనిషి వరకు ఆయన కథల్లోని పాత్రలే. ఓ సారా తాగేవాడు, సారా అమ్మేవాడు, ఓ పోలీసు, ఇన్ కాస్ పెట్రో (ఇన్‌స్పెక్టర్), ఓ జడ్జి, సమాజంలోని లాయర్లు, న్యాయం కోసం అర్రులు చాచే ఆర్తులు, అసహాయంగా ఎదురుచూపులు చూసే అభాగినులు, దగా పడ్డ అబలలు, దెబ్బ తిన్న తమ్ముళ్ళు, మేకపోతు గాంభీర్యంతో మసలే మధ్య తరగతి సగటు జీవులు, రంగులు మార్చే ఊసరవెల్లుల్లాంటి నాయకులు వాళ్ళు, వీళ్ళు అనేంటి ఒక్క మాటలో అందరూ ఆయన కథల్లోని పాత్రలే.

ఆయన రాయని వస్తువులేదు. ఆయన స్పృశించని పాత్రలు లేవు. న్యాయం కోసం, అభాగినుల ఆర్తి కోసం అన్ని కథలు రాసిన వ్యక్తి మరొకరు లేకపోయినా ఆశ్చర్యం లేదు. ఆయన కథల్ని తీసుకుని చలనచిత్రాలుగా మలిచినప్పుడే ఆయన కథకున్న ప్రాణం, విలువ మనకి తెలుస్తున్నాయి. కథకి ఉన్న లాంగివిటీ మనకి కనపడేది ఇలాంటి సందర్భంలోనే.

ఇక్కడ ఈ సందర్భంలో రెండు పద్యాలు రావిశాస్త్రి గారికి అన్వయించి చెప్పవచ్చు.

శతక పద్యము చదవని వాడున్
కుతకముతో ఆవకాయ కుడవని వాడన్
గతితప్పక రావిశాస్త్రి కథలన్
తా చదవనోడు ఆంధ్రుడు కాదోయ్...

గోంగూర వంటి పచ్చడి
గంగానది వంటి జలము
బమ్మెర పోతన పద్యము
రావిశాస్త్రి కథలను మించిన కథలు ధరణిన గలవే.





## రావిశాస్త్రిగారి మంచివాడు కథ-పరిశీలన

:యమ్. కుసుమ

మూలతో బ్రహ్మరూపాయ, మధ్యతో విష్ణురూపాయ అగ్రతో శివరూపాయ, వృక్షరాజాయతే నమః అని రావిచెట్టు గురించి అంటారు. బ్రహ్మలా పాత్రలను సృష్టించి, స్థితికారకుడైన విష్ణుమూర్తిలా ఆపాత్రను నడిపించి, లయకారకుడు శివునిలా ఆపాత్రకి ముగింపు చేస్తారు. కాబట్టి 'రావి' చెట్టులో ఉన్న ప్రాముఖ్యతే రావిశాస్త్రిగారిలో ఉందనడం ఏమాత్రమూ సందేహం లేదు అనిపిస్తుంది నాకు.

ఆయన కథలోని పాత్రలు విభిన్నంగా ఉండి సజీవంగా ఉంటాయి. కథచదవడం అయిపోయిన చాలా సేపటివరకూ కూడా మనం మరిచిపోకుండా మనతోనే ఉంటాయి ఈ పాత్రలు.

'మంచివాడు' అనే కథల సంకలనంలో 'ఆ ప్రశ్నకెవరూ జవాబు చెప్పరు' అనే కథలో... ఒక స్త్రీ పసిపాపతో ఒక ఊరిలోకి అడుగుపెడుతుంది. ఆ ఊరివారందరూ ఆమె గురించి రకరకాలుగా విమర్శిస్తూ ఉంటారు. ఆమె గత చరిత్ర తెలుసుకోవాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తారు. చివరికి విసిగిపోయి ఆమె ఒక నిప్పు లాంటి మనిషి అనే నిర్ణయానికొస్తారు. ఆమె వేషాన్ని బట్టి ఆమె ఒక విధవరాలని, పాపకి తల్లని అనుకుంటారు.ఎంతో మంది దుర్బుద్ధితో ఎన్నోరకాలుగా ఆమెకి అశ్లీలమయిన ఉత్తరాలు రాసి, వెంటాడి, కబుర్లు పంపినా కూడా, ఆమె ఎవరినీ దగ్గరకు రానీయదు.

అలా కొంతకాలం గడిచిపోయిన తరువాత ఆమె ఒకతని ఇంట్లో వంటపని చేయడానికి కుదురుతుంది. ఆ ఊళ్ళో అతనంటే ఎవరికీ సదుద్దేశం లేదు. అటువంటి వాడింట్లో పనికెందుకు చేరిందా అని అనుకుంటారు. కానీ తప్పనిసరి పరిస్థితిలో తన పిల్లని పోషించుకోవడానికి ఆ ఇంట్లో చేరిందని తెలుస్తుంది. కాలం గడుస్తూ ఉంటుంది. ఆ ఇంట తను ఈ అవకాశాన్ని పోగొట్టుకోకుండా, ఆవిడని వదలకుండా అన్నివిధాలా ఉపయోగించుకుంటాడు ఇలా కొంతకాలం గడుస్తుంది. ఒకరోజు ఈవిడ శవం చెరువులో తేలుతుంది. ఊరివారందరూ వెళ్ళి చూస్తారు. ఆమె గర్భవతి అని అందరూ గుర్తిస్తారు.

తెల్లనిగుడ్డలో చుట్టిన ఆ శవాన్ని తీసుకొచ్చి, నడిరోడ్డు మీద అతని ఇంటిముందు పడేస్తారు. అందరూ నిశ్శబ్దంగా గుంపుగా చేరి చూస్తూ ఉంటారు. ఇంతలో ఆవిడ కూతురు ఆ పసిపాప నిద్రలేచి కళ్ళు నులుముకుంటూ వచ్చి అతని పక్కన నిలబడ 'అదెవరూ అలాదార్లో బజ్జున్నారు?' అని అడుగుతుంది ఆ ప్రశ్న కెవ్వరూ జవాబివ్వలేదు. ఈ ప్రశ్న ప్రతి ఒక్కరినీ కదిలించివేస్తుంది. మరొక అమాయిక శిశువుని, ఈ భూమ్మీదకి తెచ్చి, కష్టాలు పాలు  చేయకుండా ఆవిడ వెళ్ళిపోయింది.





# బాకీ కథలు – నేటి ప్రపంచం

: డా. శిరీష ఈడ్పుగంటి

రావిశాస్త్రి కథాప్రపంచంలో ప్రస్తుతం నేను చర్చిస్తున్న కథాసంపుటి బాకీకథలు. ఇందులో పన్నెండు కథలున్నాయి. ఈ కథలలో కనిపించే నేటి ప్రపంచాన్ని విశ్లేషణాత్మకంగా పరిశీలించడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

"కథలు ఆకాశంలో పుట్టవు మనిషి జీవితంలోంచే పుడతాయి. అందుకనే రచయితలు జీవితానికి దగ్గరగా ఉండాలి. జీవితానికి దగ్గరగా ఉండగలిగినవాడే మంచి రచయితగా మిగులుతాడు అనేది రావిశాస్త్రిగారి సిద్ధాంతం. జీవితమే సాహిత్యం కావాలని నిష్కర్షగా చెప్పినవాడు గురజాడ. ఆ అభిప్రాయంతోనే రచనలు చేసినవారు రావిశాస్త్రి". (రమ. 30 జూలై 2013:  1)

తెలుగు సాహిత్యంలో కథన ప్రక్రియ మీద పట్టు ఉన్న గొప్ప రచయిత. ఈయన కథలు ఒక్కొక్కటి జీవితంలో ఒక్కొక్క కోణానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. కథలలో ఎన్ని వైవిధ్యాలు చూపించవచ్చునో అన్నీ వైవిధ్యాలు చూపించారు. కథావస్తువు, శైలి, పాత్రచిత్రణ, సన్నివేశాలు, సంఘటనలు, నేపథ్యం, భాషాప్రయోగాలు మొదలైన వాటిల్లో కొత్తదారులు ఎంచుకున్నారు. ఈయన కథలు పాఠకుడు కథలో ముందు ముందు జరగబోయే సన్నివేశాన్ని ఊహించుకునే విధంగా ఉంటాయి. సమాజంలోని వ్యక్తులు, స్వభావాలు, వారి జీవన విధానాలు, కష్టసుఖాలు, మంచిచెడులు అన్నీ ఈయన కథలలో కనిపిస్తాయి. సమాజంలోని అన్యాయాన్ని కథల రూపంలో ప్రశ్నించారు. దిగజారిపోతున్న విలువలు దానికి గల కారణాలను కథలలో చర్చించారు. జీవిత వాస్తవాలను రచనల ద్వారా మనముందుంచారు.

**బాకీకథలలో మొదటికథ *పక్కింటి అబ్బాయి***

ఈ కథలో ముఖ్యమైన పాత్ర పేరు నిరంజనరావు. ఇతనికి చిన్నప్పుడే తండ్రి మరణిస్తాడు. "నిరంజనుడు భూమ్మీద పడగానే అతనికి అమ్మా, ఆకలీ తప్ప మరేం దక్కలేదు. తన తండ్రి సర్వం నాశనం చేయకుండా ఉండినట్లయితే తన పరిస్థితి మరొకలా

బాగా మెరుగ్గా ఉండేదికదా అనే జ్ఞానం నిరంజనరావుకి ఆరేడేళ్ళనాడే కలిగింది. ఆ జ్ఞానంతోపాటు అతనికి లోకం మీద కోపం కూడా అప్పుడే కలిగింది. పరిస్థితుల్ని జయించి పై స్థాయికి వెళ్ళాలనే పట్టుదల కూడా అతనికి అప్పట్లోనే కలిగింది." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 791) అందుకుగాను కసితో ప్రయత్నించాడు. పేదరికం నుండి బయటపడటానికి డబ్బు సంపాదించాలనుకున్నాడు. దీనికి చదువును మార్గంగా ఎంచుకున్నాడు. ఈ మార్గంలో పైకి రావడానికి అవసరమైతే ఎదుటివారికి హాని తలపెట్టే మనస్తత్వం కలవాడు. అందుచే చిన్నతనంలోనే విద్యార్థిదశలో తనకంటే బాగా చదివే విద్యార్థి చావుకు కారణమయ్యాడు. ఆ విషయం ఎవరికి తెలియకుండా జాగ్రత్తపడ్డాడు. శాస్త్రిగారు కథలో ఈ సంఘటన ద్వారా నిరంజనరావు స్వభావాన్ని పాఠకులకు తెలియజేశారు. ప్రస్తుతం ఇటువంటి సంఘటనలు మనం నిత్యజీవితంలో ఎన్నో చూస్తున్నాం. మీడియా, పత్రికల ద్వారా వింటున్నాం.

రావిశాస్త్రిగారు కథలో నిరంజనరావును, అతని మాటలను వర్ణించిన తీరు అద్భుతంగా ఉంది. "వేసవికాలంలో మల్లెపువ్వుల్లా మధురంగా ఉండవు. చలికాలంలో వానచినుకుల్లో చురుక్కుమంటాయి. నిశ్చలంగా ఉన్నప్పటికి అతను ధ్యానంలో ఉన్న యోగిలా నిర్మలంగా కనిపించడు. సత్రంలో బైరాగిలా చవగ్గా కూడా కనిపించడు పుట్టలో పాములా భయంకరంగా కనిపిస్తాడు." కథలోని పాత్రలకు కొన్ని విశేషాలను జోడించి పరిచయం చేయడం రావిశాస్త్రిగారి కథలలోనే ఎక్కువగా కనిపిస్తుంది. సామాన్య విషయాన్ని విశేషణాలతో చెబుతారు. అలాగే మరొక పాత్ర గూర్చి కథలో "ఆ ఆడమనిషి పుల్లలా ఉంది. ఆమె కళ్ళు పిల్లిని చూసిన ఎలక కళ్ళల్లా లేవు! పులిని చూసిన లేడి కళ్ళల్లా వున్నాయి. ఆ లేడైనా ఆర్నెల్లనించీ ఏ ఆకూ అలమూ దొరక్క, ఉప్పునీళ్లు తాగి బతుకుతూన్న లేడన్నమాట. ఆమె ఎంతో బలహీనంగానే కాకుండా ఎంతో పొడవుగా కూడా ఉండడంచేత సాగదీసిన పేదరికంలా ఉందావిడ. ఆమె భర్త చర్మం, దంతం, ఎమిక, దగ్గు తప్ప అతన్లో ఇంకేమీ ఉన్నట్టు లేవు." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 793) వీళ్ళకు ఏడాది పిల్లవాడు. ఈ కుటుంబం నిరంజనరావు పక్కింట్లో ఉంటారు. పక్కింటి అబ్బాయి ఏడ్చినప్పుడల్లా నిరంజనరావుకి ఎంతోకోపం వచ్చేది.





తన చదువుకు ఆటంకం కలిగించే ఆ పిల్లాడి ఏడుపును భరించలేకపోయేవాడు. పిల్లాడికి ఆరోగ్యం బాగోలేదని హాస్పటల్‌కు రమ్మని పిల్లాడి తల్లి సహాయం అడుగగా కసురుకుంటాడు. ఎందుకు సహాయం చేయాలి అని అంటాడు. పక్కింటిల్లో ఏమైనా సరే పట్టించుకోని మనస్తత్వం కలవాడు. ప్రస్తుత సమాజం కూడా ఇట్లాంటి వారితోనే నిండిపోయి ఉంది. వీరికి స్వలాభం మాత్రమే కావాలి. సమాజాన్ని నిర్లక్ష్య భావంతో చూసేవాడు. మానవసంబంధాలకు విలువీయని వ్యక్తి. పరీక్షల సమయంలో తనకు ఆరోగ్యం బాగోలేకపోయిన, చివరకు తల్లికి ఆరోగ్యం బాగోలేకపోయిన ఎంతో బాధపడేవాడు. ఆరోగ్యం బాగోనందుకు కాదు. పరీక్షలు రాయలేకపోతున్నందుకు. ఉన్నత స్థాయి చేరుకోలేనేమో అని తనలో తనే మదన పడేవాడు. ఉన్నతపదవులు, డబ్బు సంపాదించడానికి చదువును మార్గంగా ఎంచుకునేవారి వలన సమాజానికి ఎటువంటి ఉపయోగం ఉండదు. నిరంజనరావు వలన కూడా అంతే. ఈ కథ ముగింపులో

"ఇదంతా జరిగి ఎన్నాళ్ళయిందండీ?

పదిహేనేళ్ళయింది సార్!

మరైతే – రంజనుడో నిరంజనుడో – అతనేం చేస్తున్నాడండీ ఇప్పుడు? వాడిప్పుడు ప్రజలపై పన్నులు విధించే ప్రభుత్వ ప్రత్యేక శాఖలో ప్రధానోద్యోగిగా ఉంటున్నాడు సార్?" (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 795) సమాజం పట్ల బాధ్యత లేని ప్రభుత్వోద్యోగులకు ప్రతీకగా ఈ కథ కనిపిస్తుంది. మానవసంబంధాలకు విలువీయని నిరంజనరావు అనుకున్నది సాధిస్తాడు. కాని ఇటువంటి వారు ఉన్నతస్థాయిలో ఉండడం వలన సమాజానికి కీడు జరుగుతుందేమో కాని మేలైతే జరగదు. ప్రస్తుతం నేటి ప్రపంచంలో నిరంజనరావు లాంటి వాళ్ళు చాలామందే ఉన్నారు.

### *వెన్నెల కథ*

ఈ కథంతా కూడా చాలా కవితాత్మకంగా ఉంటుంది. ఒక వ్యక్తి జీవితంలోని ముఖ్యమైన ఘట్టాలకు వెన్నెల వెలుగును సాక్షిగా వర్ణించారు. వెన్నెలలో ఆ వ్యక్తి పుడతాడు. అదే వెలుగులో తల్లి మరణిస్తుంది. కొంతకాలానికి తండ్రి కూడా వెన్నెలలోనే చనిపోతాడు. కట్నం సమస్యతో అతని తోబుట్టువు కూడా చనిపోతుంది అప్పుడు కూడా వెన్నెల

ఉంటుంది. తదనంతరం అతనికి పెళ్ళి జరుగుతుంది. కొడుకు పుడతాడు. భార్య అనారోగ్యంతో మరణిస్తుంది. ఇవన్నీ కూడా వెన్నెల వెలుగులోనే జరుగుతాయి. ఆ వెన్నెల వెలుగులోనే కొడుకు కార్మికుడిగా అన్యాయాన్ని ఎదురించి సమ్మె చేస్తాడు. ఈ ఘట్టాలన్నింటిలోనూ వెన్నెల కురుస్తుంటుంది. చివరకు వెన్నెల కురుస్తుండగానే పోలీసుల తుపాకులకు తన వారసుడు బలి అవుతాడు. అధర్మానికి బలి అయిన కార్మికుల ఎర్రని రక్తంతో వెన్నెల కూడా ఎర్రగా మారుతుంది.

" కన్నతల్లీ వెన్నెలా.

లోకమంతా వెన్నెలే నీపాలు పొంగిన వెన్నెలే.

కాని.

మాకు మాత్రం దానినిండా జీరలే. పేదనెత్తుటి వేడినెత్తుటి జీరలే.

దానికింద మాకుమాత్రం విషపు నల్లని చీకటే కారుచీకటే–

వెన్నెలా ఓ వెన్నెలా.

ఓహెూ మా వెన్నెలా.

అయ్యయ్యో ఓ వెన్నెలా. " (వివినమూర్తి; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 797)

***పాతదే కథ***

ఈ కథ చెప్పిన రీతి పాతదే అయిన విషయం మాత్రం కొత్తదే. కథలోని వస్తువును కొత్తగా చూపించారు. కథంతా దోపిడి వ్యవస్థకు సంబంధించినది. ఆ రోజులలోనూ ఈ రోజులలోనూ ఉన్నదీ జరుగుతున్నదీ ఇదే. కథా ప్రారంభంలో " అనగా అనగా ఒక భూకామందు. ఆ కామందుకి ఏడుగురు వ్యాపారి కొడుకులు. ఏడుగురు కొడుకులూ కలిసి ఓసారి లాభాల వేటకి వెళ్ళేరు. వెళ్ళి ఏడుగురూ ఎండు కూలీల్ని పట్టి తెచ్చేరు. తెచ్చేక వాళ్ళని ఎండలో బండరాళ్ళు తవ్వమన్నారు. మొయ్యమన్నారు." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 807)

కథ ప్రారంభం అనగా అనగా ఒక భూకామందు అని మొదలవుతుంది. పెద్దవాళ్ళు పిల్లలకు కథలు చెప్పేటప్పుడు అనగా అనగా ఒక రాజు అని చెప్పి కథ





ప్రారంభిస్తారు. రాజుకు ఏడుగురు కొడుకులు. వీరు వేటకి వెళ్ళి ఏడు చేపల్ని తెచ్చారు. వాటిని ఎండబెట్టారు ఈవిధంగా కథ చెబుతారు. ప్రస్తుతకథ ఈవిధంగానే ఉంది. అప్పట్లో రాచరిక వ్యవస్థకు ప్రతీకగా ఆ కథ చెప్పుకునేవారు. ప్రస్తుత కథలో భూకామందును భూస్వామ్య వ్యవస్థకు ప్రతీకగా, అతని వ్యాపారి కొడుకుల్ని పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రతీకగా చూపించారు. ఈ కథలో భూస్వామ్య వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థగా మారిన వైనం కనబడుతుంది.

కథలో ఏడుగురు కొడుకులు కూలీల వేటకు వెళ్ళి ఏడుగురు ఎండుకూలీలను తీసుకొచ్చి పనిచేయిస్తారు. కొన్ని రోజుల తరువాత కూలీలలో ఒకడు తిండి లేకపోవడం వలన చనిపోతాడు. ఆ విషయం తెలిసినప్పటికీ వ్యాపారి కొడుకులు కూలీలకు అన్నం పెట్టరు. దీనికి గల కారణం కూలీలకు అన్నం పెడితే వారికి పావలా నష్టం వస్తుంది. అంటే వ్యాపారి కొడుకులు పావలా నష్టాన్ని కూడా ఒప్పుకోరు. కూలీలకు కేవలం నీళ్ళు మాత్రమే ఇస్తారు. కూలీలు ఏమైపోయిన సరే వారికి నష్టం మాత్రం కలగకూడదు. ఇట్లాంటి వ్యాపారి కొడుకులు నేటి ప్రపంచంలో చాలామంది కనిపిస్తుంటారు. ఎవరేమైపోయిన సరే వారికి వచ్చే లాభాలు మాత్రం వారికి రావాలి. ఇతరుల గూర్చి ఆలోచించరు. స్వలాభమే వారికి ముఖ్యం.

కథలో మిగిలిన ఆరుగురు కూలీలు కూడా తిండిలేక మరికొంతకాలానికి మరణిస్తారు. అప్పుడు కూడా వ్యాపారి కొడుకులు మారరు. మళ్ళీ కూలీల వేటకు వెళ్ళి మరొక ఏడుగురు కూలీలను పట్టుకుని వస్తారు. వారిచేత పనిచేయిస్తారు. వారికి కూడా అన్నం పెట్టరు. నీళ్ళు మాత్రమే ఇస్తారు. అన్నం లేకపోతే ఎవరైన ఎంతకాలం బతుకుతారు. ఆ కూలీలు కూడా ఒక్కొక్కరుగా చనిపోవడం జరుగుతుంది. ఎన్నిసార్లు అయినా ఇదే పరిస్థితి ఎదురవుతుంది. చివరకు వ్యాపారి కొడుకులు తండ్రి సలహా తీసుకుంటారు. కూలీలకు కొంచెం తిండి పెట్టి వారి మొత్తం కష్టాన్ని జీవితాంతం దోచేసుకోమని తండ్రి చెబుతాడు. కొడుకులు ఆ సలహా పాటిస్తారు. వ్యాపారి కొడుకులు ఈ విధంగా చేయడం వలన వారికి సమృద్ధిగా లాభాలొస్తాయి. కూలీల కష్టాన్ని మొత్తం దోచేసుకుంటారు. ఈ కథలో పెట్టుబడిదారులు లాభాలను పొందితే కూలీలు మాత్రం కష్టాలను అనుభవిస్తారు. పెట్టుబడిదారి వ్యవస్థలో యాజమానులు కార్మికుల శ్రమను

ఏవిధంగా దోచుకుంటున్నారో ఈ కథలో స్పష్టంగా తెలుస్తుంది. ప్రస్తుత సమాజంలో కూడా ఇదే పరిస్థితి ఏమీ మారలేదు. కథలో భూస్వాములు పెట్టుబడిదారులై లాభాలు గడిస్తున్నారు కాని రైతుకూలీలు మాత్రం కూలీలగానే ఉండిపోయారు. వీళ్ళలో ఎటువంటి మార్పు లేదు. నేటి ప్రపంచంలో  కూడా ప్రస్తుతం ఇదే పరిస్థితి కనబడుతుంది.

***వేతనశర్మ కథ***

"పూర్వం ఒకానొక కాలంలో, మగధ దేశాన్ని సుందరసేనుడనే మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 843) అని కథ ప్రారంభమవుతుంది. శాస్త్రిగారి కథలన్నింటి ప్రారంభంలో ఒక విశిష్టత కనిపిస్తుంది. కథా ప్రారంభానికి ఒక ప్రత్యేకమైన శైలి వాడతారు. అది కథ చదవడానికి ఆసక్తి కలిగించే విధంగా ఉంటుంది. ఈ కథ వర్గ దృక్పథానికి చెందినది. ఈ కథలో వేతనశర్మ ప్రముఖపాత్ర వహిస్తాడు. ఇతను ఒక కరణం. ప్రజల నుండి పన్ను వసూలు చేసి రాజుకు భటుల ద్వారా అందజేస్తాడు. ఆ రోజులలో ప్రతి ఊరికి ఒక కరణం ఉండేవాడు. రాజ్యంలోని అన్ని ఊళ్ళ కరణాలంతా కలిసి పన్ను ద్వారా వచ్చిన సొమ్మును రాజుకు అందజేస్తారు. కరణాలకు నాయకుడు వేతనశర్మ. ఈ కథలో రాజుగారు రోజురోజుకి పన్ను పెంచడంతో ప్రజలు పన్ను కట్టలేక ఇబ్బంది పడుతుంటారు.  రాజ్యంలో జరిగే అన్యాయాన్ని ఎదుర్కోమని మార్కండేయ మహాముని ప్రజలకు చెబుతుంటాడు. ప్రజలను చైతన్యవంతం చేస్తుంటాడు. దీంతో ప్రజలతో బాటు కరణాలు కూడా రాజు పై తిరుగుబాటు చేస్తారు. అయితే రాజు లాంటి బలవంతుల ముందు వీళ్ళ తిరుగుబాటు విఫలమయిపోతుంది. సైనికుల చేత రాజు తిరుగుబాటు చేసిన ప్రజలందరినీ, కరణాలను చంపించేస్తుంటాడు. ప్రజలు, కరణాలు ఈ విధంగా తిరుగుబాటు చేయడానికి కారణమైన మార్కండేయ మహామునిని కూడా రాజుగారు చిత్రహింసలు పెట్టించి చంపించేస్తాడు. తదనంతరం ఈ పరిస్థితుల నుండి గట్టెక్కడానికి కరణాల నాయకుడైన వేతనశర్మ బాగా ఆలోచిస్తాడు. ఓ పగలూ, రాత్రి కూర్చొని ఆత్మవిమర్శ చేసుకుని "నేనెవర్ని" అని ప్రశ్నించుకుని "నేను కరణాన్ని " అని ఖచ్చితంగా తేల్చుకుని ఒక అభిప్రాయానికి వస్తాడు. 'ఈ దోపిడి అనేది ఉండడం వలన మనకు ఏమీ నష్టం? రాజు పై తిరుగుబాటుతో ప్రజారాజ్యం వచ్చినప్పటికి మనకేం లాభం?





రాజుగారికి అండగా ఉండడం వలన జీతాలు అయినా పెరగవచ్చు. ప్రస్తుత విపత్తు నుండి మనల్ని మనం రక్షించుకోవచ్చును' అని మిగిలిన కరణాలతో అంటాడు. వారందరూ వేతనశర్మ అభిప్రాయానికి కట్టుబడి ఉంటారు. అమాయిక ప్రజలు మాత్రం రాజభటుల చేతిలో బలైపోతారు. "మరైతే మార్కండేయుడు లేవదీసిన విప్లవం ఏమయింది? అది రాజవర్గపు కత్తులకి ఎంతమటుకు ఎరయింది? వేతనశర్మలు పొడిచిన వెన్నుపోటుకి చాలామట్టుకు గాయపడింది. మిగతాది అలసట తీర్చుకొని మరునాడెప్పుడో చిచ్చుగా మారడానికి వీలుగా అడవుల్లో తలదాచుకుంది." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 845) మార్కండేయ మహాముని ప్రజలలో కలిగించిన చైతన్యం నశించిపోతుంది.

నేటి ప్రపంచంలో వేతనశర్మలు చాలామంది కనిపిస్తుంటారు. "ప్రభుత్వోద్యోగులకి వేతనశర్మే మొట్టమొదటి పీఠాధిపతి. ఆ తరువాత వేతనశర్మలే కార్మిక నాయకులుగా కూడా రూపొందడంతో ప్రభువులంతా సకల ధన కనక వస్తు వాహనాలతో తులతూగుతూ ప్రశాంతంగా జీవించుకు వస్తున్నారు. ఎక్కువ జీతాల కోసం సమ్మెలే తప్ప, సమసమాజం కోసం విప్లవాలు వద్దంటారు ప్రభువులు, అవునంటారు ప్రభుత్వోద్యోగులు." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 845 ) ఈ కథలో శాస్త్రిగారు వేతనశర్మను  ప్రభుత్వోద్యోగులతో పోల్చి చెప్పారు. అయితే ఒక్క ప్రభుత్వోద్యోగులనే కాదు ప్రస్తుత సమాజంలో అందరూ అలానే ఉన్నారు. అది ప్రవేటు ఉద్యోగులు కావచ్చు, వ్యాపారవేత్తలు కావచ్చు రైతు కూలీలు కావచ్చు మరేవరైనా కావచ్చు. అన్ని రంగాల్లోనూ వేతనశర్మలున్నారు. పక్కవాడు ఏమైనా సరే మన పని మనకి ముఖ్యం. మనకు నష్టం లేని వాటి గూర్చి మనం పట్టించుకోనవసరం లేదనే మనస్తత్వం కలిగినవారే సమాజంలో ఎక్కువమంది ఉన్నారు. రాజకీయపార్టీలు, రాజకీయనాయకులు ఇదేరీతిలో ఉన్నారు. వారికి ప్రయోజనం ఉంటే ఏపార్టీలోనైనా ఉంటారు. లేకపోతే వెంటనే పార్టీ మారుస్తారు. అలాగే అధ్యాపకులు, విద్యార్థుల పరిస్థితి కూడా ఇంతే. అధ్యాపకులు విద్యార్థులను సొంత పనులకు వాడుకుంటారు. విద్యార్థులు ఉద్యోగాల వేటలో అధ్యాపకుల పలుకుబడుల్ని వినియోగించుకుంటారు. అయితే ఏ ప్రయోజనం ఆశించకుండా మార్కండేయ మహాముని లాంటి వాళ్ళు  కూడా సమాజంలో

ఉన్నారు. కాని వీరు చాలా కొద్దిమంది మాత్రమే. అధికసంఖ్యలో ఉన్న స్వార్థపరుల ముందు అల్పసంఖ్యలో ఉన్న నిస్వార్థపరులు కనిపించరు.

ఈ కథలో రెండు వర్గాలు కనిపిస్తున్నాయి. పీడించేవాడు (రాజు) పీడింపబడే వాళ్ళు (ప్రజలు). ఈ వర్గాల మధ్య పోరాటం కొనసాగి మధ్యలోనే ఆగిపోయింది. బలవంతుడు గెలిచాడు. ఈ కథ వర్గసమాజంలో ఉద్యోగులు ఎటు ఉంటారో వివరిస్తుంది. ఈ కథలో వేతనశర్మను ప్రభుత్వోద్యోగుల కంటే రాజకీయ వ్యక్తులతో పోల్చితే బాగుంటుంది. వేతనశర్మ మొదట్లో ప్రజల తరపున ఉంటాడు. మార్కండేయ మహాముని మాటలకు విలువనిస్తాడు. తర్వాత అతని ప్రాణాల మీదకి వచ్చినపుడు ఆలోచిస్తాడు. వెంటనే కరణాలందరినీ పిలిచి రాజు పక్షం చేరిపోతాడు. నేడు రాజకీయ నాయకులు కూడా అంతే. ఎప్పుడు ఏ పార్టీలో ఉంటారో తెలియదు. ఏదో ఒక ప్రయోజనం ఆశించి అటు ఇటు మారిపోతుంటారు. వేతనశర్మను ఉద్దేశించి సుమతీశతకంలోని ఈ పద్యం చెప్పకోవచ్చు.

నమ్మకు సుంకరి జూదరి
నమ్మకు మగసాలి వాని నటు వెలయాలిన
నమ్మకు మంగలివానిని
నమ్మకు మీ వామ వాస్తు నవనిని సుమతీ!

పన్నులు వసూలు చేసేవానిని, జూదం ఆడేవాడిని, కంసాలివానిని, వేశ్యను, వర్తకుని, ఎడమ చేతితో పనులు చేసేవాడిని నమ్మవద్దు.

***పిపీలికం కథ***

"పూర్వం కృతయుగంలో, ఒకానొక ప్రజాపతి రాజ్యం చేసే కాలంలో, గౌతమీ నదికి ఉత్తరంగా శ్యామవనం అనే అడవిలో ఓ పెద్ద మర్రిచెట్టొకటి ఉండేదిట. ఆ మర్రిచెట్టుకింద, దాని మానుని ఆనుకొని ఓ పెద్ద చీమలపుట్ట ఉండేదిట. అందులో నివసించే ఒకానొక చీమకి ఒకనాడు ఉన్నట్టుండి తనెవరో ఏమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగిందట." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 823) మాయల మంత్రాల కథలు చెప్పేటప్పుడు పిల్లలకు ఆసక్తి కలిగించడానికి ఈ విధంగా కథ ప్రారంభిస్తారు. ఈ కథంతా జానపద శైలిలో నడుస్తుంది. చీమ, పాము





వంటి జంతుపాత్రలతో ఉంటుంది. చీమను కష్టజీవిగానూ, దాని శ్రమను దోపిడి చేసే శత్రువుగా పాముని చూపిస్తారు. పాములు చీమలు పెట్టిన పుట్టలో ఉంటాయి. ఇది ప్రకృతిలో సహజంగా జరిగేది. ఈ విషయాన్ని తీసుకుని చీమలను శ్రమజీవులకు ప్రతీకగానూ, పాములను సుఖజీవులకు ప్రతీకగానూ పేర్కొన్నారు. ఇటువంటి జంతుసంబంధమైన కథలు పంచతంత్రంలో కనిపిస్తాయి.

ఈ కథలో చీమకి తనెవరో ఏంటో (నేనెవర్ని?) అని తెలుసుకోవాలనే కోరిక కలుగుతుంది. అందుకే నిగమశర్మ అనే వ్యక్తి దగ్గరకు వెళ్ళి నేనెవర్ని అని అడుగుతుంది. దానికి నిగమశర్మ చదువుకుంటే నీకు నీవెవరో తెలుస్తుందని అంటాడు. అయితే ఆ చదువు నేర్పించమని అడుగుతుంది చీమ. పేదరికంలో ఉన్న నిగమశర్మ అందుకు ఫలితంగా రోజూ ఒక గిద్దెడు నూకలు అడుగుతాడు. చీమ సరే అంటుంది. చీమ ఆ నూకలు సంపాదించడానికి ఎంతో కష్టపడుతుంది. సంపాదించిన నూకలు గురువుకు ఇచ్చి చదువు నేర్చుకుంటుంది చీమ. చదువు పూర్తయిన తరువాత నిగమశర్మ నువ్వు చీమవి అని చెబుతాడు.

కొంతకాలానికి చీమకు మరొక సందేహం వస్తుంది. 'అసలు చీమంటే ఏమిటి? అని ఆలోచనలో పడుతుంది. అప్పుడు తన గురువు నిగమశర్మ సలహా పై చతుర్వేది అనే వేదాంతి దగ్గర మళ్ళీ చదువుకుంటుంది. చతుర్వేదులవారు చీమకు శుద్ధి చేసి బ్రాహ్మణ్యం ఇప్పించి తను చేయదల్చుకున్న యజ్ఞానికి బంగారం ఫీజుగా ఇమ్మంటాడు. చాలాకాలం శ్రమించి చీమ బంగారం సంపాదించి గురువుకు ఇస్తుంది. వేదాలు నేర్చుకుంటుంది. చివరికి వేదసారం 'సోహం' అన్న ఒక్కమాటలో ఉందని అంటాడు. అయినప్పటికి తృప్తి చెందని చీమ తర్వాత ఒక మహామునిని కలుస్తుంది. ఆయన తపస్సు చేసి మోక్షం సంపాదించమని చెబుతాడు. ఏ జీవికైనా జన్మరాహిత్యం ఎందుకు? మోక్షం ఎందుకు అని అడిగితే సమాధానం రాదు.

దీంతో చీమ నిరాశతో తిరిగి తన పుట్టవద్దకు వస్తుంది. అక్కడ పుట్టలో ఒక రాక్షసాకారం ఉందని మిగిలిన చీమలు చెబుతాయి. అప్పుడు చీమ పుట్టలోకి వెళ్ళి పాముతో ఇలా అంటుంది. 'నువ్వు మా పుట్టలో ఉండుట న్యాయం కాదని' అంటుంది. ఆ మాటలు విని పాము "ఓరే పిపీలికాధమా! నేనెవరిననా అడిగేవు? నేను సుఖభోగిని;

నీపాలిట మాత్రం కాలయముణ్ణి! ఇప్పుడు తెలిసిందా నేనెవరో? తెలిసింది కద! మరి, నువ్వెవెరవో నీకు తెలుసునా? నీముఖం చూస్తే నీకింకా ఏమీ తెలియనట్టే ఉందిలే. నువ్వు ఈ లోకంలో ఒకానొక తుచ్ఛపు కష్టజీవివి. కష్టజీవులు కష్టపడాలి. సుఖభోగులు సుఖించాలి.” (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 826) అని అంటుంది. పాము మాటలలో చీమ తానొక కష్టజీవినని తెలుసుకుంటుంది. తన శత్రువు ద్వారా చీమ తానేవరో ఏంటో తెలుసుకుంటుంది. మిగిలిన చీమలందరితో కలిసి ఐకమత్యంగా పాముతో యుద్ధం చేస్తుంది. ‘ఐకమత్యమే మహాబలం అన్న మాటను చీమలన్ని కలిసి నిరూపిస్తాయి. “తత్ఫలితంగా శ్యామవనంలో మర్రిచెట్టు కింద ఆ దినం ఓ రాక్షసాకారం విలవిల తన్నుకొని నెత్తురు కక్కుకొని చచ్చిందట” (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 826) ఈ సందర్భంలో సుమతీ శతక పద్యం

> బలవంతుడ నాకేమని
> పలువురితో నిగ్రహించి పలుకుట యేలా
> బలవంతమైన సర్పము
> చలిచీమల చేత జిక్కి చావదె సుమతీ!

నేను చాలా బలవంతుడ్ని. నాకేమీ భయం లేదని నిర్లక్ష్యం చేసి విర్రవీగి విరోధం తెచ్చుకోవడం మంచిదికాదు. అది ఎప్పుడూ హాని కలగజేస్తుంది. ఎంతో బలం కలిగిన సర్పం కూడా చలిచీమలకు లోబడి చావడం లేదా?

ఈ కథలో చీమ మొదట నిగమశర్మ దగ్గర తరువాత చతుర్వేది దగ్గర చదువుకుంటుంది. నేటి ప్రపంచంలోని విద్యార్థులు మొదట ప్రాథమిక విద్య తరువాత ఉన్నతవిద్య అభ్యసించినట్లుగా చీమ కూడా చదువుకుంటుంది. హైస్కూల్, కళాశాల చదువులు ముగిసిన తరువాత పరిశోధనలు చేసినట్లుగా చీమ ఒక మహాముని దగ్గర తపస్సు చేస్తుంది. స్కూల్లో ఫీజులు కట్టినట్లుగా చీమ నూకలు, బంగారపు రేణువులు ఫీజుగా గురువులకు చెల్లిస్తుంది. చివరకు తన ప్రశ్నకు సమాధానం తన జీవితానుభవం నుంచి తెలుసుకుంటుంది. జీవితం నేర్పిన పాఠంలో తనెవరో గ్రహిస్తుంది. తోటి చీమలతో కలిసి వీరత్వంతో శత్రువును జయిస్తుంది.





ఈ కథలో కూడా శాస్త్రిగారు దోపిడి వ్యవస్థను జంతువుల మధ్య చూపిస్తారు. పాములు చీమల కష్టాన్ని దోచుకునే దోపిడిదారులు. చీమలు దోపిడికి గురైనవారు. చీమలు పెట్టిన పుట్టలలో పాములు నివశిస్తుంటాయి. ప్రకృతిలో సహజసిద్ధంగా జరిగే ఈ ప్రక్రియను తీసుకుని దీనిచుట్టూ కథ అల్లారు.

***షోకుపిల్లి కథ***

“మధ్యాహ్నం ఒంటి గంటయింది. ఊరంతట్నీ ఎండ తినేస్తోంది.” (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 847) ఈ వాక్యంతో కథ ప్రారంభమవుతుంది. ఈ వాక్యంలో ఎండ ఊరుని తినేయటమేమిటి? ఎండలు బాగా ఎక్కువగా ఉన్నాయని చెప్పడం మూమూలు విషయం అవుతుంది. దీన్నే శాస్త్రిగారు ఊరంతట్నీ ఎండ తినేస్తోందని విశేషంగా చెప్పారు. ఈయన కథలకు పెట్టే పేర్లు చాలా సాదాసీదాగా ఉంటాయి. ఈ పేర్లు కథలోని కొంత విషయాన్ని పాఠకులకు ముందుగానే తెలియజేస్తాయి. దాంతో మిగిలిన కథ తెలుసుకోవాలనే కుతూహలం పాఠకునిలో కలుగుతుంది. కథలలో కుతూహలంతో పాటు వ్యంగ్యం కూడా కనిపిస్తుంది. కథకు పెట్టిన పేరుతో ఆ కథలో ఒక పాత్ర కనిపిస్తుంది. ఆ కథలో ఆ పాత్రే ప్రధానమవుతుంది. ప్రస్తుత కథ షోకుపిల్లి. అంటే డబ్బున్న పిల్లి. ధనవంతులచే పెంచబడుతున్న పిల్లి. ఈ కథలో పెట్టుబడిదారుడు రావుగారు. ఈయనకు ఇద్దరు పిల్లలు. కూతురు మాలినిరావు ఒక పిల్లిని పెంచుకుంటుంది. మాలినిరావు పెంచుకుంటున్న షోకుపిల్లి ఒకరోజు పార్కులో ఉండే ఒక కోడిని చూసి భయపడుతుంది. ఆ రోజునుండి అహింసా పిల్లిగా పిలువబడుతుంది. దాంతో మాలినిరావు చాలా బాధపడుతుంది. రావుగారి కొడుకు నందూ బేబి. ఒక పేదింటి అమ్మాయితో తిరుగుతుంటాడు. కాని పెళ్ళి చేసుకుందామని కాదు. రావుగారు కొడుకు నుండి ఆ అమ్మాయిని వేరుచేయడంలో తనకారు డ్రైవరు సహాయం తీసుకుంటాడు. ఎందుకంటే కారు డ్రైవరు కూడా ఆ అమ్మాయి జాతికి చెందినవాడే. ఆమెను వ్యభిచారిగా చిత్రించి పోలీసుల చేత అరెస్టు చేయిస్తారు. ధనవంతులు ఏమీ చేసిన చెల్లుతుంది. అలా చెల్లడానికి కారకులు మాత్రం పేదవాళ్ళే. “ ఈ కమ్యూనిస్టు రోజుల్లో కూడా తమవంటి పెద్దవార్ని నమ్ముకొని విశ్వాసంగా ఉండే నౌకర్లున్నందుకు రావుగారి కళ్ళు ఆనందాశ్రువుల్తో నిండిపోయేయి.” (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి.

(సం). 30 జూలై, 2007: 850)

ఈ కథలో ఒక చోట రావుగారి కొడుకును ఉద్దేశించి షోకైన మగపిల్లలు చెడిపోతున్నారని చెప్పటం జరుగుతుంది. ఈ కథలో రావుగారి కొడుకును షోకుపిల్లితో పోల్చుకోవచ్చును. షోకుపిల్లి కూడా మొదట్లో కోడికి భయపడి అహింసాపిల్లిగా ఉంటుంది. సమయం వచ్చినపుడు కథలో చివరకు అది ఒక పక్షిని తింటుంది. దాంతో మాలినిరావు తాను పెంచుకుంటున్న పిల్లి అహింసా పిల్లి కాదని, హింసాపిల్లి అని మురిసిపోతుంది. అలాగే రావుగారి కొడుకు అందమైన అమ్మాయితో తిరుగుతాడుకాని పెళ్ళి చేసుకోమని ఆ అమ్మాయి అడిగేసరికి వదిలేస్తాడు. ఈ కథలో ధనవంతుడైన రావుగారి కొడుకు పేదింటి అమ్మాయిని మోసం చేస్తాడు. ఒకరకంగా ఆమెను దోచుకుంటాడు. రావుగారు తనకింద పనిచేసే డ్రైవరు సహాయంతో ఆమె జీవితాన్ని నాశనం చేయిస్తాడు. ఆయన మరొక రకంగా ఆమె జీవితం దోచుకుంటాడు. ఏరకంగా చూసిన ధనవంతులు పేదవాళ్ళ జీవితాల్ని దోచుకుంటున్నారు. దీనికి మధ్యతరగతి దిగువ తరగతుల వాళ్ళే సహకరిస్తున్నారు. కథలో చివరకు షోకుపిల్లి పక్షిని భక్షిస్తుంది. షోకైన మగవాడు ఒక అమ్మాయి జీవితాన్ని భక్షిస్తాడు. నేటి ప్రపంచంలో కూడా ఇటువంటి షోకైన మగవాళ్ళెందరో ఉన్నారు. అమ్మాయిల జీవితాలతో ఆడుకుంటున్నారు. నిత్యం మనం మీడియా ద్వారానో, పత్రికల ద్వారానో ఎన్నో విషయాలు వింటుంటాం చూస్తుంటాం.

***తప్పుకథ***

శాస్త్రిగారి ప్రతి కథలోనూ ఏదో ఒక విశిష్టత కనిపిస్తుంటుంది. ఈ కథలో పాత్రల పరిచయం విభిన్నంగా ఉంటుంది. కథలో పాత్రలను పరిచయం చేసే తీరు ఆసక్తిదాయకంగా ఉంటుంది. అలాగే కథలోని సంఘటనలు కూడా కథను రసవత్తరంగా ముందుకు నడిపిస్తాయి. ఈ కథలో మధ్య, దిగువ తరగతి ప్రజల జీవితాలు కనిపిస్తాయి. మధ్యతరగతి వాళ్ళు దిగువ తరగతులను దోచుకోవడం అనేది ఉండదు, కాని వీళ్ళ స్వార్థానికి దిగువన ఉన్న ప్రజలు కొంతవరకు బలైపోవడం జరుగుతుంది. కథంతా డబ్బు చుట్టూ తిరుగుతుంది. మధ్యతరగతి వాళ్ళు అవసరాల నిమిత్తం డబ్బు కోసం ఏవిధంగా ఉంటారో తెలుస్తుంది.





ఈ కథలో శ్రీకంఠరావుగారిది మధ్యతరగతి కుటుంబం. లాయరుగా క్లైయింటుల దగ్గర ఫీజు ఖచ్చితంగా తీసుకుంటారు. ఒక్క పైసా కూడా తగ్గరు. దీనికి కారణం కూతురికి పెళ్ళి చేయాలి. నరసయ్య అనే యువకుడు తన తండ్రి తరపున ఒక కూనీ కేసులో వాదించమని రావుగారిని అడుగుతాడు. అయితే తక్కువ ఫీజు తీసుకుని వాదించనని ఈయన చెప్పడంతో ఆ యువకుడు వెళ్ళిపోతాడు. అక్కడితో మొదటి ఘట్టం పూర్తవుతుంది. రెండవ ఘట్టంలో కొంతకాలానికి ఒక వ్యక్తి తన తల్లిని తీసుకుని డాక్టర్ మూర్తి దగ్గరకు వచ్చి తన తల్లికి వైద్యం చేయమని అడుగుతాడు. ఈ ఘట్టంలో కూడా డబ్బు లేని కారణంగా డాక్టర్ అతని తల్లికి వైద్యం చేయడు.

ఈ రెండు ఘట్టాలలోనూ లాయర్, డాక్టర్ ఇద్దరూ డబ్బు కోసం వారివారి వృత్తులకు అన్యాయమే చేస్తారు. దాని ఫలితం నరసయ్య తన తల్లిదండ్రులను కోల్పోతాడు. నేటి ప్రపంచంలో కూడా మనిషిలో ఉండే స్వార్థం వలన అనేక సమస్యలు ఎదురవుతున్నాయి. రోజురోజుకీ ఎన్నో అన్యాయాలు, అక్రమాలు పెరిగిపోతున్నాయి. వీటన్నింటికి ప్రధాన కారణం డబ్బు. దీనిమూలంగా మానవసంబంధాలకు విలువ లేకుండా పోతుంది. శాస్త్రిగారి కథలలో ఈ అంశం స్పష్టంగా అవగతమవుతుంది.

ప్రస్తుత కథలో చివరకు లాయర్, అతని కూతురు, అల్లుడు డాక్టర్ మూర్తి, అందరూ ఒక కారు ప్రమాదంలో చిక్కుకుంటారు. ఆ ప్రమాదం నుండి వారి కుటుంబాన్ని కాపాడింది మాత్రం డబ్బు లేని నరసయ్య. కాపాడినందుకు కృతజ్ఞతగా లాయర్, డాక్టర్ అతనికి ఏమీ ఇవ్వగలరు. నరసయ్య తల్లి మరణించడానికి ఆమె జబ్బు ప్రత్యక్షంగా కారణమైనప్పటికి డాక్టర్ మూర్తి పరోక్షంగా కారణమవుతాడు. నరసయ్య తండ్రి మరణించడానికి వేరొక కారణం ఉన్నప్పటికి లాయర్ మరొకరకంగా కారణమవుతాడు. డాక్టర్ని , లాయర్ని రక్షించడంలో మాత్రం నరసయ్య పాత్ర ప్రత్యక్షంగా ఉంటుంది.

నేడు కొంతమంది డాక్టర్లు పేషేంటుల దగ్గర వసూలు చేసే ఫీజు చూస్తే ఒకరకంగా వారిని నిలువు దోపిడికి గురిచేస్తున్నారు. అలాగే లాయర్లు, పోలీసులు, వివిధ రంగాలలో పనిచేసే ఉద్యోగులు లంచాల రూపంలో ప్రజలను దోపిడి చేస్తున్నారు. విద్యార్థులను స్కూళ్ళు ఫీజుల రూపంలోనూ దోపిడి చేస్తున్నాయి. ఇలా సమాజంలోని ప్రతి ఒక్కరూ ఏదో ఒక విధంగా దోపిడికి గురిఅవుతున్నారు.

### రవ్వ కథ

అనగా అనగా ఓ వూరికి రాజు అని కథ ప్రారంభమవుతుంది. ఆ ఊళ్ళో కామయ్య అనే కామందు ఉన్నాడు. అదే ఊళ్ళో నిరుపేద కండల కనకయ్య అతని తొమ్మిదేళ్ళ కొడుకు రవ్వల రాజు ఉన్నారు. కనకయ్య అతని కొడుకు తిండిలేక పస్తులుంటారు. ఒకరోజు కనకయ్య అతని కొడుకు ఊరి చివర ఉన్న కొండ ప్రాంతాన్ని మూడు సంవత్సరాల పాటు బాగుచేసి పంట పండిస్తారు. పంట చేతికొచ్చి తిందామనేసరికి కామయ్య అడ్డుతగులుతాడు. ఆ భూమిపంట తనదంటాడు. దాంతో కనకయ్య న్యాయస్థానంలో కేసు వేస్తాడు. ఏం లాభం ఊళ్ళో కామయ్యకు భయపడి ఎవరూ సాక్ష్యం చెప్పరు. దాంతో కనకయ్య కేసు ఓడిపోతాడు. కష్టపడి సాగుచేసుకున్న భూమి పోయిందని కనకయ్య గుండె ఆగిపోతుంది. వారి కష్టాన్ని దోచుకున్న కామయ్య మీద రాళ్ళు విసిరి ఆ పోరాటంలో చనిపోతాడు కొడుకు రవ్వలరాజు. ఈ విషయాన్ని కథలో "అంతటితో ఆ రవ్వలరాజుకి ఈ నేలమీద నూకలాశ అవసరం లేకపోయింది. ఆ దినంతో అతనికి తొమ్మిదేళ్ళు నిండిపోయేయి." ( వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 837) అని చాలా సునిశితంగా చెప్పారు.

ఈ కథలో కనకయ్య, అతని కొడుకు శ్రమనంతటినీ కామయ్య దోచేసుకుంటాడు. చివరికి వారిద్దరి ప్రాణాలను కూడా దోచేసుకుంటాడు. ఇది ఒక భూకామందు, నిరుపేదకి మధ్య జరిగిన యుద్ధం. ఈ యుద్ధంలో నిరుపేద ఓడిపోతాడు. భూకామందు గెలుస్తాడు. బలవంతుడు బలహీనుణ్ని దోచుకుంటాడు. ఈ కథలోనూ అదే జరిగింది. ఇక్కడ అన్యాయానికి బలైనది ఒక నిరుపేద. పలుకుబడి కలిగిన కామయ్య తప్పు చేసిన తప్పించుకోగలిగాడు. ఒక నిరుపేద జీవితాన్ని ఇందులో చిత్రించారు. ఒక పేదవాడి కష్టాన్ని ధనికుడు ఏవిధంగా దోచుకున్నాడో ఈ కథలో చూపించారు.

నేటి సమాజంలో కూడా ఇట్లాంటి తగదాలతో కోర్టుకేసులు అనేకం ఉంటాయి. అయితే కేసులు వాయిదాలే తప్ప తీర్పులు ఉండవు. తీర్పు వచ్చేసరికి వారి తరం పోయి మరొక తరం వచ్చేస్తుంది. అప్పటికే ఆర్థికంగా దెబ్బతిన్న వీరు వాటిమీద ఆశ వదిలేసుకుంటారు.





### బుద్బుదం కథ

"నీట్లో లేచిన బుడగ ఎంతోసేపు ఉంటుందా? ఉండదు. ఏమవుతుంది? బద్దలైపోతుంది. బద్దలవడం అంటే ఏమిటి? అంటే నీట్లో మళ్ళీ కలిసిపోవడమే కదా! అంటే ఏవన్నమాటా? – బుడగ నీట్లోంచి లేచింది. నీట్లోనే కలిసిపోయింది. నీరు నీర్లోనే ఉన్నప్పుడు ఆ నీరు పుట్టడం ఏమిటి? ఆ నీరు రావడం ఏమిటి? అందులో అర్థం లేదుకదా! అంతా అసందర్భమే కదా! ఆ సంగతి మీకు బోధపడింది కదా. అందుచేత తెలిసికోండి ఆ నీరు ఏవిధంగా అయితే పుట్టలేదో చావలేదో ఆవిధంగానే ఆత్మపదార్థం అనేది పుట్టదు – చావదు!" (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 820) అని శాస్త్రులుగారు గుళ్ళో పదిరోజుల పాటు దీనిపై ప్రసంగించారు. ఈ కథలో ముఖ్యమైన పాత్రపేరు శ్యాంబాబు. పదేళ్ళు, చదువుకుంటున్నాడు. అతని తల్లి ఆరోగ్యం బాగు కావాలని గుళ్ళో శాస్త్రులగారి పదిరోజుల ప్రసంగం వింటుంటాడు. చివరిరోజు ప్రసంగం విని ఇంటికి వెళ్ళేసరికి తల్లి చనిపోయి ఉంటుంది. శ్యాంబాబు ఏడుస్తాడు. ఎంతో బాధపడతాడు. కథలో ఈ విషయ ప్రస్తావన అత్యంత అద్భుతంగా రాశారు రావిశాస్త్రిగారు. ఆ మాటలు " నీటిబుడగ పోయినపుడు నీటిబుడగ లేదుస్తాయో లేదో భగవంతుడికి తెలియాలి. కాని, మనిషి పోతే మాత్రం మనుషులేడుస్తారు. శాస్త్రిగారూ చావు నిజం కాదని మీకు బాగా తెలిసి ఉండవచ్చు. కాని బాధ నిజమని మాత్రం శ్యాంబాబుకి మీకంటె బాగా తెలుసు." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 822) కథలో ఈ మాటలు చదువుతుంటే మనసును హత్తుకునే అనుభూతి కలుగుతుంది.

అలాగే శాస్త్రిగారి కథలో కొన్ని వర్ణనలు చూస్తే "మంచిరాజుల రాజ్యంలో మురికి మనుష్యులు కూడా ఆనందంగా ఉంటారుంటారన్నట్టు! మురుగు కాలువలు కూడా చందమామల వెన్నెల అలలకి మురిసిపోతున్నాయి. రొట్టెల షావుకారుగారి కొత్తమేడ ఆయన కొత్తకోడల్లాగే ఈ వెన్నెలంతా నాదే అన్నట్టుగా రాణీలా నిల్చుంది." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 821) ఇట్లాంటి వర్ణనలు ఈయన కథలలో ఎన్నో కనబడతాయి.

ఈ కథలో తల్లి చనిపోయే రోజు కొడుకుని తొందరగా ఇంటికి రమ్మనడం,

మాట్లాడుతాననడం, తల్లి చనిపోయిన తరువాత కొడుకు పూర్తిగా మారిపోవడం కుటుంబ బాధ్యతలు తీసుకుంటాననడం మొదలైన ఘట్టాలు ఉంటాయి. ఈ ఘట్టాలతోనే ఇటీవల కాలంలో ఒక సినిమా (రఘువరన్ బిటెక్) వచ్చింది. బహుశ సినిమా తీసిన వ్యక్తి ఈ కథ చదివి ఉండవచ్చు లేదంటే యాదృచ్ఛికం కూడా కావచ్చు.

***జాతక కథ***

ఈ కథలో చలపతి అనే వ్యక్తి జాతకాలు చెబుతాడు. ఒకరోజు ఇతని దగ్గరకు వేంకటసత్యం అనే వ్యక్తి జాతకం చెప్పించుకోవడానికి వస్తాడు. అతని జాతకం చూస్తుండగా చలపతి దగ్గరకు ఒక పసిపిల్లవాడు వస్తాడు. ఆ పిల్లవాణ్ని తీసుకోవడానికి ఒక ఆడమనిషి వస్తుంది. ఈ విషయాన్ని రావిశాస్త్రిగారు కథలో చెప్పిన తీరు కొత్తగా ఉంది. "ఆ బాలుడి మేనత్తో పెత్తల్లో కాబోలు భడవాకానా అంటూ వడివడిగా పుస్తెలూ, హారాలూ, గాజులూ, చప్పుడు చేసికొంటూ వచ్చి ఆ బాలుణ్ణి తీసుకొని గుండెలకి హత్తుకొని ముద్దాడుకొంటూ వెళ్ళింది." (వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007: 818) మరికొంచెం సేపటికి ఆ బాలుడు మళ్ళీ చలపతి దగ్గరకు వస్తాడు. వాణ్ని తీసుకెళ్లడానికి మళ్ళీ పుస్తెలూ, హారాలూ, గాజులూ మరోసారి బాలుణ్ని లాక్కెళ్ళిపోవడం జరిగిందని కథలో చెబుతారు. బాలుణ్ని పుస్తెలూ, హారాలూ, గాజులూ లాక్కెళ్ళిపోవడం ఏంటి? అవి ధరించిన ఆడమనిషి తీసుకెళ్ళిందనే భావాన్ని గమ్మత్తుగా చెప్పారు.

ప్రస్తుత కథలో వేంకటసత్యం అనే వ్యక్తి తన జాతక కాగితాన్ని చలపతికి చూపించి జాతకం చెప్పించుకుంటాడు. చలపతి అతను పూర్ణాయుష్కుడని చెబుతాడు. అయితే తరువాత ఆ జాతక కాగితం తనది కాదని చనిపోయిన తన అన్నదని తల్లి చెబుతుంది. ప్రస్తుత సమాజంలో కూడా ఇటువంటి జాతకాలు చెప్పించుకునేవారున్నారు. జాతకాలు చెప్పేవారున్నారు. జాతకం చెప్పేవారు చెప్పించుకునేవారి దగ్గర నుండి నగదు, ఇతరత్రా దోపిడి చేస్తున్నారు. ఇదొక రకమైన దోపిడి.

రావిశాస్త్రిగారి బాకీకథలు ముఖ్యంగా దోపిడి వ్యవస్థకు సంబంధించినవి. రాజులు ప్రజలను, భూస్వాములు కూలీలను, పెట్టుబడిదారులు కార్మికులను, నేడు ధనవంతులు పేదవాళ్ళను దోపిడి చేస్తూనే ఉన్నారు. సుఖజీవులు కష్టజీవుల శ్రమను దోచుకుంటున్నాయి. బలవంతుడు బలహీనుణ్ని లోబరుచుకుంటున్నాడు. ఈయన కథలలో





వర్గపోరాటం కనిపిస్తుంది. కథలలో మధ్య, దిగువ వర్గాలకు సంబంధించిన పాత్రలు ఎక్కువగా కనిపిస్తాయి. కథలో పాత్రలు మనుషులతోనే గాకుండా జంతువులతో కూడా కనిపిస్తాయి. దిగువ, మధ్యతరగతి ప్రజలను మానవసంబంధాలు, ఆర్థిక కారణాలు ఏవిధంగా ప్రభావితం చేస్తాయో తెలియజేశారు. ఈయన కథలు డబ్బు, పలుకుబడి, అధికార గర్వంతో కొంతమంది చేస్తున్న అన్యాయాలను ప్రశ్నిస్తూ ఉంటాయి. సామాన్య ప్రజల జీవితాలను కథలలో ప్రతిబింబించారు. నిత్యజీవితంలో జరిగే సాధారణ సంఘటనలు తీసుకుని కథలు రాశారు. తన చుట్టూ ఉండే మనుషుల జీవితాలను చిత్రించారు. వాస్తవ పరిస్థితులను కథల రూపంలో మలిచారు. సమాజంలో ఉండే వివిధవర్గాల వ్యక్తుల గూర్చే కాకుండా వారి వృత్తుల గూర్చి కూడా రాశారు. నాటి నేటి ప్రపంచంలోని మనుషుల మనస్తత్వాలను కథలుగా మలిచారు. ప్రభుత్వోద్యోగులు, రాజులు, నాయకులు మొదలైన వారందరి గూర్చి కథలుగా రాశారు. ఈయన కథలు ఒక్కొక్కటి ఒక్కొక్క సినిమాగా తీయవచ్చు. ప్రస్తుత వ్యాసానికి బాకీకథలలో పదింటిని మాత్రం తీసుకున్నాను. ఈయన రాసిన ఒక్కొక్క కథ చదువుతుంటే ఒక్కొక్క రకమైన అనుభూతికి పాఠకుడు లోనవుతాడు. కొన్ని కథలు మనసుకు హత్తుకునేవిధంగా ఉన్నాయి. మరికొన్ని కథలు చదువుతుంటే అంత అద్భుతంగా ఎలా రాయగలిగారూ అని ఆశ్చర్యమేస్తుంది.

**గ్రంథసూచి**

వివినమూర్తి ; రాయుడు, ఎం.వి. (సం). 30 జూలై, 2007. *రాచకొండ విశ్వనాథశాస్త్రి రచనా సాగరం (సమస్త లభ్యరచనల సంపుటం).* మనసు ఫౌండేషన్. బెంగుళూరు.

రమ. 30 జూలై 2013. *మనసున్న కథకుడు* (వ్యాసం).

www. TeluguOne.com/Sahityam.

# రావిశాస్త్రి ముక్కులు కథలు – విశ్లేషణ

: వెంకట రామయ్య గంపా

**వ్యాస ఉద్దేశ్యం:** స్వాతంత్ర్యానికి పూర్వం, తరువాత ఉన్న పరిస్థితులను ప్రత్యక్షంగా చూసిన వ్యక్తి రావిశాస్త్రి. వారు చూసిన పరిస్థితులనే *ముక్కులు* కథల్లో చిత్రించారు. *ముక్కులు* కథల్లో కనిపించే నాటి పరిస్థితులను విశ్లేషించడంతో పాటు ఆ సమస్యలు ఇప్పుడు ఎలా ఉన్నాయో వివరించడం ఈ వ్యాస ఉద్దేశ్యం.

********

"శ్రీశ్రీ తెలుగు కవిత్వాన్ని మరో మలుపు తిప్పితే, రావిశాస్త్రి తెలుగు కథను పెద్ద మలుపు తిప్పాడు. ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియలలో తెలుగు కథకు అంతర్జాతీయ ప్రమాణాలు సాధించిన ఇద్దరు, ముగ్గురిలో రావిశాస్త్రి ఒకడు...

...ప్రఖ్యాత విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి చెప్పినట్టు సినిమా నటులకు లాగా రచయితలకు కూడా అభిమాన సంఘాలంటూ ఏర్పడితే రావిశాస్త్రి అభిమాన సంఘానిదే ప్రథమ స్థానం అవుతుంది." (రంగనాథాచార్యులు, కె.కె. 2000. పుట.3-4.) రావిశాస్త్రిగారికి ఆధునిక తెలుగు సాహిత్యంలో ఎటువంటి స్థానం ఉందో తెలుసుకోవడానికి పైన పేర్కొన్న మాటలు చాలు.

కొంతమంది రచనలు సర్వకాలాలకు అన్వయమవుతాయి. అటువంటి రచనలు ఆయా భాషా సాహిత్యాలు ఉన్నంత వరకు ఉంటాయి. అటువంటి రచన చేసిన కవి/ రచయిత ఆయా భాషా సాహిత్యాలు ఉన్నంత కాలం జీవిస్తారు. అటువంటి వారిలో రావిశాస్త్రిగారు ఒకరు. వీరు రాసిన కొన్ని రచనలు అన్ని కాలాలకు వర్తిస్తాయి. వాటిల్లో *ముక్కులు* కథలు విష్ణుశర్మ రాసిన పంచతంత్ర కథల్లాగా అనిపించాయి. ప్రజారచయితగా, మార్క్సిస్టు రచయితగా పేరుగాంచిన రావిశాస్త్రిని విష్ణుశర్మతో పోల్చడం ఏమిటి? అనే ప్రశ్న కలుగుతుంది. కానీ నాకు మాత్రం అలానే అనిపించింది.

విష్ణుశర్మ ఆనాటి సమాజాన్ని వివిధ పక్షులు, జంతువుల పాత్రల ద్వారా ధర్మం, నీతి పేరుతో విద్యార్థులకు బోధించాడు. రావిశాస్త్రి తన *ముక్కులు* కథల్లో





స్వాతంత్ర్యానంతరం మన జీవితం ఏ విధంగా ఉందో చిత్రించారు. విష్ణుశర్మ పంచతంత్ర కథల్లాగా ఒక్కొక్క వర్గానికి చెందినవారు ఒక్కొక్క స్వభావాన్ని కలిగి ఉంటారని తన *ముక్కులు* కథల్లో వివరించారు. విష్ణుశర్మ కథల్లో పక్షులు, జంతువులు పాత్రలుగా కనిపిస్తాయి. నాడు పంచతంత్రకథల్లో కనిపించే పరిస్థితులే నేటి సమాజంలో ఉన్నాయి. పంచతంత్రకథల్లోని పాత్రలను నేటి సమాజానికి అన్వయించుకోవచ్చు. అలాగే రావిశాస్త్రి *ముక్కులు* కథలు తాను రాసిన కాలానికే కాకుండా నేటి సమాజానికి కూడా అన్వయించుకోవచ్చు.

విష్ణుశర్మ కథల్లో గుంటనక్కలు బలవంతుడైన రాజు పక్కనచేరి బలహీన జంతువులను బలిపశువులను చేస్తాయి. అదే విషయం రావిశాస్త్రి *ముక్కులు* కథల్లో కూడా కనిపిస్తుంది. ప్రజాస్వామ్యం, ఎన్నికల పేరుతో ఎన్నుకోబడిన కొంతమంది రాజకీయ నాయకులు, వారికి తొత్తులుగా మారిన అధికారులతో కలిసి బలహీనులను బలవంతంగా ఎలా పీడించుకు తిన్నారో వివరించారు. అడవికి రాజైనవారు ఏంచేసినా, ఎన్ని ప్రాణులను చంపినా తప్పులేదు. ప్రజాస్వామ్యంలో రాజ్యాధిపతులు ఎన్ని అవినీతి పనులు చేసినా, ఎంత దోచుకున్నా వారు మహారాజులే. స్వాతంత్ర్యానంతరం మాత్రమే కాదు, ఈనాటికీ ఇదే పరిస్థితులు దాపురించి ఉన్నాయి. విష్ణుశర్మ పంచతంత్రకథల నేపథ్యం అందరికీ తెలిసిన విషయమే. కొంతమంది దృష్టిలో అవి పిట్టకథలు. వాటికి చరిత్రలో తగినంత బలం లేదు. కానీ రావిశాస్త్రి కథలకు ఒక ప్రత్యేక నేపథ్యం ఉంది. ఆ నేపథ్యాన్ని అర్థం చేసుకోకుండా రావిశాస్త్రి ముక్కుల కథలను విశ్లేషించడం సరైన విధానం కాదు.

భారతీయుల పరిస్థితి ఒక దశలో పెనం మీద నుంచి పొయ్యిలో పడ్డ రీతిన మారింది. రాచరిక వ్యవస్థలో వివిధ రకాల హింసలకు గురైన ప్రజలు బ్రిటీషువారి పరిపాలనలో అన్నిరకాల ఇబ్బందులు ఎదుర్కొన్నారు. బ్రిటీషువారు తమ కుయుక్తులతో దేశాన్ని ఎన్ని విధాలుగో దోచుకోవాలో అన్ని విధాలుగా దోచుకున్నారు. బ్రిటీషువారికి ఎన్ని రకాల అవలక్షణాలు ఉన్నాయో వాటన్నిటిని మనకు నేర్పించి వెళ్ళారు. బ్రిటీషువారు తమ కుయుక్తులను, కపట తెలివితేటలను తమవారిపై కాకుండా ఇతర దేశీయులపై ప్రయోగించారు. బ్రిటీషువారిలో ఉన్న మంచికంటే చెడును ఎక్కువగా ఆదర్శంగా తీసుకున్న భారతీయులు వారు నేర్పిన అన్ని విషయాలను విదేశీయులపైన కాక,

తనవారిపైనే ప్రయోగించడం మొదలు పెట్టారు. ఫలితంగా బ్రిటీషువారి కాలంలో భారతీయులు ఎటువంటి పరిస్థితులు ఎదుర్కొన్నారో అటువంటి పరిస్థితులనే స్వాతంత్ర్యానంతరం కూడా చవిచూస్తున్నారు.

*బుక్కులు* కథా సంకలనంలో మొత్తం ఎనిమిది కథలున్నాయి. రావిశాస్త్రి ఈ కథలను 1962 – 1965 మధ్యలో రచించారు. 1962 నాటికి స్వాతంత్ర్యం వచ్చి పదహైదు సంవత్సరాలైంది. *బుక్కులు* కథలు రాసే సమయానికి రావిశాస్త్రికి నాలుగు పదుల వయసు దాటింది. సమాజం పట్ల, సాహిత్యం పట్ల ఒక స్పష్టమైన అవగాహన ఏర్పడింది. స్వాతంత్ర్యానికి పూర్వం ఉన్న పరిస్థితులకు, తరువాత పరిస్థితులకు తేడా కనిపించలేదు. ఎన్నో పోరాటాలు చేసి సంపాదించుకున్న స్వాతంత్ర్యం సామాన్యులకు ఎటువంటి ప్రయోజనాలను కల్పించలేదు. రోజురోజుకు సామాన్యుల పరిస్థితి దిగజారిపోయింది. చివరకు మనిషి అనేవాడు మనిషిగా బతకలేని పరిస్థితి ఏర్పడింది. పేదవారు మరింతగా దిగజారారు. డబ్బున్నవాడు, పదవి ఉన్నవాడు దేశాన్ని ఇష్టం వచ్చినట్లు దోచుకోవడం మొదలు పెట్టారు. బలవంతుల దృష్టిలో బలహీనులు యంత్రపు పనిముట్లుగా, అవసరం తీరిన తరువాత విసిరిపారేసే ఒక వస్తువుగా పరిగణించబడ్డారు. ప్రజాస్వామ్యం పేరుతో ధనవంతులు, రాజకీయ నాయకులు, అధికారులు ప్రజలను పీడించారు. ఈ పరిస్థితులన్నీ రావిశాస్త్రిని ప్రభావితం చేశాయి. *బుక్కులు* కథల్లో ఈ అంశాలన్నీ కనిపిస్తాయి.

శ్రీశ్రీ రచించిన బుక్కులు కవితలోని తొమ్మిది అంశాలలో ఎనిమిది అంశాలను కథావస్తువుగా స్వీకరించి వాటి ఆధారంగా కథలను రచించారు. సంకలనంలోని కథలను క్లుప్తంగా పరిచయం చేయడం అవసరం.

మొదటి కథ *కుక్కపిల్ల*. ఒక ధనవంతుడైన అవకాశవాది ఒక హైక్లాసు కుక్కను అడ్డం పెట్టుకుని ఒక ధనవంతురాలైన అమ్మాయిని, ఆ అమ్మాయి ఆస్తిని కాజేయడానికి ప్రయత్నించి సఫలుడవుతాడు. అమ్మాయిని, ధనాన్ని పొందిన తరువాత అందుకు సహాయపడిన కుక్క గుడ్డిదైపోగానే దాన్ని వదిలించుకుంటాడు ఆ అవకాశవాది.

రెండవ కథ *అగ్గిపుల్ల*. శేషగిరి అనే ధనవంతుడు తన ధనిక స్వభావంతో ఇతరులతో, ముఖ్యంగా స్త్రీలతో చెలగాటమాడుకు నే స్వభావం కలిగినవాడు. అతను





తన సరదా కోసం పరిచయస్తుల ద్వారా పల్లెటూరికి వచ్చి అక్కడవున్న సముద్రాలు అనే స్త్రీని లోబరుచుకుని అనుభవిస్తాడు. కొంత కాలానికి తిరిగి అదే పల్లెటూరికి వచ్చిన శేషగిరి సముద్రాలను గుర్తుపట్టక, ఆమె చెల్లిని చూసి సముద్రాలుగా భ్రమ పడతాడు. ఆ విషయం గురించి ఆలోచిస్తున్న సముద్రాలు పరధ్యానంలో వంటచేస్తూ, ప్రమాదవశాత్తు పొయ్యిలో పడి చనిపోతుంది.

మూడవ కథ *సబ్బుబిళ్ళ*. ధనవంతుడు, పలుకుబడి కలిగినవాడు లక్షింపతి. అతను పరిశుభ్రత ముఖ్యంగా భావించే వ్యక్తి . ముఖ్యంగా శరీర పరిశుభ్రతకు కారణమయ్యే సబ్బంటే పిచ్చి. సబ్బును హోదాకు చిహ్నంగా భావిస్తుంటాడు. అయితే అతని పెద్ద కూతురు గదిలో ప్రతి రోజు ఒక సబ్బు మాయమైపోతుంది. సబ్బును దొంగలించే దొంగను కనుక్కోవడం కోసం తీవ్రంగా ప్రయత్నించి చివరకు తన ఐదు సంవత్సరాల తన చిన్నకూతురు ఆ సబ్బులను కుష్టివాళ్ళకు దానం చేయటాన్ని గమనిస్తాడు. తన ఐదు సంవత్సరాల కూతురు తనకు నేర్పిన పరిశుభ్రత గురించి ఆలోచిస్తాడు.

నాల్గవ కథ *రొట్టెముక్క*. ఒక డాక్టరేట్ కలిగిన విద్యావేత్త, యువ నాయకునిగా చెలామణి అవుతున్న రింగ్ లీడర్, సాహిత్యాన్ని జీవనోపాధిగా చేసుకుని రాజకీయ నాయకులకు, ధనవంతులకు కొమ్ముకాసే మూర్తి కవి, మందు వ్యాపారం చేసే వ్యక్తి కలిసి మందు విందు చేసుకోడానికి కావలసిన ఏర్పాట్లు చేసుకుంటారు. అయితే అక్కడకు ఒక యువ రచయిత ప్రవేశించి తాను రాసిన ఒక రొట్టెముక్క కథను వినిపిస్తాడు. ఆ కథలో ఒక వితంతువైన కాంతమ్మ అనే స్త్రీ ఒక ధనవంతుని ఇంట్లో పని మనిషిగా చేరి, అతని కొడుకు సుఖానికి బలై, రోగాలతో ఆ ఇల్లు విడిచిపోతుంది. ఆమె కొడుకులిద్దరు ఆకలితో ఒక రొట్టెముక్క కోసం కొట్లాడుకుని, అందులో ఒకడు చనిపోతాడు. మందు పార్టీ చేసుకుంటున్న విద్యావేత్తకు, యువ రాజకీయ నాయకుడికి, కవికి యువ రచయిత వినిపించిన కాంతమ్మ వ్యథ రొట్టెముక్క కథ.

ఐదవ కథ *అరటితొక్క*. జగన్నాథం స్కూలు టీచర్. కష్టాల ఊబిలో చిక్కుకుని నిరాశ నిస్పృహలతో జీవితం మీద విరక్తితో బాధపడే వ్యక్తి. ఒకసారి తనతో పాటు పడవలో ప్రయాణిస్తున్న ఒక ముసలావిడ మాటలు వింటాడు. ఆ వయసులో కూడా ఆమెకు జీవితం మీద ఉన్న ఆసక్తిని గమనిస్తాడు. అనుకోకుండా పడవ తిరగబడి

ముసలావిడ మునిగిపోయేస్థితిలో జగన్నాథం ఆమెను కాపాడతాడు. ఫలితంగా అందరు తనను అభినందించడంతో తిరిగి జీవితం పట్ల కొత్త దృక్పథాన్ని అలవర్చుకుంటాడు.

ఆరవ కథ *బల్లచెక్క.* కాంతయ్య ఏ పని చేసినా దానికి లాభం ఆశించే వ్యక్తి. తన మేనళ్ళుడు సత్యమూర్తి కార్పెంటర్. ఒక రోజు కాంతయ్య ఇంటికి వస్తాడు. ఇంటికి వచ్చిన సత్యమూర్తి పనికి రాని పాత చెక్కలతో కుర్చీలు, బల్లలు చేస్తాడు. వాటిని కాంతయ్య అధిక మొత్తం లాభంతో అమ్మేస్తాడు. ఆ లాభం సత్యమూర్తి శ్రమ. అప్పటి వరకు లాభం అంటే ఏమిటో తెలియని కాంతయ్య కూతురు, కాంతయ్య స్వభావానికి ఆశ్చర్యపోతుంది.

ఏడవ కథ *తలుపు గొళ్లెం.* పైడి రాజు అనాథ. మొదట అతడిని బిక్షుక దంపతులు, తరువాత దొంగ బిక్షగాళ్ళైన దంపతులు పెంచుకుంటారు. దొంగతనం చేసే సమయంలో దొరికిపోయి తల్లి చనిపోతుంది. అతన్ని పెంచుకున్న తండ్రి దొంగతనానికి వెళ్ళి వేరొకరు పన్నిన కుట్రద్వారా ఖూనీ కేసులో జైలుకెళ్తాడు. అన్ని సమయాల్లోను ధనవంతులైనవారు తప్పులు చేసి తప్పించుకోవడం గమనిస్తాడు. చివరకు ఒక పథకం ప్రకారం ధనవంతుడు కావడానికి ప్రయత్నం చేసి సఫలుడవుతాడు. కాంట్రాక్టరుగా, సంఘంలో పేరున్న వాడిగా మారిపోతాడు.

చివరి కథ *హారతి పళ్లెం.* ఐదు సంవత్సరాల వయసుగల శారద కథ. ఆమె తండ్రి జబ్బుతో చనిపోయాడు. అమ్మ, అన్న అనారోగ్యంతో మంచం మీద ఉన్నారు. వారికి మందులు తీసుకురావడానికి వెళ్ళి ప్రమాదవశాత్తు లారీ కిందపడి చనిపోతుంది శారద.

కథల్లోని వస్తువును పరిశీలించినప్పుడు కథల్లోని అంశాలు స్వాతంత్ర్యం తరువాత మనం ఎదుర్కొన్న సమస్యలు మన ముందుంచినట్లు కనిపిస్తుంది. ఇందులో కనిపించే అంశాలు స్వాతంత్ర్యం వెలువడిన కాలంలో మనం ఎదుర్కొన్న సమస్యలు మాత్రమేనా! అంటే కాదు అని చెప్పుకోవాలి. ఇదే పరిస్థితి నేటికి కొనసాగుతూ ఉంది. నాటి సమస్యలు నేడు మరొక రూపాన్ని సంతరించుకున్నాయి. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో ఏ సమస్యలు ఉన్నాయో నేడు కూడా అవే సమస్యలున్నాయి. వాటిని పరిశీలిద్దాం.

*బుక్కులు* కథల్లో కనిపించే ప్రధాన విషయం అవినీతి. రాజకీయ నాయకులు,





ధనవంతులు తమ అధికారం బలంతో, పలుకుబడితో అవినీతికి పాల్పడి మరింత ధనవంతులుగా మారుతున్నారు. అగ్గిపుల్ల కథలో ఒక అవినీతికి పాల్పడిన పాత్ర గురించి వివరిస్తూ "మావాడు - అంటే ప్రకాష్ కాదు - మా చుట్టంగాడు తెల్లవాట్టైంలో జూనియరింజనీరుగా సర్వీసులో కాలు పెట్టేడు. అలా నలిగి నలిగి వార్‌టైంలో అసిస్టెంటింజనీరయేడు. ఆ తరువాత హి నెవ్వర్ లుక్డ్ బాక్! స్వరాజ్యం ఒచ్చేక ఎగ్జిక్యూటివయేడు. తరువాత చీఫ్ కూడా అయేడు. డిపార్ట్‌మెంటు పబ్లిక్ వర్క్సు బాబూ! అంటే కల్పవృక్షం. ... లూటీ చేసేడం, పంది కొక్కులా తినేడం– వాటికి కొత్త తొడుగులు తొడగడంలో ఇంగ్లీషు వాళ్ళు చాలా పేన్స్ తీసుకుని మనవాళ్ళకి కొత్త కొత్త శిల్పాలు ముప్పేరనే విషయం. అది మీరు కాదన్లేరు. ... ఏద్దొరికితే దాన్ని ఎవడికీ దొరక్కుండా తినేడంలో తెల్ల గురువుల్ని మించిన నల్ల శిష్యుడు మా చుట్టంగాడు." (వివినమూర్తి, రాయుడు, యం.వి.(సంపా.). 2007. పుట.463.)

పై మాటల ద్వారా నాడు దేశంలో అవినీతి ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. పాశ్చాత్యులు ఇక్కడున్న సంపద దోచుకోవడానికి వివిధ పద్ధతులు, మార్గాలు అవలంభించారు. బ్రిటీషువారు తన సామ్రాజ్యాన్ని విస్తరించుకోవడానికి ఇక్కడున్నవారికి అవినీతి విధానాన్ని ఎరగా చూపారు. బ్రిటీషువారికి పూర్వమే అవినీతి ఉన్నప్పటికీ అది ఒక అలవాటుగా మారింది మాత్రం బ్రిటీషువారి కాలంలోనే. స్వాతంత్ర్యం తరువాత అవినీతే మార్గం, అవినీతే పరమ పవిత్రం అనే స్థితి ఏర్పడింది. నేడు అవినీతి అనేది మనదేశంలో మహావృక్షంగా ఎదిగింది. కొంతమంది రాజకీయ నాయకులు, అధికారులు దేశాన్ని ఎన్ని విధాలుగా దోచుకోవాలో అన్ని విధాలుగా దోచుకుంటున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచంలో అవినీతి ఎక్కువ ఉన్న దేశాల పక్కన భారతదేశం కూడా నిలబడింది. వేలు, లక్షల కోట్ల అవినీతి కేసుల్లో రాజకీయ నాయకులతో పాటు ప్రభుత్వ ఉన్నతాధికారులు అరెస్టవుతున్నారు. అధికారులు, రాజకీయ నాయకుల అవినీతి విధానాలు విసుగెత్తి స్వతంత్ర భారతదేశం కోసం బ్రిటీషువారితో పోరాడినట్లు అవినీతి రహిత భారతదేశం కోసం ప్రజలు ఉద్యమించే పరిస్థితి నెలకొనింది. ఈ విషయాన్నే రావిశాస్త్రిగారు వ్యంగ్యధోరణిలో స్వాతంత్ర్యానంతర భారతదేశంలో ఉన్న అవినీతి విధానాన్ని కథల్లో వివరించారు.

*బుక్కులు* కథలో కనిపించే మరో ముఖ్యమైన అంశం విపరీతమైన పేదరికం. ఎందరో త్యాగాల ఫలితంగా రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించగలిగాం. కానీ ఆర్థిక సమానత్వం సాధించడంలో మాత్రం విఫలమయ్యాం. కొంతమంది మాత్రం అత్యంత ధనవంతులుగా మారిపోతున్నారు. కానీ మరికొంతమంది కనీస అవసరాలు కూడా లేక కటిక పేదరికంలో మగ్గిపోతున్నారు. ఇదే పరిస్థితిని రావిశాస్త్రి తన *బుక్కులు* కథా సంకలనంలో వివరించారు. కొన్ని కథలు హృదయాన్ని కదిలించేవిగా ఉన్నాయి. ముఖ్యంగా *రొట్టెముక్క, హారతి పళ్లెం, అరటితొక్క* కథల్లో చాలా పాత్రలు పేదరికంతో దుర్భర జీవితాన్ని గడుపుతున్నట్లు తెలుస్తుంది.

"అది కల్లురొట్టె. అది అతి చిన్నదే. దాని ఖరీదు కూడా బేడ్డబ్బులే. అదెక్కడ పడితే అక్కడ బజార్లో దొరుకుతున్నదే. దాని కోసం ప్రాణాలు పోవడం చాలా అసందర్భవే(. అవునంతే. అది నిజవే(. నువ్వొప్పుకుంటావు.

కానీ, ఇక్కడే, ఈ వూళ్ళోనే, ఈ రోజే, ఈ ఉదయమే( ఆ పాకలో– ఆ కల్లురొట్టె కోసం ఆ తమ్ముడు వేసిన కేక వింటే నువ్వలా నివ్వెరపోయి నిలబడిపోతావు; దానికోసం ఆ అన్నదమ్ముల పోరాటం. ఘోర యుద్ధం చూస్తే భయంతో గడగడ వణికిపోతూ ఆ పోట్లాట ఆపొచ్చునని కూడా మరిచిపోతావు. అంబలి తినే కంచుగిన్నె చిన్నవాడి చేతిలోంచి పెద్దవాడి తలమీదికి ఎగిరి ఢీకొనగా కారిన రక్తం చూసి ఎక్కడున్నవాడివక్కడ ఎలా ఉన్నవాడివలా కొయ్యబారి పోతావు; కిందనిపడ్డ కంచుగిన్నె తీసి గదలా గొడ్డల్లా ఎత్తి, వెర్రివాళ్ళా ఆ తమ్ముణ్ని నులక మంచం మీదికి తోసి నొక్కిపెట్టి ఆ ఆయుధంతో ఆ పెద్దవాడు ఆ చిన్నవాడి తలమీద మృత్యుభీకరంగా ఎలా మోదేడో, బాదేడో చూస్తే – మృదుజీవి! – నువ్వు మూర్ఛ పోతావు.

కొంత సేపయాక, నువ్వు తెప్పరిల్లి తేరుకున్నాక, అక్కడ మంచం మీద పడుకున్న పదేళ్ళ లేలేత శవాన్ని, మంచం మీదా, మంచం కిందా మంచం పక్కలా పడి ఇంకా సరిగా ఆరని ఇంకని రక్తపు మరకల్ని, మడుగుల్నీ, నెత్తురుతో తడిసి ఏడుస్తూ కూర్చున్న వేళ్ళులేని మొండిచేతుల్తో గుండలు బాదుకు ఏడ్చే తల్లినీ, అక్కడే ఆ పక్కనే ముక్కలు ముక్కలుగా తెగిపోయి మట్టిలో నలిగిపోయి ధూళితో నిండిపోయి ఎర్రగా తడిసిపోయిన కల్లు రొట్టెముక్కల్నీ, అక్కడ చిందరవందరగా చేరి, చివరికి కాకిమూకలా మూగి గొల్లున





గోల చేసే చింకిచింకి ముఖాల్నీ 'చిల్లర చిల్లర ప్రాణాల్నీ' ఆ శ్మశానంలాటి వాడనీ, అందులో కమ్మల గోరీల్లాటి గుడిసెల్నీ ఆమురికినీ, పెంటనీ, రొచ్చునీ, రోతనీ అదంతా చూస్తొంటే నీ కళ్ళు తడియవు. నీగుండె కరగదు." (పైదే. పుట.574)

మరొక కథ హారతిపళ్ళెం. ఇందులో " శారద తల్లి మరో గంట సేపటికి తనవేడి కళ్లు బరువుగా విప్పి కొడుకు మీద చెయ్యివేసి చూసింది. కుర్రాడి వళ్లు కాల్తొంది. ఆమెకి చాలా భయం వేసింది. తన వేడిచేతికే కుర్రాడి వళ్లు కాల్తూ తగుల్తోంది. అమ్మో నాకు భయం వేస్తొంది. తండ్రీ పరాత్పరా ఎలా కాపాడతావో నువ్వే కాపాడాలి. మందులేదు మాకూ లేదు. ఎవరూ సాయం లేరు. శారదా చిన్నపిల్ల. నోర్లేని పక్షి. అదేం చెయ్యగల్దు. పండగ పూటా అన్నం లేదు. ఆకలేస్తే అదలా పడుకుంటుంది. కానీ నాతో అయినా చెప్పదు. ఇంతసేపు నీ పూచ్చేసింది. దానికి పట్టెడన్నం పెట్టలేకపోయాను. నేనేం తల్లిని." (పైదే. పుట.592)

ఈ రెండు సన్నివేశాలు రచయిత సృష్టించినవే. సహృదయుల హృదయాలను కలచివేసే సంఘటనలే. ఈ సన్నివేశాలు చదివిన తరువాత ఎటువంటివారైనా కాసేపు ఆలోచిస్తారు. ఈ పరిస్థితి రాచరిక వ్యవస్థలో కొనసాగింది. బ్రిటీషువారి కాలంలో కొనసాగింది. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా ఇలాంటి పరిస్థితులను రావిశాస్త్రి తన కథల్లో చిత్రించారు. స్వాతంత్ర్యం వచ్చి ఆరున్నర దశాబ్దాలు గడిచినప్పటికీ నేటికీ అదే పరిస్థితి కొనసాగుతుంది. ఎంతో మంది ఆకలి చావులతో మరణిస్తున్నారు. నాడు తినడానికి తిండికి మాత్రమే మనిషి కష్టపడ్డాడు. నేడు తాగడానికి మంచినీళ్ళ కోసం కూడా కష్టపడాల్సిన పరిస్థితి నెలకునివుంది. నాడు తిండిని మాత్రమే కొన్న మనిషి నేడు నీళ్ళను కూడా కొంటున్నాడు. ప్రజలకు తాగడానికి కనీసం మంచినీళ్ళను కూడా ప్రభుత్వం అందించలేకపోతుంది. వ్యవస్థ పురోగమనంలో ఉందా? లేక తిరోగమనంలో ఉందా? తెలీని పరిస్థితి.

*బుక్కులు* కథలో కనిపించే మరో అంశం రాజకీయ దురంహకారం. రాజకీయ నాయకులు సామాన్య ప్రజలను కనీసం మనుషులుగా చూడటం లేదు. గతంలో వలసపాలనా కాలంలో బ్రిటీషువారు ఇక్కడవున్న స్థానికులను కూలీలుగా, బానిసలుగా పరిగణించారు. స్వాతంత్ర్యానంతరం రాజకీయ నాయకులు, ధనవంతులు పేదవారిని

ఎందుకు పనికిరానివారుగా పరిగణిస్తున్నారు. డబ్బుతో ఏదైనా చేయగలమనే భావన కలిగివున్నారు. ఆ అహంకార భావంతోనే పేదవారికి డబ్బు ఆశ చూపించి తమ పనులు జరిపించుకుంటున్నట్లు రావిశాస్త్రి కథల్లో కనిపిస్తుంది.

ఇటువంటి అభిప్రాయమున్న పాత్ర *రొట్టెముక్క* కథలో కనిపిస్తుంది. "లోకంలో నూటికి తొంభైమంది గడ్డిపరకలేనని అతని భావం...

...కుక్కల్లో జాతికుక్కలూ, ఊరకుక్కలూ ఉన్నట్టే, మనుషుల్లో కూడా ఎక్కువ్వాళ్ళూ పాలకులూ పాలితులూ ఉంటారని అతనికి ఖచ్చితమైన నమ్మకం ఉంది."

"... గమ్మత్తయిన కార్యక్రమాలు జరిపించి ఆనందిస్తూ ఉంటాడు. ఆవిధంగా అతనొకసారి ఒకడికి అయిదురూపాయలిచ్చి ఎండలో గంటసేపు మోకాళ్ళ మీద నిలబెట్టించేడు. పది రూపాయలిచ్చి పావుగంటసేపు ఒకణ్ని పబ్లిక్ రోడ్డు మీద వెర్రివాళ్ళా కేక వేయించేడు. చెరోనాలుగూ ఒక ఆడామగాకి ఇచ్చి తన ఎదుటనే అరగంటసేపు వాళ్ళిద్దర్నీ ముద్దులాడించేడు; పాతిక రూపాయలిచ్చి ఓ ఆడమనిషిని అర్ధరాత్రి బీచిని నగ్నంగా పరిగెట్టించేడు. ఆ మాదిరిగా చాలా మందిచేత చాలా పనులు చేయించేడతను." (పైదే. పుట. 569)

పైన పేర్కొన్న విషయాన్ని పరిశీలిస్తే ధనవంతులు పేదవారిని చూస్తున్న విధానం అర్థం అవుతుంది. ధనవంతులు పేదవారిని మనుషులుగా కాక జంతువులుగా భావించినట్లు కనిపిస్తుంది. ఒక జంతువును యజమాని కొన్నప్పుడు ఆ యజమాని చెప్పినట్లు జంతువు వింటుంది. ఇక్కడ కూడా ధనవంతుడు పేదవాడికి డబ్బిచ్చి, కొన్ని నిమిషాలపాటుగానో, కొన్ని గంటలపాటుగానో తను చెప్పినట్లు చేయమంటున్నాడు. మనుషుల పేదరికం వారి స్థాయిని మనుషులుగా కాక జంతువుల స్థాయికి దిగజార్చింది. జంతువులకు సిగ్గు, లజ్జ, మానం, మర్యాద ఇవేమి ఉండవు. ఇక్కడ మనుషులు కూడా పేదరికం వలన వాటిని వదలి తమ పొట్ట నింపుకోవడం కోసం ధనవంతుడిచ్చే డబ్బు కోసం దేనికైనా సిద్ధంగా ఉన్నారు. డబ్బుందన్న అహంకారంతో పైన కథలో పేర్కొన్న డాక్టర్‌లాంటి వాళ్ళు ఇతరులు కూడా మనుషులే అనే విషయాన్ని మరిచిపోయి మానవత్వాన్ని పక్కనపెట్టి మరో జంతువులాగా మారిపోయి ప్రవర్తిస్తున్నారు.

రావిశాస్త్రి బుక్కులు కథల్లో కనిపించే మరొక అంశం పాశ్చాత్య సంస్కృతి పట్ల





విపరీతమైన వ్యామోహాన్ని కలిగివుండటం.

అగ్గిపుల్ల కథలో శేషగిరిరావుకు పల్లెటూరు వారన్నా, వారి సంస్కృతియన్నా చాలా చిన్నచూపు. "కామేశం ఉంటున్న పల్లేటి అగ్రహారం చూసి శేషగిరి అసహ్యించుకున్నాడు. "అసలు మన తెలుగువాళ్ళు డర్టీఫెలోస్" అనే అభిప్రాయం అతనికెప్పణ్నించో ఉంది. అగ్రహారం చూసేక "ఈ పల్లెటూరి వెధవలు మరీ డర్టీ బ్రూట్స్" అని అనిపించిందతనికి." (పైదే. పుట. 468) చివరికి ఒక అందమైన ఆడమనిషిని చూస్తే ఆమెను "ఆపిల్ల "పల్లెటూరి పశువే" కానీ "ఎంత అందమైన పశువు! వాట్ ఎ బ్యూటిఫుల్ బీస్ట్!"(పైదే. పుట. 469) అని తన మనసులో అనుకున్నాడు.

వలసవాద పాలనలో పాశ్చాత్యులు వివిధ దేశాలలోని స్థానిక సంస్కృతులను చిన్నచూపు చూశారు. ఒక విధంగా చెప్పాలంటే పాశ్చాత్యులు ఆయాదేశాలలోకి ప్రవేశించక పూర్వం ఆయాదేశాలకు నాగరికతలు లేవు అనే ఒక దురభిప్రాయాన్ని ప్రచారం చేశారు. ఒక విధంగా పాశ్చాత్యుల మాటల్లో చెప్పాలంటే భారతీయులకు నాగరికత తెలీదు. పాశ్చాత్యులు ఈ విషయాన్ని భారతీయులకు ఎన్నివిధాలుగా దుష్ప్రచారం చేయాలో అన్నివిధాలుగా చేశారు.

పక్కింటి పుల్లగూర తీపి అన్న చందాన మనవారు కూడా నాగరికత అంటే పాశ్చాత్యులదేనని, మనవారికి నాగరికత గురించి తెలియదని, అనాగరికులు అనే భావనకు వచ్చేశారు. ముఖ్యంగా ధనవంతులు, విద్యావంతులు కూడా పాశ్చాత్య సంస్కృతి పట్ల వెర్రి వ్యామోహాన్ని, ఆసక్తిని కనబరిచారు. వలసపాలన ముగిసి మన పాలన మనం కొనసాగిస్తున్నప్పటికీ వలసవాదుల సంస్కృతిని కొనసాగిస్తున్నాం. ఇదే భావజాలం రావిశాస్త్రి కథల్లో కనిపిస్తుంది. *అగ్గిపుల్ల* కథలో లండన్ మావయ్యగా పిలవబడే రాజారావు, శేషగిరి రావు, *సబ్బుబిళ్ళ* కథలో లక్ష్మీంపతి మొదలైన వారంతా కూడా ఈదేశంలో ఉండి పాశ్చాత్య సంస్కృతి పట్ల విపరీతమైన వ్యామోహాన్ని కలిగి ఉన్నారు. నేటికీ ఈ పరిస్థితి దేశంలో దాపురించింది. చాలా మంది విద్యావంతులు, ధనవంతుల దృష్టిలో నిరక్షరాస్యులకు, పేదవారికి ఎటువంటి సంస్కృతి లేదు. సంస్కృతి అంటే పాశ్చాత్యులను అనుకరించడం. ధరించే దుస్తులు, తినే ఆహారం అంతా కూడా విదేశీయులను అనుకరిస్తే వారికి సంస్కృతి ఉన్నట్లు లేకపోతే ఎటువంటి నాగరికతా తెలీనట్లే లెఖ్ఖ.

*బుక్కులు* కథల్లో పేదవారి పట్ల/బలహీనుల పట్ల చులకన భావన కనిపిస్తుంది. పేదవారిపట్ల చులకనభావం కలిగివుండటం అనేది ఎప్పటినుంచో ఉన్న విషయమే. కానీ బ్రిటీషువారి కాలం నుంచి పేదవారిని కనీసం మనుషులుగా కూడా చూడటం మానేశారు. వారి దృష్టిలో పేదవారు బానిసలతో సమానం. పేదవారు బ్రిటీషువారికి కావలసిన పనులు చేసేవారుగా కనిపించారు. ఇదే భావన స్వాతంత్ర్యానంతరం కూడా రాజకీయ నాయకులలోనూ, ధనవంతులలోనూ, చివరకు ప్రభుత్వాధికారులలోనూ ఉంది. వీరికి పేదవారి పుట్టుకతోగానీ, జీవనంతోగానీ, మరణంతోగానీ సంబంధం లేదు. రాజకీయ నాయకులకు పేదవారి ఓట్లు కావాలి. ధనవంతులకు పేదవారు పనివారుగా కావాలి. ప్రభుత్వాధికారులు తమ అధికారాలను చూపించడానికి బలహీనులు కావాలి. ఈ విషయాలన్నీ కూడా *బుక్కులు* కథల్లో కనిపిస్తాయి.

పై అంశాలు పరిశీలించిన తరువాత రావిశాస్త్రి బుక్కులు కథలు అన్ని కాలాలకు అన్వయమవుతాయి అనే భావన కలుగుతుంది. ఒక కవి రాసిన కవితలోని వస్తువును తీసుకుని వాటిని కథావస్తువులుగా స్వీకరించి మంచి కథలుగా తీర్చిదిద్దిన విధానం అన్నది గొప్ప విషయం. అది ఒక్క రావిశాస్త్రికే సాధ్యమైంది.

**ఉపయోగించుకున్న పుస్తకాలు**

రంగనాథాచార్యులు, కె.కె. *రాచకొండ విశ్వనాథశాస్త్రి.* న్యూఢిల్లీ. సాహిత్య అకాడమీ, 2000.

వివినమూర్తి, రాయుడు, యం.వి. (సంపా.) *రాచకొండ విశ్వనాథశాస్త్రి రచనా సాగరం.* బెంగుళూరు. మనసు ఫౌండేషన్, 2007.